# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



డిసెంబరు 1967



సంపుటము ; 44 ; : సంచిక 12

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## డిసెంబరు 1967

# శ్రీ శిష్టు కృష్ణమూర్తి

కాలానికి కాళ్లు, సంచలనం, నిశ్శబ్దం,
కాలం వీటితో పయనిస్తున్నది; పరుగెడుతున్నది.

ఎవరికీ వినిపించని, కనిపించని
కాలగమనం, నిశ్శబ్దంలో వింటాను,
సంచలనంలో కంటాను;
కాలంవేసే అంగలు
నా కగుపిస్తూనే వున్నాయి.

స్తబ్దంగా వుం దీలోకం
అనుకుంటాం, కానీ,
కాలం పయనిస్తూనే వుంది.
చలనం లేకపోతే ప్రపంచమే లేదు;
చలనం లోపిస్తే, అదే ప్రళయం

యోగ సాధన, నిశ్శబ్దంలో నిబిడమైనదే!
జ్ఞాన సముపార్జన సంచలనం ప్రసాదించినదే!!

ఏదీ లోపించలేదీ లోకంలో
మన దృష్టిలోపం తప్ప,
ఏదీ తప్పటడుగు వేయలేదు
మానవ పరిశోధన, ప్రవర్తన తప్ప

జ్ఞాతంగానో, అజ్ఞాతంగానో
జగత్తు సాగుతూంది ముందుకు;
జాగరూక మౌతున్నది చలనంతో,
సాగిపోతున్నది సంచలనంతో.

భా ర తి

భావ భారంతో నిండిన
మేధావి పుత్రెలు, కళాకారుల కౌశలాలు,
అన్నీ సంచలన మయమే!

సూర్యుడు, చంద్రుడు భ్రమిస్తూనే వున్నారు,
వాయువును గూర్చి చెప్పాలా!
ప్రకృతి నిత్య పరివర్తనం చెందుతూనే వుంది,
మాతా శిశువుల అనురాగం,
స్నేహం, బంధుత్వం, జాలి, అనుకంప,
ప్రేయసీప్రియుల సమాగమం,
ద్వేషం, ఈర్ష్య, కాఠిన్యం, కర్కశత్వం,
అన్నీ సంచలనం ఫలితాలే!
అన్నీ సచేతన చిహ్నాలే!!

మానవుడు మారలేదనుకుంటే,
లోకం స్తబ్ధమైందనుకుంటే,
ఎలా నమ్మటం?
నమ్మితే, నమ్మిన వాళ్ల ఖర్మ!

కాలానికి కాళ్లు, సంచలనం, నిశ్శబ్దం
కాలం వీటితో పయనిస్తున్నది, పరుగెడుతున్నది.
కాలంవేసే అంగలు,
నాకగుపిస్తూనే వున్నాయి.



# తొలి తెలుగు నవల

డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు

తొలి తెలుగు నవల ఏది? అన్న విషయంలో ఇంత వరకూ ఏకవాక్యత లేదు.

శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు రచించిన 'మహాశ్వేత' తొలితెలుగు నవలని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు ప్రతిపాదించారు.[1]

శ్రీ నరహరి గోపాలకృష్ణమ శెట్టిగారు రచించిన శ్రీ రంగరాజ చరిత్రం తొలినవలని శ్రీ ఓకుమళ్ల కామేశ్వరరావుగా రభిప్రాయపడ్డారు.[2]

ఇక వీరేశలింగం పంతులుగారు తమ స్వీయ చరిత్రలో తెలుగులో మొట్టమొదటి వచన ప్రబంధాన్ని, అంటే నవల అనే వారి అర్థం, తామే వ్రాశామని చెప్పుకున్నారు. పంతులుగారు తెలుగు సాహిత్యంలో అనేకాలైన నూత్న ప్రక్రియలు వెలయించి, వానికి స్థితినీ, ప్రాచుర్యాన్నీ కల్పించి, యుగపురుషులుగా కీర్తింపబడ్డారు. కనుక, తెలుగు నవలకు శ్రీకారం చుట్టింది వారేనని, చాలామంది సాహితీపరులు భావించారు. ఇట్లా భావించటానికి, పంతులుగారు స్వీయ చరిత్రలో వ్రాసుకున్న వాక్యాలే ప్రమాణం కావచ్చును. కాని ఇటీవల వీరేశలింగం పంతులుగారు రచనా వ్యాసంగానికి పూనుకొనక పూర్వమే శ్రీ కొక్కొండవారూ, శ్రీ గోపాలకృష్ణమ శెట్టిగారూ, నవలలు రచించారని పైన చెప్పిన పెద్దలు అభిప్రాయపడ్డారు. తొలి తెలుగు నవల కర్తృత్వాన్ని గూర్చిన పైమూడు అభిప్రాయ భేదాలు పరామర్శింపబడుతున్నవి.

## వచన ప్రబంధము—నవల

నేడు 'నవల' అన్నపేరు రూఢమై పోయిన సాహిత్య ప్రక్రియకు, తొలిదశలో వచన ప్రబంధమన్నపేరు వాడుకలో ఉండేది.

'ఈ వరకు మన యాంధ్రభాషలో జనుల యాచార వ్యవహారములను దెలుపుచు నీతిబోధకములుగా నుండు వచన ప్రబంధములేవియు లేకపోవుట యెల్లవారికిని విశదమయియే యున్నదిగదా?' అని వీరేశలింగం పంతులుగారు తమ రాజశేఖర చరిత్రానికి వ్రాసిన పీఠికలో దాన్ని వచనప్రబంధంగానే పేర్కొన్నారు. ఇంతేకాక, స్వీయచరిత్రలో కూడా అనేక సందర్భాలలో 'నవల' అన్న ఆంగ్లపదానికి సమానార్థకంగా వచన ప్రబంధమనే పంతులుగారు అనువదించారు. తెలుగున మొట్టమొదటి వచన ప్రబంధాన్ని నేనే రచించానని వారు చెప్పుకొన్న సందర్భంలో కూడా ఇది గమనార్హం.

రాజశేఖర చరిత్రం మొట్టమొదట 1878 వ సంవత్సరంలో వెలువడింది. అంతకు ఆరు సంవత్సరాల ముందే వెలువడ్డ శ్రీ రంగరాజచరిత్రం ముఖపత్రం పైనకూడా ఆ పుస్తకాన్ని గూర్చి హిందువుల యాచారములు తెలుపునట్టి నవీన ప్రబంధమనే ఉన్నది. ఆ కాలంలో యీ నవీన ప్రబంధాన్ని సమీక్షించిన పురుషార్థ ప్రదాయిని అనే మాసపత్రిక 'Rangarajucharita, by N. Gopalakrishnama chetty garu, is a novel in a sweet, easy, grammatical and idiomatic Telugu prose' అని ప్రశంసించింది.[3]

ఆ కాలంలో ప్రతిపత్రికలోనూ, తెలుగు తెలియని అధికారుల ఉపయోగార్థమున్నూ, తెలుగూ

---

1. శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులు గారు—శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు. భారతి – 1951 మార్చి, ఏప్రియల్, జూలై, నవంబరు సంచికలు.

2. శ్రీ రంగరాజా చరిత—శ్రీ ఓకుమళ్ల కామేశ్వరరావు, ప్రబుద్ధాంధ్ర - 1934 జనవరి సంచిక.

3. పురుషార్థ ప్రదాయిని - 1872 - జూలై నెల సంచిక

ఇంగ్లీషూ రెండూ తెలిసినవారు, తమ విజ్ఞానాన్ని ఇతోధికంగా పెంపొందించుకునేందుకున్నూ, ప్రాయికంగా సాంఘిక సమస్యలూ, రాజకీయాలూ, సారస్వత విషయాలూ, తెలుగులోనూ, ఇంగ్లీషులోనూ కూడా రెండు ప్రత్యేక విభాగాలుగా ప్రచురిస్తూ ఉండేవాళ్ళు. వీరేశలింగం పంతులుగారు నిర్వహించిన వివేకవర్ధనికికూడా ఇట్టిదే ఇంగ్లీషు అనుబంధం ఉండేది.

పురుషార్థప్రదాయిని ఆ కాలంలో చాలా పేరు ప్రఖ్యాతులు పొందిన సారస్వత మాస పత్రిక. మచిలీబందర్‌నుండి వెలువడుతుండేది. కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు తమ ఆంధ్రభాషా సంజీవని సహాయంతో ఈ పురుషార్థప్రదాయినితో వివాదపడుతూ ఉండేవారు. వీరేశలింగం పంతులుగారు పురుషార్థ ప్రదాయినిలో ఆ కాలంలో రచనలు చేస్తూ ఉండేవారు. ఈ పత్రికలలో కూడా ఇంగ్లీషు విభాగం ఉండేది.

ఈ ఇంగ్లీషు విభాగంలోనే నరహరి గోపాలకృష్ణమశెట్టిగారి శ్రీ రంగరాజ చరిత్రం నవలగా ప్రసక్తమైంది. తెలుగు సమీక్షలో వచన ప్రబంధంగానే పేర్కొనబడింది. ఈ వచన ప్రబంధమన్న పదాన్ని నవలకు సమానార్థకంగా శ్రీ గోపాలకృష్ణమశెట్టిగారే సృష్టించారని చెప్పవచ్చును. అంతకు పూర్వం తెలుగులో వచనప్రబంధం వ్రాయటానికి అంటే ఇంగ్లీషులో నవలవంటి సాహిత్య ప్రక్రియను తెలుగులోనికి తీసికొనివచ్చే దృష్టితో, ఎవరూ పూనుకోలేదు. ఈ ప్రయత్నం చేసిన వారిలో గోపాలకృష్ణమశెట్టిగారే ఆద్యులు. నవలకు వచన ప్రబంధమన్న పేరును సృష్టించి ప్రచారంలోకి తెచ్చింది కూడా వీరేనని శ్రీ రంగరాజ చరిత్రం నుండి తెలుస్తున్నది. వారి తరువాత సుమారు, పాతిక సంవత్సరాలవరకూ తెలుగులో వెలువడిన నవలలన్నీ, వచన ప్రబంధాలుగానే పరిగణింపబడ్డాయి. అయినా తెలుగు నవలయొక్క ఉద్భవ వికాస పరిణామాలు చిత్రించేటప్పుడు, గోపాలకృష్ణమశెట్టిగారిని గూర్చి ఎక్కువగా తెలియబడకపోవటం, వారి శ్రీ రంగరాజ చరిత్రం బహుళ ప్రచారాన్ని పొందియుండక పోవటమే కావచ్చును. దీన్నిగూర్చి 1872 వ సంవత్సరంలో అచ్చయిన పుస్తకాల వివరాలను తెలిపే ఫోర్టు సెయింట్ జార్జి గెజట్‌లో ఈ విధంగా వివరింపబడింది.[4]

'This is apparently the first attempt ever made in this part of India at novel writing in Telugu prose'

కాబట్టి పురుషార్థప్రదాయిని, ప్రభుత్వ గెజటు, వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్రల వలన 'నవల' అన్న ఆంగ్లప్రక్రియ, తెలుగులో వచన ప్రబంధమని పిలువబడుతుండేదని తెలుస్తున్నది.

శ్రీ రంగరాజ చరిత్రం కన్నా పూర్వమే రచింపబడినదని చెప్పబడుతున్న 'మహాశ్వేత' రచింపబడినదని చెప్పబడుతున్న కాలానికి ముప్ఫయి సంవత్సరాల తరువాతగానీ ప్రచురింపబడక పోవటంవల్లనూ, నాడుగానీ తరువాతగానీ పుస్తకరూపం పొందకపోవటం చేతనూ, మొట్టమొదటి సారిగా వైజయంతి అన్న పత్రికలో ఇది ప్రచురింపబడిన కాలానికి వచన ప్రబంధానికి, నవల అన్నపదం పర్యాయపదంగా, రూఢమైనందువల్లనూ, మహాశ్వేతను వచన ప్రబంధమని పిలిచారో, లేదో తెలుసుకునేందుకు అవకాశం లేదు.

మహాశ్వేత 1867 వ సంవత్సరంలోనే రచింపబడిందని చెప్పబడుతున్నది.

శ్రీ రంగరాజ చరిత్రం 1872 లో పుస్తకరూపాన వెలువడింది.

వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్రం వివేకవర్ధనిలో 1878 వ సంవత్సరంలో భాగభాగములుగా వెడువడి 1880 వ సంవత్సరంలో మొదటిసారి పుస్తకం రూపం పొందింది. రాజశేఖర చరిత్రం తరువాత పంతులుగారు, సత్యరాజాపూర్వ దేశ యాత్రలు, సత్యవతీచరిత్రం మొదలైన ఇతర వచన ప్రబంధాలు రచించారు.

1893 వ సంవత్సరంలో రాజమహేంద్రవరం నుండి, ప్రచురింపబడ్డ 'చింతామణి' అన్న సారస్వత

4. Fort st George Gezette – 1872 July, August, September.
(Supplement - Third quarter)

మాసపత్రిక, తెలుగు సాహిత్య చరిత్రలో తొట్ట తొలుతగా నవలలపోటీ నిర్వహించింది. ఈ పోటీలో పాల్గొని శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహకవి, సుప్రసిద్ధములైన నవలలనెన్నో రచించారు. 'చింతామణి' పోటీ బహుమానాల ప్రేరణతో తెలుగు సాహిత్యంలో నవలా ప్రక్రియ, బహుళ ప్రచారాన్నీ, పుష్టినీ పొందింది. చిలకమర్తివారు, ఈ పోటీల్లో పాల్గొనే నిమిత్తమే, రామచంద్ర విజయం, అహల్యాబాయివంటి నవలలు రచించారు.

ఈ చింతామణి 1891 వ సంవత్సరంలోనే ప్రారంభింపబడింది. పోటీలుమాత్రం 1893 లో మొదలై ఐదారు సంవత్సరాలు నిర్వహింపబడ్డాయి. ఈ పత్రికకు న్యాపతి సుబ్బారావు పంతులుగారు యాజమాన్యం వహించేవారు. వీరేశలింగం పంతులు గారి కీపత్రికతో సన్నిహితసంబంధముండేది. 1893వ సంవత్సరంలో నవలా రచనను ప్రోత్సహించే ఉద్దేశంతో పోటీని ఏర్పరచిన కాలానికికూడా, యీ ప్రక్రియకు వచన ప్రబంధమన్న పేరే వ్యవహారంలో ఉన్నది. అప్పటికి 'నవల' అన్నపేరు పర్యాయపదంగా వాడుకలోకి రాలేదు. ఈ పత్రిక నిర్వహించిన పోటీలలో పాల్గొనే వారికి మార్గదర్శకంగా ఉండేందుకు కొన్ని నిబంధనలు ప్రకటించారు. ఈ పోటీ నిబంధనలలో వచనప్రబంధానికి కుండలీకరణాలలో Novel, Novellette అన్న ఇంగ్లీషు పదాలు వాడబడటం గమనించాలి. ఈ నిబంధనలు ఇంకా యీ విధంగా వివరణాత్మకంగా ఉన్నాయి.[5]

'ప్రబంధమనగా కల్పితమైన కథ. ఆ కథను పురాణేతిహాసాదులనుండిగాని, చరిత్రములనుండిగాని గైకొని కథాసారస్యమున కనుకూలముగా నుండు లాగున దానికి నూతనాంశములనుజేర్చి పెంచి వ్రాయవచ్చును. లేదా కవి మొదటినుండి కడవరకును స్వబుద్ధిచేతనే నూతన కథను కల్పించియైనను వ్రాయవచ్చును......'

'శృంగారమో, వీరమో యేదో యొక రసమును ప్రధానముగా జేసికొని వివిధ రస సంయుతముగ నుండునట్లుగాని, యాయా రసమును పోషించుటకయి వివిధ కష్ట సుఖములను ప్రయత్నములను, కార్యవిఘాతములను, కార్యసాఫల్యములను మధ్యమధ్య సందర్భోచితముగ దీసికొని పచ్చుకథయంతయు నొక్కని చరిత్రమువలె నుండునట్లు వ్రాయవలెను.'

'మహాశ్వేత' తొట్టతొలుతటు వచనప్రబంధం కాగలదా అన్నమీమాంసను పరిష్కరించటానికి, పై వివరణలు తోడ్పడతవని, విపరంగా ఉద్ధరింపబడ్డాయి. అదీకాక నాటి సాహితీపరులలో నవల యొక్క లక్షణాలను గూర్చిన అభిప్రాయాలుకూడా పై వివరణలవలన స్పష్టపడుతున్నవి.6

ఈ వివరణలనుబట్టి వచనప్రబంధమందలి ఇతివృత్తం అనువాదం కారాదనీ. రసము శృంగారమో, వీరమో అయిఉండాలనీ, ఏకనాయకాశ్రయత్వము ఉండాలనీ, నాటిసాహితీపరులు భావించారని తెలుస్తున్నది. తెలుగు సాహిత్యంలోని ప్రబంధ ప్రక్రియయొక్క లక్షణాలనన్నిటినీ స్వీకరించి, వచనంగా రూపొందిస్తే, ఆ ప్రయత్నం నవలగా రూపొందుతుందని వాళ్లు తలంచినట్లుగా కనపడుతున్నది. ఈ దృష్టిని పురస్కరించుకొనే, సంస్కృత సాహిత్యంలోని కాదంబరి, వాసవదత్తలను, ప్రబంధాలుగా, సాహిత్యవేత్తలు పరిగణించారు. కళాపూర్ణోదయాన్ని పద్యనవల అని భావించారు. ఇంగ్లీషులోని నవలాప్రక్రియయొక్క లక్షణాలు, సంస్కృత సాహిత్యంలోని కాదంబరి, వాసవదత్త వంటి ప్రబంధాలలో ఉన్నాయనీ, తెలుగులోనూ ప్రబంధాలుగా వెలసిన వాటిలోనూ, అవి పద్యకృతులు కావటమనే ప్రధానభేదాన్ని మినహాయిస్తే, ఆ లక్షణాలు ఉన్నాయనే, సాహిత్యవేత్తలు తలంచినటూ పై నిబంధనలవలన స్పష్టం.

---

5. చింతామణి 1893 మార్చి, ఏప్రియల్ సంచికలు.

6. 'నవల యనగా కృత్రిమమైన (అంటే స్వకపోల కల్పితమన్న భావం కావచ్చు) స్వాభావికమగు నితివృత్తము గలిగి తరచు ఉత్తమ నాయకోపేతమయి, శృంగార వీరరసములలో నేదేని యొకటి ప్రధానముగాగల వచన ప్రబంధ విశేషము'- వివేక చంద్రికా విమర్శన (1897) పీఠికలో శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు.

కాని ఆంగ్ల సాహిత్య ప్రభావం, కొత్తగా తెలుగులో కాలూనిన యీ ప్రక్రియపై, అపరిమేయమన్న విషయం వాళ్ళు గ్రహించకపోలేదు. ఈ ప్రక్రియ ప్రాచుర్యం పొందటానికి ఆంగ్ల సాహిత్య ప్రభావం, ఎంతగా పనిచేసిందో శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి గారు, శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు ప్రకటించిన అభిప్రాయాలనుండి తెలుసుకొనవచ్చును. వేంకటరాయశాస్త్రిగారు తెలుగులో నవలా రచనావిర్భావం గురించి యీ విధంగా భావించారు.[7]

'మనవారు మేకదాటుగా చిరకాలము పురాణముల నాంధ్రీకరించి, తరువాతం బ్రబంధంబుల నిపిగి, యిపుడు అన్యములందొడంగినారు. మరియు గీర్వాణ నాటకముల నెఱింగియు, హూణనాటకములం జదువు వరకు, నాటకములు వ్రాయరైరి. గీర్వాణ కథల నెరింగియు హూణనవలలంగాంచిన దనుక నవలలపయిం బడరైరి.'

ఇదే అభిప్రాయాన్ని బ్రహ్మయ్య శాస్త్రుల వారు కూడా వెల్లడించారు.[8]

'ఈ విధమగు గ్రంథము లింగ్లీషు భాషయందు విశేషముగా గలవు కాని, మన భాషలయందంతగా గానరావు. అందులో తెనుగునందు బొత్తిగా లేవు. సంస్కృతమునందన్నను వాసవదత్త, కాదంబరిలోనగు వాని నీ తరగతిలోనివానిగా జెప్పవచ్చును. ఆంధ్ర మందుగల కళాపూర్ణోదయము గద్య పద్యాత్మముగాగాక, కేవల వచన భూయిష్టమైనచో నీ విధమగు దానిని గానే జెప్పవచ్చును......'

'మనదేశమం దింగ్లీషుభాష వ్యాపించిన తరువాత నీ లోపమును పూర్తిచేయు తలంపుతో నొకరిద్దరు నొకటి రెండు నవలలను వ్రాసినను నేటి వరకు నీ లోపము లోపముగానే యున్నది......'

ఇక యీ సాహిత్యప్రక్రియకు నవల అన్న పేరు తెలుగున ఎప్పటినుండి వ్యవహారంలోకి వచ్చిందోకూడా బ్రహ్మయ్యశాస్త్రిగారి వివేకచంద్రికా విమర్శనంనుండి తెలిసికొనవచ్చును. ఈ వివేకచంద్రికా విమర్శనం తొలుత శ్రీ గురజాడ శ్రీరామమూర్తిపంతులుగారు నడుపుతూఉండిన 'రాజయోగి' పత్రికలో ప్రచురింపబడి, తరువాత 1897 వ సంవత్సరంలో పుస్తక రూపాన వెలువడింది. వీరేశలింగంపంతులుగారి రాజశేఖర చరిత్రానికి వివేకచంద్రిక నామాంతరం. రాజశేఖర చరిత్రంపై నాటికీ, నేటికీ కూడా వివేకచంద్రికా విమర్శనలవంటి సమగ్రమైన విమర్శన గ్రంథం ఇంకొకటి వెలువడనేలేదు.

ఈ వివేకచంద్రికా విమర్శనం పీఠికలోని

'ఆంగ్లేయభాషలో నావల్ (Novel) అను పదము 'క్రొత్త'యను నర్థముగల 'నవ్' అను పదమునుండి పుట్టినది. ఈ 'నవ్' అను దానికి 'నవ'యను మన సంస్కృతపదమునకుగల సంబంధము తేటతెల్లమేకదా? కావున నవల యనగా నవాన్‌విశేషాన్, లాతిగృహ్ణాతీతి నవలా, అనగా కొత్తవిశేషంబులు గలదని యర్థము వచ్చుచున్నది. హూణభాషయందు నీ మాటకిదే యర్థమగుటచే 'నావల'ను పదమునకు సరియైన వేరొక సంస్కృత పదమునకయి ప్రయత్నము చేయక 'నవల'యని యీ పదమునే నే నిట వాడుచున్నాను.' అను వాక్యాలను పురస్కరించుకొని 'నవల' అన్న పదం 1897 నుండి సాహిత్య పరిభాషలోకి ప్రవేశించిందని తెలిసికోవచ్చును. చింతామణి కూడా 1893 లో పోటీలు నిర్వహించినప్పుడు 'నవల' అన్న పదం ఉపయోగించలేదు. 1894 వ సంవత్సరంలో నిర్వహింపబడిన పోటీలో చిలకమర్తివారి రామచంద్ర విజయం ప్రథమ బహుమానం పొందింది. చిలకమర్తి వారు నవలను 'ఆఖ్యాయిక' అన్నారు. చిలకమర్తివారి స్వీయచరిత్రలోకూడా యీ నవలల పుట్టుపూర్వోత్తరాలనుగూర్చి, చింతామణి బహుమానాలనుగూర్చి వివరింపబడింది. 'పాశ్చాత్యదేశ పద్ధతిని మనభాషలో గూడ నాఖ్యాయికలను (నవలలు) వ్రాయింపదలచి పోటీపరీక్షలు బెట్టి వారి స్వధనములోనుండి (న్యాపతి సుబ్బారావు పంతులుగారు) బహుమానముల నీయ నారంభించిరి. ఈ యుత్కృష్టకార్యమువలననే మన దేశములో కొత్త నవల లెన్నో తలయెత్తినవి' అని చిలకమర్తివారు స్వీయచరిత్రలో వ్రాశారు.

---

7. వేదం వేంకటరాయశాస్త్రిగారి జీవిత చరిత్రము—V. V. astry పు. 55—

8. వివేకచంద్రికా విమర్శనం (పీఠిక) — శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి.

కనుక నవల అన్నపదం 1897 లో పుట్టి తదాదిగా ప్రచారాన్ని పొందినదనీ, అంతకుపూర్వం యీ ప్రక్రియ వచనప్రబంధంగా వ్యవహరింపబడే దనిన్నీ, 1872 లో వెలువడిన శ్రీ రంగరాజ చరిత్రం కానీ 1878 లో వెలువడిన రాజశేఖర చరిత్రం కానీ, ఆనాడు నవలగా పిలువబడలేదనిన్నీ, సంస్కృతం లోని వాసవదత్త, కాదంబర్యాదులు, ఇంగ్లీషులో నవల అనబడే ప్రక్రియయొక్క లక్షణాలు కలిగినవైనా, తెలుగులో నవలావిర్భావం, సంస్కృతభాషా సంబంధి కాదనిన్నీ, ఆంగ్ల వాఙ్మయ ప్రభావంవల్లనే యీ ప్రక్రియ తెలుగులో ఆవిర్భవించి, పరిణతి చెందిన దనిన్నీ తేటతెల్లమవుతున్నది.

ఈ దృష్టితో పరిశీలించిచూస్తే శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు రచించిన 'మహాశ్వేత' తొలి తెలుగు నవల, అగునా? అన్నది విచారణీయం అవుతున్నది.

## మహాశ్వేత

మహాశ్వేత 1867 వ సంవత్సరంలోనే రచింప బడినదని చెప్పబడుతున్నది. కాని 1895 వ సంవత్సరంలోకాని వెలుగు చూడలేదు. పనప్పాకం ఆనందా చార్యులవారు 'వైజయంతి'అన్న పత్రికను ఆ కాలంలో నిర్వహిస్తూవుండేవారు. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు తమ 'మృగావతి' కావ్యాన్నీ, ఇంకా యితర రచనలను యీ పత్రికలోనే వెలయింపచేశారు. ఈ పత్రికలో 'మహాశ్వేత' కొంతభాగం వెలువడింది. సంస్కృత కాదంబరిలోని కొంతభాగమైన 'మహాశ్వేత' వృత్తాంతాన్ని యథామాతృకంగా అనువదించి 'మహాశ్వేత' అని పేరుపెట్టటంకన్నా శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు చేసిన మార్పు ఏమీలేదు. 'తెనుగున నవలా రచనకు పంతులుగారు ప్రథములు' అని శ్రీ నిడుదవోలువారు వ్రాశారు.

దీని కుపబలకంగా శ్రీ శివశంకరపాండ్యాగారను వారు కొక్కొండవారి విగ్రహతంత్రానికి వ్రాసిన పీఠిక లోని వాక్యాలను వారు ఉదహరిస్తున్నారు. కొక్కొండ వారి విగ్రహ తంత్రానికి పీఠికగా, వారి జీవిత విశేషాలు గురించీ, వారి ప్రతిభాసంపత్తినిగూర్చీ శివశంకర పాండ్యాగారు ఆంగ్లంలో ఉపోద్ఘాతం వ్రాశారు. వీరు గుజరాతీలైనా, ఆనాటి చెన్నపట్నంలో స్థిరపడినవారు కాబట్టినీ, సంస్కృతభాషాకోవిదులు కాబట్టినీ వేంకటరత్నం పంతులుగారితో సన్నిహిత పరిచయాన్ని కలిగియుండవచ్చును. వీరు విగ్రహతంత్రం పీఠికలో 'In 1867, he (Venkataratnam Pantulu) Composed the first Telugu Novel by name Mahasweta, founded on the pleasant story of Kadambari the masterpiece of Bana Bhatta in sanskrit...' అని వ్రాశారు.

ఈ వ్యాక్యాలను ఆధారం చేసికొని శ్రీ వేంకట రావుగా రీవిధంగా ప్రతిపాదిస్తున్నారు. 'వేంకట రత్నము పంతులుగారు దీనిని రచించడములో విశేష మున్నది. మరాఠీ, గుజరాతీ, కన్నడభాషలలో కాదంబరి అంటే నవల అనే వాడుకగా నిలిచినది. కాదంబరికథ నవలవలె నడుచునది కనుక అది నవలకు పర్యాయపద మైనది. ఇంగ్లీషులోని నావల్ (Novel) అను పదము నవల యైనదని చెప్పుదురు. నవల సాంస్కృతికముగా సాధింపవచ్చును' అని 'ఆంధ్ర వచన రచనా పరిణామము' (అముద్రితం) అన్న గ్రంథంలో శ్రీ వేంకటరావుగారు వ్రాశారు. కనుక సంస్కృతంలోని కాదంబరిని నవలగా గ్రహిస్తే, కాదంబరిలోని ఏక దేశమైన మహాశ్వేత వృత్తాంతాన్ని వేంకటరత్నం పంతులుగా రనూదితం చేశారు. కనుక, అది తెలుగులో తొలి నవల అని శ్రీ వేంకటరావుగారి నిష్కర్ష. కాని నవలాప్రక్రియ ఆంగ్లవాఙ్మయప్రభావంవలన తెలుగులో ఆవిర్భవించిందనుకొన్నప్పుడు యీ అభిప్రాయం యుక్తిసహం కానేరదు. శ్రీ వేంకటరత్నం పంతులుగారు, తెనుగున వచనకావ్యాలు లేనిలోటును గుర్తించి ఆ లోటును తీర్చవలెనని సంకల్పించి, కాదంబరిని అనువదించి యుండవచ్చును. సంస్కృత నాటకాలను కొన్ని అనువదించినట్లుగా, ప్రౌఢకావ్యమైన కాదంబరినికూడా వారనువదించా రనుకొనవచ్చును.

కాని కాదంబరి కావ్యంలోని ఏకదేశమైన మహాశ్వేత వృత్తాంతాన్ని మాత్రమే గ్రహించటం మాత్ర ప్రయత్నమే అని చెప్పవచ్చును.

కాని యీ అంశాలను పరిశీలించాలి.

మహాశ్వేత 1867 లోనే రచితమైనా

1895 వరకూ ప్రచురితం కాలేదు. నవలగా ప్రశస్తికి రాలేదు.

అర్వాచీనులకు వచనప్రబంధ రచనమునందు మార్గదర్శకంకాదు.

ఈ రచనపై ఆంగ్లవాఙ్మయ ప్రభావం ఏ మాత్రమూలేదు.

ఈ గ్రంథం సమగ్రంకూడా కాదేమోనన్న అనుమానానికి, ఇది ప్రచురింపబడిన వైజయంతి పత్రికలో ఇది పూర్తిగా ప్రచురింప బడకపోవటం, బలం చేకూరుస్తున్నది.

ఇందులోని వాక్యనిర్మాణంకూడా సంస్కృత మర్యాదానుసారిగానే వున్నది. ఈ విషయం యీ క్రింది ఉదాహరణలవలన తెలిసికొనవచ్చును.

'నాస్తి ఖల్వసాధ్యంనామ భగవత్ మనోభువః. క్వాయం హరిణఇవ వనవాస నిరతః స్వభావ ముగ్ధో జనః ? క్వచ వివిధవిలాసరాశిర్గంధర్వ రాజపుత్రీ మహాశ్వేతా ?' (కాదంబరి)

'అయ్యో ! భగవంతుండగు మనోభువున సాధ్యంబులేదు. హరిణంబువలె వనవాస నిరతుండై స్వభావ ముగ్ధుండైన యీ జనుం డెక్కడ ? వివిధ విలాసరాశి గంధర్వరాజపుత్రి మహాశ్వేత యెక్కడ ?' (మహాశ్వేత)

'......ఇత్యభిధాయ ప్రతివచనకాల మప్రతీక్ష్యైవ పురోయాయినా, అంబాయాః ప్రవిశతా, కనక వేత్రలతాకరేణ, ప్రతీహారీజనేన, కంచుకిలోకేన, గృహీత తాంబూల కుసుమపటవాసాంగరాగేణ, చామర వ్యగ్రపాణినా, కుబ్జ కిరాత బధిర వామన వర్షధవ వికలమూకానుగతేన, పరిజనేన సర్వతస్సంరుద్ధో ద్వారదేశో కథ మప్యాస్మనిర్గమః ప్రయయౌ...' (కాదంబరి.)

'ప్రతివచనము న్నిరీక్షింపకయే, ముమ్మున్ను బంగరుబెత్తములు బట్టుకొని ప్రవేశించుచున్నట్టి పని కత్తెలచేతను, కోజలచేతను, తమ్ము లమ్మును బువ్వులను గంధమును గందపుబొడిని గొడుగు సీవురుల నాల వట్టములను గొని వెంటనంటు కుబ్జ కిరాత బధిర వామన బర్బర వికల మూకానుగత పరిజనులచేతను, అంతట నడ్డగింపబడిన తలవాకిటనుండి యెటో వెలువడిపోయెను' (మహాశ్వేత):

ఇంతేకాకుండా శివశంకరపాండ్యాగారు విగ్రహ తంత్రానికి వ్రాసిన ఉపోద్ఘాతాన్ని వీరేశలింగం పంతులు గారు విమర్శించారు. పాండ్యాగారు వ్రాసిన వేంకట రత్నం పంతులుగారు తొలి తెలుగు నవల రచించారన్న వాక్యాలు చూసికూడా, వీరేశలింగం పంతులుగారు తెలుగులో మొదటివచన ప్రబంధాన్ని తామే వ్రాశామని చెప్పటానికి కారణం, వారు 'మహాశ్వేత'ను నవలగా పరిగణించకపోవటమే అని చెప్పాలి. 1913 లో వీరేశలింగం పంతులుగారు తాము మొదటి వచన ప్రబంధం వ్రాశామని చెప్పుకున్నారు.

1895 లోనే మహాశ్వేత వైజయంతిలో ప్రచురింపబడింది. కనుక వీరేశలింగం పంతులుగారు మహాశ్వేతను వచనప్రబంధ మనుకొనలేదు. వీరేశలింగం పంతులుగారు వైజయంతినీ, అందు ప్రచురితమైన మహాశ్వేతనూ చూడలేదేమో అనుకొనటానికి వీలు లేదు. పంతులుగారి చాలా గ్రంథాలపైనా, ముఖ్యంగా కవుల చరిత్రపైనా వైజయంతిలో విమర్శలు వచ్చాయి. పంతులుగారి కవుల చరిత్రను సమీక్షించింది మానవల్లి రామకృష్ణకవిగారే ననుకొనటానికి, ఆ విమర్శనం క్రింద ఎమ్. ఆర్. అన్న పొడి అక్షరాలు దోహదం చేస్తున్నాయి.

అర్వాచీనులైన వారందరూ నవలా రచనకు మార్గదర్శకంగా రాజశేఖర చరిత్రాన్నే గ్రహించారు. కాని, మహాశ్వేతనుకాదు. చింతామణి పోటీ నిబంధన లలోకూడా, మార్గదర్శకంగా రాజశేఖర చరిత్రమూ. సత్యవతీ చరిత్రమూ, పేర్కొనబడినవి. కాని, మహాశ్వేత స్మరింపబడలేదు.

తేలిన సారాంశం ఏమిటంటే, నేడు నవలగా ప్రాచుర్యాన్ని పొందిన సాహిత్యప్రక్రియ, మనకు సంపూర్ణంగా విజాతీయం కాదనీ, సంస్కృతంలో ప్రసిద్ధినిపొందిన వాసవదత్తా కాదంబర్యాదు లీ ప్రక్రియాసంబంధులేననీ తలంచినప్పుడు, మహాశ్వేత తెలుగులో నవలారచనకు తొలి ప్రయత్నం అవుతుంది. ఇట్లా భావించనప్పుడుకాదు. పోనీ కాదంబరిని అనుసరించి, స్వకపోలకల్పనలతో యీ గ్రంథాన్ని వెల

యించినా, ఇది మొదటి వచన ప్రబంధం అయివుండే దేమో! ఆ విధంగా కాకుండా యథామాతృకానువాదం కావటంతో, ఆ ప్రతిపత్తినికూడా కోల్పోయిందని చెప్పాలి. ఇక మరాఠీ, గుజరాతీ, కన్నడభాషలలో వన లకు 'కాదంబరి' అన్న పేరుండటం, అంటే ఆ భాషల్లో నవలను కాదంబరి అని పిలవటం, 'మహా శ్వేత' తొలి తెలుగు నవల కాదు, అని చెప్పటానికి కొంత బాధకంగానే వుంటుంది. అయినా అనువాదా నికి ప్రాథమ్యం ఇవ్వజాలము. అదీకాక ఇంగ్లీషు ప్రభావం మహాశ్వేతపై బొత్తిగాలేదు.

## శ్రీ రంగరాజ చరిత్రము

శ్రీ రంగరాజ చరిత్రమునకు సోనాబాయి పరి ణయమని నామాంతరం వున్నది. 1872 వ సంవ త్సరం వెలువడిం దీవచన ప్రబంధం. బంగాళా ప్రజల ఆచారాలు తెలిపే నవల వ్రాసినవారికి బహుమానం ఇవ్వబడుతుందని నాటి గవర్నర్ జనరల్ అయిన మేయోగారు, బెంగాల్ గెజిట్‌లో ప్రకటించగా, కర్నూలులో డెప్యూటీ కలక్టరుగా ప్రభుత్వోద్యోగాన్ని నెరపుతుండిన నరహరి గోపాలకృష్ణమ్మశెట్టిగారు, ఆ ప్రకటనను చూసి ప్రేరితులై తెలుగులో హిందు వుల యాచారములు తెలుపు నవీన ప్రబంధాన్ని రచించారు. ఇది స్వకపోలకల్పితం. చారిత్రకేతివృత్తం కాకపోయినా పాత్రలు చారిత్రకంగా కనిపిస్తవి. నాయ కుడు మహాకులీనుడై వుండాలన్న ఆలంకారిక సిద్ధాం తాన్ని ప్రమాణంగా వుంచుకొని, విద్యానగరాన్ని పాలించిన శ్రీ రంగరాజును నాయకుణ్ణిగా గ్రహించా నని రచయిత చెప్పుకున్నారు. అంటే పాత్రల పేర్లు మాత్రం చరిత్రనుండి గ్రహించారని తెల్లమవుతున్నది.

ఈ వచనప్రబంధాన్నిగూర్చి వివరిస్తూ తెలుగులో ఇది మొదటి నవల అని మద్రాసు గెజట్ పేర్కొన్నది. వారు యీ గ్రంథాన్ని సమీక్షించిన పురుషార్థప్రదాయిని, దీనిని నవలగానే ఆంగ్లసమీ క్షలో పేర్కొన్నది. బెంగాల్‌గెజట్‌లో వెలువడిన ప్రకటన యీ వచనప్రబంధం ఆవిర్భవించటానికి కారణమైందికాబట్టి, యీ గ్రంథంపైన ఆంగ్ల సాహిత్య ప్రభావంకూడా వున్నది.

వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్ర రచనలో శ్రీ రంగరాజ చరిత్ర ప్రభావంకూడా కొంత కనపడుతున్నది. రాజశేఖర చరిత్రం లోని కొన్ని వన్ని వేశాలు ఆయావరసలతోసహా శ్రీ రంగరాజ చరి త్రంలో కనపడుతున్నవి. శ్రీ రంగరాజ చరిత్రానికి సోనాబాయి పరిణయమని నామాంతరమున్నట్లే, రాజ శేఖర చరిత్రానికికూడా వివేకచంద్రిక అని నామాం తరం వున్నది. అయితే శ్రీ రంగరాజ చరిత్రాన్ని రాజ శేఖర చరిత్రంతో పోల్చిచూస్తే, శ్రీ రంగరాజ చరి త్రంలో శైలీ, ఇతివృత్తమూ మొదలైనవి పేలవం గానూ, అప్రౌఢంగానూ కనిపిస్తవి. శ్రీ రంగరాజ చరి త్రమునకు, రాజశేఖర చరిత్రమునకుగల సామ్య వైషమ్యాలు శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావుగారు ప్రబుద్ధాంధ్ర మాసపత్రికలో (1934 జనవరి) చర్చించారు. ఈ ప్రబుద్ధాంధ్ర శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి సంపాదకత్వాన రాజమహేంద్రవరంనుండి వెలువడుతూ వుండేది. శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు గారు కూడా తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావ మన్న తమ పరిశోధక గ్రంథంలో శ్రీ రంగరాజ చరి త్రమునుగూర్చి విపులంగా చర్చించారు.

శ్రీ రంగరాజ చరిత్రకు ఆంగ్లంలోనూ తెలుగు లోనూ కర్త పీఠిక వ్రాశారు. ఈ గ్రంథం లార్డు మేయోగారికే అంకితం చేయబడింది. ఈ నవీన ప్రబంధంలో కులాచారములు, వర్ణభేదములు, శకున ములు, గ్రహశాంతులు, వేశ్యాలంపటత్వము, మూఢా చారములు మొదలగు విషయాలు విమర్శింపబడ్డాయి. నవలను వచనప్రబంధమని తొట్టతొలుత సంభా వించినదికూడా గోపాలకృష్ణమ్మశెట్టిగారే. వీరేశలింగం పంతులుగారికన్నా ఆరు సంవత్సరాలముందే గోపాల కృష్ణమ్మశెట్టిగారీ వచనప్రబంధాన్ని రచించారు. ఈ వచనప్రబంధాన్ని తాము చూసి చదివి అనుస రించికూడా వీరేశలింగంపంతులుగారీ గ్రంథాన్ని స్మరిం చకపోవటం ఆనూహ్యం. 1893 వ సంవత్సరం చింతామణి నవలారచనను ప్రోత్సహించే ఉద్దేశంతో ఏర్పరచిన పోటీలలో, క్రొత్తగా వ్రాసేవారికి మార్గ దర్శకములుగా పేర్కొన్న వచనప్రబంధాలలో శ్రీ రంగ రాజ చరిత్రం లేదు. కనుక 1893 వ సంవత్సరానికే శ్రీ రంగరాజ చరిత్రం సాహితీపరులచే విస్మరింపబడిం దని తెల్లమవుతూవుంది. ఈ వచనప్రబంధం మళ్ళీ ముద్రణంకూడా పొందలేదు. రాజశేఖర చరిత్రంపై

వున్నంత ఆంగ్ల వాఙ్మయప్రభావం, శ్రీ రంగరాజ చరిత్రంపైనలేదు. కాని తెలుగు నవలా రచనా పరిణామంలో శ్రీ రంగరాజ చరిత్రానికి సముచితమైన స్థానం వుంది. మొట్టమొదటి నవలను రచించే ప్రయత్నం శ్రీ గోపాలకృష్ణమ్మ శెట్టిగారే చేశారని చెప్పవచ్చును.

మహాశ్వేతపై ఆంగ్ల వాఙ్మయ ప్రభావంలేదు.

శ్రీ రంగరాజ చరిత్రంపై కొలదిగా వుంది.

రాజశేఖర చరిత్రం ఆంగ్ల వాఙ్మయ ప్రభావం వల్లనే తెలుగులో వెలసింది.

## రాజశేఖర చరిత్రము

వీరేశలింగం పంతులుగారు రచించిన మొట్టమొదటి వచనప్రబంధం ఇది. జనులలోని మూఢాచారాలను, అంధ విశ్వాసాలను పోకార్చటానికని పంతులుగారీవచనప్రబంధాన్ని రచించారు. ఈ నవల వివేకవర్ధనిలో భాగాలుగా వెలువడి 1880 వ సంవత్సరంలో పుస్తకరూపాన్ని పొందింది.

ఇది ఆలివర్ గోల్డ్‌స్మిత్ రచితమైన 'ది వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' అను నవలకు అనుసరణమని వీరేశలింగం పంతులుగారు తమ పీఠికలో వ్రాశారు. కాని విశేషించి ఆంగ్లమూలానికీ తెలుగునవలకూ పోలికలుకూడా యెక్కువగా లేవని పంతులుగారే చెప్పుకున్నారు. అయినా యీ రాజశేఖరచరిత్రంలో పంతులుగారి స్వోపజ్ఞత ఏమీ లేదనీ, యథామాతృకంగా అనువదించి, మూలగ్రంథంయొక్క సౌందర్యాన్ని కూడా పాడుచేశారని, శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు తమ వివేకచంద్రికావిమర్శనంలో వీరేశలింగం పంతులుగారిని తీవ్రంగా అధిక్షేపించారు. సాంఘిక సారస్వతాది రంగాలలో, మత విషయకమైన విశ్వాసాలలో వీరేశలింగం పంతులుగారిపట్ల, బ్రహ్మయ్య శాస్త్రిగారికున్న స్పర్థ యీ వివేకచంద్రికా విమర్శనంలో తలపస్సిగా కనపడుతుంది. దేశీయమైన ఆచార వ్యవహారాలు, పాత్రలపేర్లు, రాజశేఖర చరిత్రంలో ఆంగ్లమూలం కన్నా విభిన్నంగా కనిపించినా, ఆయా మార్పులు సౌందర్యాపాదకములుకాక, మూలగ్రంథంలో గోల్డ్‌స్మిత్ కవీశ్వరుడు పాలలో చక్కెర కలిపినట్లు, కరుణ శాంతరసములను సమ్మేళనం చేయగా, రాజశేఖర చరిత్రంలో వీరేశలింగం పంతులుగారు పాలలో ఉప్పు వైచినట్లుగా కరుణరసాన్ని హాస్యంతో జోడించి, రసాభాసం గావించారని బ్రహ్మయ్యశాస్త్రిగారు ఆక్షేపించారు. సంఘ సంస్కరణమే ముఖ్యోద్దేశంగా యీ గ్రంథం రచింపబడింది. కాబట్టి, వ్యంగ్యధోరణిలో పంతులుగారు సంఘంలో నాడు ప్రచురంగావుండిన లోపాలను అపహాస్యంపాలు గావించారు. అంతమాత్రంచేత పంతులుగారు మూలగ్రంథంయొక్క సౌందర్యాన్ని పాడుచేశారనటం తగదు. అసలు మూలగ్రంథం వొక ఉద్దేశంతో రచింపబడిందికాగా, రాజశేఖరచరిత్రం, రచింపబడిన ఉద్దేశం అదికాదు. మూలగ్రంథమైన 'ది వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్'లోని సాహిత్యశిల్పసౌందర్యం ప్రధానస్థానాన్నాక్రమించగా, రాజశేఖర చరిత్రంలో దురాచారపరిహారం ప్రధానస్థానాన్ని ఆక్రమించింది. 'ఇంగ్లీషు కథకును దీనికిని విశేష సంబంధము లేదు. అదియొక యుద్దేశముతో చేయబడినది, ఇది వేరొక యుద్దేశముతో చేయబడినది మనలోగల మూఢవిశ్వాసములను పోగొట్టవలెనన్న ముఖ్యోద్దేశముతో పంతులుగారు దీనిని రచించినట్లు చెప్పుకోగా వారిని వేరొక దృష్టిలో విమర్శించటం భావ్యంకాదు. మూలగ్రంథానికీ రాజశేఖర చరిత్రానికీ భేదములున్నా సాదృశ్యములే యెక్కువని శ్రీ కొత్తపల్లి వీరభద్రరావుగారు తమ పరిశోధక గ్రంథంలో వ్రాశారు. ఆ మూలగ్రంథాన్ని అనుసరించి తామీ గ్రంథం వ్రాశామని పంతులుగారే చెప్పుకున్నప్పటికీ, యీ రెండు గ్రంథాలలో దేహబంధంలోగాని పాత్ర నిర్మాణంలోగాని సాదృశ్యం ఎక్కువగా స్ఫుటమవటంలో వింత లేదు. డా॥ ప్రిమ్‌రోజ్, బర్చెల్, ఒలీవియా, సోఫియా మొదలైన పాత్రలను పంతులుగారు రాజశేఖరుడు, రామరాజు, రుక్మిణి, సీత, మొదలగు పాత్రలనుగా పరివర్తింపచేశారు. మూలగ్రంథంలో కథానాయకుడైన డా॥ ప్రిమ్‌రోజ్ తన కథనంతా ఉత్తమపురుషలో వినిపిస్తాడు. రాజశేఖర చరిత్రంలో అట్లా కాదు. మూలగ్రంథంతో పోల్చిచూస్తే రాజశేఖర చరిత్ర కథాకల్పనమునందు బిగి తక్కువ. ఇది పంతులుగారి ప్రతిభకు అపకర్షకాదు. సంఘ దురాచారాలను రూపుమాపటానికి సాహిత్యాన్ని పంతులుగారు సాధనంగా స్వీకరించినారుగనుక, కావ్యసౌందర్యానికట్టే వారు తమ రచనలలో ప్రాధాన్యమీయలేదు. శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు రాజశేఖర చరిత్రానికీ, మూలగ్రంథానికీ సామ్యములు చూపుతూ, శంకించి

విషయాలు రెండు గ్రంథాలలోనూ వర్ణింపబడినవి కనుక, పంతులుగారు మూలగ్రంథానికీ తమ గ్రంథానికీ పోలిక లెక్కుడుగా లేవని వ్రాయటం ఆక్షేపణీయమని విమర్శించారు. వారు చూపిన సామ్యాంశాలివి.

1. గుళ్ళు 2. శుభనక్షత్రదర్శకము జూచుట 3. కలల నమ్మటం 4. శకున మడుగుట 5. స్త్రీవిద్య 6. పునర్వివాహము 7. పండుగలు 8. స్త్రీల ప్రసంగములు 9. ఎరుకయడుగుట 10. భాగ్యము 11. బీదతనము 12. దొంగతనము 13. నాగరికము 14. పాండిత్యము 15. సాముద్రికము 16. జారత్వము 17. దేశయాత్రలు 18. నాటకములు 19. పెండ్లిండ్లు 20. సంతలు 21. ముఖస్తుతులు 22. బళ్ళు 23. రాజవీధి 24. వర్తకము 25 వేదాంతము 26. మతము 27. మత గురువులు 28. రోగములు 29. వైద్యము 30. కారాగృహము 31. రిఫారము (Reform) 32. దంపతుల కలహము 33. స్త్రీలదౌ యలంకారములయందలి యాశ 34. ఇండ్లు కాలుట 35. రాజభటుల దుర్నీతి 36. మూఢభక్తి 37. కవుల స్థితి 38. ఆతిథ్యము.

ఈ పై అంశాలు రెండు గ్రంథాలలోనూ సామాన్యం కాబట్టి పంతులుగారు మూలగ్రంథాన్ని అనువదించి తమ స్వప్రజ్ఞగా సాధిస్తున్నారని బ్రహ్మయ్య శాస్త్రిగారి ఆక్షేపణ. పైన వారు చూపిన సామ్యాంశాలనుబట్టి, వారి దృష్టి ఎంత స్పర్ధాత్మకమూలమో స్పష్టపడుతున్నది. ఇట్టి అంశాలలో పెక్కుఅంశాలు, ఏమాత్రమూ సంబంధంలేని ఏ రెండు గ్రంథాలలోనైనా వర్ణింపబడవచ్చును. అందువలన ఆ రెండు గ్రంథాల పౌర్వాపర్యముకాని అందులో ఒక గ్రంథకర్త గ్రంథచౌర్యంకాని ప్రతిపాదింపబడజాలవు.

ఈ విధంగా వాదనకు దిగితే మూలగ్రంథానికేమాత్రమూ సంబంధం లేకుండా రాజశేఖర చరిత్రమునందుమాత్రమే ప్రసక్తమైన అనేక విషయాలను పరిశీలింపవచ్చును. అందుకొన్ని.

1. స్వర్ణయోగము 2. గృహబాధ (దేవతావేశము) 3. లంకెబిందెలు 4. బాల్యవివాహములు 5. వితంతువుల కేశఖండనము 6. దేవుని మాన్యములు 7. అమ్మవారి (గ్రామదేవత) జాతరలు 8. జ్యోతిషశాస్త్ర చర్చలు 9. స్వయంపాకము 10. వంట బ్రాహ్మణులు 11. గ్రహణములు 12. పర్వదినములందు నదీస్నానములు 13. సూతకము-మైలబట్టు 14. ఆతుర సన్న్యాసము 15. అంజనమువేసి దొంగను పట్టుకొనుట 16. పంచాంగ శ్రవణము 17. శవ వహనము 18. కులాచారములు 19. నీళ్ళరేవులం దమ్మలక్కలం ముచ్చట్లు 20. వివాహ వ్యయములు 21. సంగీత విద్వాంసులు 22. బంధువులు 23. పురిటిలో సందుగొట్టుట 24. బాలరోగము 25. భోగము మేళము 26. బ్రాహ్మణ సంభావనలు 27. పెండ్లి వేడుకలయందలి మోటుసరసములు 28. గౌళిపాట 29. శివపూజ (పార్థివము) 30 ప్రయోగములు 31. పురాణపఠనము 32. భూతవైద్యము 33. ప్రశ్న చెప్పుట (పోయిన వస్తువుల ఉనికి చెప్పుట) 34 వర్ణభేదములు 35. శ్రీముఖములు (ఆంక్ష పత్రికలు) 36. పండుగలు (దేశీయాచారములు) 37. మూఢవిశ్వాసములు 38. రక్షరేకులు 39 సప్త సంతానములు 40. శాస్త్ర చర్చలు 41. శాఖాభేదములు 42. రథోత్సవము 43. సాలగ్రామార్చన మొ॥ నవి.

ఈ పై చెప్పిన విషయములవర్ణన 'ది వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డు' నందులేదు కనుక, రాజశేఖర చరిత్రం ఆంగ్లగ్రంథానికి అనుసరణం కాదని చెప్పలేము. అట్లానే కొన్ని విషయాలు సమానంగా వున్నంత మాత్రాన ఆంగ్లగ్రంథానికి రాజశేఖరచరిత్రం అనువాదమనీ అనలేము. కాబట్టి దేహబంధము (Structure) నందు ఆంధ్రాంగ్ల నవలలకు విశేషించి సామ్యములున్నప్పటికీ, ఇతివృత్తంలో (Plot) చాలా భేదం వున్నదనటం స్పష్టం. రాజశేఖరచరిత్రం కేవలము వాదగ్రంథమే అయివుంటే మళ్ళీ ఆంగ్లంలోకి అనువాదం పొందివుండేదికాదు. రాజశేఖర చరిత్రానికి ఇంగ్లీషులో రెండనువాదాలు వెలిశాయి. ఇందులో (Fortune's wheel) (అదృష్టచక్రం) అన్నపేరుతో వెలుపడిన అనువాదం, నాటి లండన్ టైమ్స్ పత్రికలో మిక్కిలి ప్రశంసింపబడింది. అంతేకాకుండా రాజశేఖరచరిత్రం, తమిళ కన్నడ భాషలలోకికూడా అనూదితమైంది. చిలకమర్తి వారు తాము రామచంద్ర విజయం రచించటానికి రాజశేఖరచరిత్రమే మార్గ

దర్శకమైనదని వ్రాశారు. ఈ విధంగా రాజశేఖర చరిత్రం, అర్వాచీనులందరికీ నవలారచనలో మార్గదర్శకమైనది. ఈ నవల తొమ్మిదిసార్లు ప్రచురింపబడటం కూడా దీని విశేషప్రశస్తిని రుజువు పరుస్తున్నది. ఆంగ్ల గ్రంథానికి అనుసరణమే అయినా, స్వతంత్రేతివృత్తంగా పంతులుగారు, రాజశేఖర చరిత్రాన్ని రచించారు. కాబట్టి సర్వలక్షణ సముపేతమైన, సర్వాంగసుందరమైన తొలి తెలుగు నవల రాజశేఖర చరిత్రమే అని నిర్ణయింపవచ్చును.

శ్రీ రంగరాజ చరిత్రం, నవలారచనకు తెలుగులో తొలి ప్రయత్నమని భావించవచ్చును. పంతులుగారు శ్రీ రంగరాజ చరిత్రాన్ని గూర్చి ఎక్కడా ప్రస్తావించక పోవటానికి కారణం, వారా గ్రంథాన్ని నవలగా, అంటే వచన ప్రబంధంగా భావించక, ఒక కథగా, అంటే అప్రౌఢమైన వచనకావ్యంగా భావించటమే అయి వుంటుంది.

అందువలననే తెనుగున 'మొట్టమొదటి వచన ప్రబంధమును నేనే చేసితిని' అని వారు వ్రాసికొనటం సంభవించింది. కనుక నాటినుండి సాహిత్యపరులందరూ, తొలి తెలుగు నవల రాజశేఖర చరిత్రమే నని అభిప్రాయపడటం జరిగింది. కొంతలోకొంత ఇది సత్యమే అయినా, తెలుగులో నవలారచనకు ప్రయత్నం, వీరేశలింగంపంతులుగారికి పూర్వమే, నరహరి గోపాల కృష్ణమ్మ సెట్టిగారివంటివారు చేశారనటం సత్య దూరంకాదు. మహాశ్వేత తెనుగున వచన ప్రబంధం కాజాలదు. కనుక తెనుగున అది తొలి నవల కాదు. రాజశేఖర చరిత్రంపైన ఆంగ్లవాఙ్మయ ప్రభావం వుండటమూ, అది అనువాదంకాక, అనుసరణగా వెలయటం, బహుళ ప్రచారాన్ని పొందటం, తిరిగి ఇతర భాషలలోకి అనువదింపబడటం, మొదలైన కారణాలు పురస్కరించుకొని, తొలి తెలుగు నవలగా రాజశేఖర చరిత్రం ప్రశస్తిని పొందింది.



# ఉమావర్మ హొంఇరేజ్గ గ్రామ తామశాసనము

శ్రీ బి. ఎన్. శా

## శాసనము :

వ. రాండు రేకులు గల ఈ శాసనమును డా॥ గిడుగు వేంకట సీతాపతిగారు నాకు దయతో నొసంగిరి. ఈ శాసనము శ్రీకాకుళంజిల్లా పాత పట్నం తాలూకాలోని తెంబూరు గ్రామమున లభించినది. శాసనము చిన్నదేయైనను, శాసనపు రేకు లమర్చబడిన కడియము, రాజముద్రిక పెద్దవిగానున్నవి. శాసనపు రేకులు పలుచగానున్నవి. ఇది కళింగ శాసనము. ఉమావర్మ వేయించినది. ఈ ఉమావర్మ వేయించిన మూఁడు తామ్ర శాసనము లింతవరకు లభించినవి ప్రకటింప బడినవి. అవి 1. బెక్కలి శాసనము [1] 2. బృహత్ప్రోష్ట శాసనము[2] 3. ధవళపేట శాసనము [3]. ఉమావర్మ శాసనములందు 'కళింగాధిపతిః' అని వర్ణింపబడినాఁడు. బెక్కలి శాసనము ఉమావర్మ తొమ్మిదవ విజయ రాజ్యసంవత్సరములోను, బృహత్ప్రోష్ట, ధవళపేట శాసనము లాతని 30 వ విజయరాజ్య సంవత్సరములోను వేయింపబడినవి.

## ఆకారాదికములు :

మూఁడు రేకులుగల ఈ శాసనము ఆకారమున చిన్నదిగనున్నది. శాసనపు రేకుల అంచులు అక్షరములు చెదిరిపోకుండ తీర్చబడి యుండలేదు. రేకులు పలుచగా నుండుటవలనను, చిలుము పట్టుటవలనను, శాసనాక్షరములు చాలవరకు చెదిరిపోయినవి. మొదటి రేకు రెండవ ప్రక్క ఎడమవైపు అక్షరములును, రెండవ రేకు రెండు వైపులును, మూఁడవరేకు, మొదటి ప్రక్క పైభాగమును, చిలుముపట్టి రేకు అరిగి పోవుటవలన అక్షరములు చదువుటకు వీలులేదు.

ఈ శాసనపు రేకులు నాలుగు మూఁలలు సమానముగ నుండి రేకులకు రెండువైపుల అంచులు వంపుగా తీర్చబడినవి. శాసనపు ఒక్కొక్క రేకు పొడవు 15 1 సెం మీ; వెడల్పు 7 సెం. మీ; శాసనపు రేకుల మందము 0.2 సెం. మీ; ఈ రేకులకు ఎడమవైపున 1.2 సెం మీ వ్యాసము కల రంధ్రములున్నవి. శాసనపు రేకుల కమర్చబడిన కడియము యొక్క వ్యాసము, 11 సెం. మీ; కడియముయొక్క చుట్టు కొలత 39.1 సెం. మీ; రాజముద్రిక పొడవు 9.5 సెం. మీ. శాసనము తూక మీ క్రింది విధముగ నున్నది.

| | | |
|---|---|---|
| మొదటిరేకు తూకము | 125 | గ్రాములు. |
| రెండవరేకు తూకము | 125 | గ్రాములు. |
| మూఁడవరేకు తూకము | 150 | గ్రాములు. |
| కడియము సీలుతో | 850 | గ్రాములు. |
| మొత్తము శాసనము తూకము | 1250 | గ్రాములు. |

అనగా 1 కిలో 250 గ్రాములు.

శాసనము, మొదటిరేకు రెండవ ప్రక్కమధ్యం ప్రారంభమగు చున్నది. మూఁడవరేకు మొదటి ప్రక్కతో శాసనము ముగిసినది. మొదటిరేకు రెండవ ప్రక్క ఐదుపంక్తులు, రెండవరేకు రెండు వైపుల

---

1. J. A. H. R. S. Vol. VI Page 53—54.

2. Epigraphica Indica Vol. XII. Page 4—6.

3. J. A. H. R. S. Vol. X. Page 1 3—144.

ఐదేసి పంక్తులును, మూడవరేకు మొదటి ప్రక్క ఐదు పంక్తులును చెక్కబడినవి. శాసనము మొత్తము 20 పంక్తులలో ముగిసినది.

ఈ శాసనపు రేకులకు అంచులు తీర్చబడి యుండలేదు. శాసనపు రేకుల ఆకారము మూడవ వజ్రహస్తుని చిక్కుళ్ళవలస శాసనపు రేకుల ఆకారము వలెనున్నది. మొదటి, పల్లవ, శలంకాయన, విష్ణుకుండినాది వంశీయుల శాసనము రేకుల కంచులు తీర్చబడి యుండలేదు. ఈ శాసనపు రేకులను అట్లే యున్నవి. శాసనపు కడియమునకు రాజముద్రిక బిగించి యున్నది. రాజముద్రికపై చెక్కబడిన అక్షరములు చిలుముపట్టి చెదిరిపోయి చదువుటకు వీలుకాకుండ నున్నవి.

## భాష :

ఉమావర్మ వేయించిన ఈ శాసనభాష యంతయు సంస్కృతము. రెడవరేకు రెండవ ప్రక్క మూడవ పంక్తినుండి వ్యాస గీతా శ్లోకములు ప్రారంభమగు చున్నవి. మూడవరేకు మొదటి ప్రక్క మూడవ పంక్తి తరువాత శాసనము వేయించిన విజయరాజ్య సంవత్సరము పేర్కొనబడినది. సంవత్సరమును సూచించు అంకెల గుర్తులును, తిథికి సంబంధించిన అంకెయు గుర్తించుట నాకు కష్టముగా తోచినది. శ్రీ తిరుమల రామచంద్రగారు అంకెలను గుర్తించి చక్కని సూచన లొసంగినారు. వారికి నా కృతజ్ఞతలు. వ్యాసగీతా శ్లోకముల తరువాత భాగము వచనములోనున్నది. శాసనారంభమున వచనమే యున్నది. సాధారణముగ శాసనారంభము నందొక శ్లోకముగాని రెండు శ్లోకములుగాని యుండుట ఆచారము. కళింగరాజుల ఇతర శాసనము లందలి భాషవలె ఈ శాసన భాషయున్నది. శాసనాక్షరములు విడివిడిగానుండి పెద్దవిగానున్నవి. ఇంద్రవర్మ జిర్జింగి తామ్రశాసనము, దేవేంద్రవర్మ చీడివలస శాసనములలోని సంస్కృత వచనమువలె ఉమావర్మ వేయించిన ఇతర శాసనములలోని భాషవలె ఈ శాసన భాష యున్నది.

శాసనమున 'వాసిష్ఠ సగోత్రాయ తైత్తిరీయ స్వబ్రహ్మచారిణే బ్రాహ్మణ భర్త్సాశర్మణే' అను నతనికి దాన మిచ్చినట్లున్నది. భర్త్సాశర్మణా అను పేరు వింతగా నున్నది. ఇట్టి పేళ్లు కళింగ రాజుల శాసనములందు కనిపించుచున్నవి. ఉమావర్మ వంశీయుడైన అనంతశక్తివర్మ సకునక శాసనమున[4] నాగశర్మ, దుగ్గశర్మ పేళ్లును, చండవర్మ శాసనమున[5] దేవశర్మ పేరును, ఉమావర్మ బెక్కలి శాసనమున[6] యాశశర్మ పేరును పేర్కొనబడినవి. గోలశర్మ కొట్టశర్మ, అగ్గిజ్జ భావజ్జ, మాత్స్వర నాటి నామములు శాసనములందు కనిపించుచున్నవి.

## లిపి :

ఇంద్రవర్మ జిర్జింగి తామ్రశాసనపు[7] లిపిని పోలియున్న ఈ శాసనమందలి లిపి ప్రాచీనాంధ్ర లిపి. క్రీస్తుశకము నాల్గైదు శతాబ్దుల కాలపు తెలుగు కన్నడ లిపిని పోలి ఈ శాసన లిపి యున్నది. విష్ణుకుండినుల శాసనములలోని లిపికిని, ఈ శాసన లిపికిని దగ్గరి సంబంధమున్నది. అక్షరము లొకేవిధముగ నున్నవికాని విష్ణుకుండినుల శాసనములలోని అక్షరములకన్న ఈ శాసనాక్షరములు పెద్దవిగా నున్నవి. 'ల' అక్షరము మాత్రము భేదముగా నున్నది. శాసనమును చెక్కిన శిల్పి జాగ్రత్త వహించినాడు. ఈ శాసనమందలి యక్షరములు గుండ్రభత్తు అక్షరములు. శాసనపు రేకులపై సంఖ్యాసంకేతములు లేవు. శాసనపు కడియమునకు బిగించియున్న రాజముద్రికపై యక్షరము లున్నవికాని యవి చదువుటకు వీలులేకుండ చెదిరిపోయినవి.

## వర్ణక్రమము :

ఈ శాసనమున వర్ణక్రమమునకు సంబంధించిన విశేషము లున్నవి. సంయుక్తాక్షరములతో

4. Annual report of the Archaeological Survey of India, New Delhi 1934-35. Page 65.

5. Epigraphica Indica Vol. IV Page 142. Komarti Inscription.

6. J. A. H. R. S. Vol. VI Page 143—144.

7. J. A. H. R. S. Vol. III; and Kalinga Samchika Appendix Page 37.

గూడిన పదములు, ద్విత్వాక్షరయుతపదములు, అను స్వారమునకు బదులు వర్గ పంచమాక్షరములను వ్రాయుట, 'ఞ' వలపలగిలక వాడుట, ప్రాచీన శాసనములందు మనకు కనిపించును. ఇది సంస్కృతభాషా సంప్రదాయము. ప్రాచీన శాసనము లన్నిటియందు దిట్లు వ్రాయబడినది.

కలింగాధిపతిః--కలిఙ్గాధిపతిః
శ్రీ మహారాజోమవర్మా - శ్రీ మహారాజోమవమ్మా
హోణరేంగగ్రామే— హోణరేజ్గగ్రామే
సర్వ — సవ్వ
భర్తృశర్మ—భర్తృశమ్మ
అగ్రహారంకృత్వా—అగ్రహారఙ్కృత్వా
మహిర్మహిమతాం—మహిమ్మహిమతాం
స్వర్గే —స్వగ్గే.

ఇట్లు, కలింగ, వర్మ, రేంగ సర్వ ఇత్యాదులందు అనుస్వారమునకు బదులుగా అనునాసికాక్షరములును, 'ఞ' నకు పూర్వాక్షరము ద్విత్వముగను వ్రాయబడినది.

## శాసన విషయము:

దాతయగు ఉమావర్మ సింహపురమందలి బప్పపాద భక్తుడును, కలింగాధిపతియునైనవాడు, హోణరేంగ గ్రామమున అందరిని సమావేశపఱచి ఆజ్ఞాపించుచు, ఈ గ్రామము మాచేత మా కుమారుడగు వసుషేణరాజుయొక్క పుణ్యమును కీర్తిని విస్తరింపజేయుటకొరకు వసిష్ఠసగోత్రికుడును తైత్తిరీయ శాఖాధ్యాయియునునగు బ్రాహ్మణ భర్తృశర్మకు సూర్యుని శశితారకలను ప్రతిష్ఠాపించుటవ్వారా అగ్రహారముగాజేసి కళింగరాజ్యములో నొక సామాన్యమగు నగ్రహారముగాజేసి సమస్తవిధములైన సుంకములనుండి తప్పించి దానము చేయబడినదని శాసనమున వర్ణింపబడినది.

ఈ శాసనము చిన్నది. శాసన విషయముకూడ స్వల్పముగనున్నది. ఉమావర్మ బప్పపాద భక్తుడు. దానమాతని కుమారుడగు వసుషేణ రాజుయొక్క కీర్తిని విస్తరింపజేయు నిమిత్త మీయబడినది. "అస్మాభిఃప్రతి వసుషేణరాజస్య పుణ్యా యశోభి వృద్ధయే" అవి శాసనమున కలదు. ప్రతిగ్రహీత వాసిష్ఠసగోత్రుడు, తైత్తిరీయసబ్రహ్మచారియునగు బ్రాహ్మణభర్తృశర్మ. "వాసిష్ఠసగోత్రాయ తైత్తిరీయసబ్రహ్మచారిణే బ్రాహ్మణభర్తృశమ్మణే"

ఈ హోణరేంగ గ్రామము కళింగరాజ్యములో నొక సామాన్యమగు నగ్రహారముగాజేసి సమస్త విధములైన సుంకములనుండి తప్పించి దానముచేయబడినది. (రెండవరేకు మొదటిప్రక్క. 2,3 పంక్తులు)

ఈ శాసనమున కాజ్ఞప్తి వాసుదేవుడు. శాసనము ఉమావర్మ 40 వ రాజ్యసంవత్సరమున వైశాఖ మాసములోని 20 వ దినమున అనగా వైశాఖ బహుళ పంచమీ తిథిరోజున ఈయబడినది. శాసనము దేశాక్షపటలాధికృతుడగు హరిదత్తకుమారుడైన మాతృవరేణ్యునిచే వ్రాయబడినది.

## మాఠర వంశీయులు:

సముద్రగుప్తుని దక్షిణాపథ దిగ్విజయానంతరము కళింగమున చిన్నచిన్న రాజ్యములు తలయెత్తినవి. మాఠర వంశీయులు పిష్టపురము రాజధానిగా కళింగదేశమున రాజ్యస్థాపనము గావించి పాలింప దొడగిరి. కాలక్రమమున పిష్టపురమునకు బదులు వర్ధమానపురము, సింహపురము రాజధానులుగా వర్ధిల్లినవి. ఈ వంశీయులలో మొదటిరాజు శక్తివర్మ.

### మాఠర వంశము

శక్తివర్మ 350 - 365
|
అనంతవర్మ 365
|
శక్తివర్మ II 365 – 394,
|
చండవర్మ 394—400
|
ఉమావర్మ 400 – 440
|
వసుషేణుడు — విశాఖవర్మ 440 – 450.

మాఠరవంశస్థాపకుడగు శక్తివర్మ రాగోలు శాసనమువలన[8] మాఠరవంశీయులున్నట్లు తెలియుచున్నది. శక్తివర్మ నాలుగవ శతాబ్దమున కళింగదేశాధీశుడయ్యెను. ఈ శక్తివర్మ వాసిష్ఠీపుత్రుడు. మాఠరకులైక భూషణుడు, కళింగాధిపతియని వర్ణింపబడినాడు. బృహత్పలాయన, శాలంకాయన, ఆనంద గోత్రీకులవలె మాఠరకులజులు గోత్రనామమునే వంశ నామముగా గ్రహించినారు.

శక్తివర్మ రాజధాని పిష్ఠపురము. శక్తివర్మకు పూర్వము పిష్ఠపురము రాజధానిగా కళింగదేశమును పాలించిన రాజు మహేంద్రుడు. ఇతడు సముద్రగుప్తునిచే ఓడింపబడినట్లు అలహాబాదు శాసనమువలన తెలియుచున్నది. శక్తివర్మ తన 13 వ రాజ్య సంవత్సరమున వేయించిన శాసనము రాగోలు శాసనము. ఇతని రాజ్యపాలనాకాలము సుమారు 15 సంవత్సరములు. శ్రీ భావరాజు వేంకట కృష్ణారావుగారు శక్తివర్మ కాలమును క్రీ. శ. 350–365 గా నిర్ణయించినారు[9] శక్తివర్మ కళింగవిషయములోని రాకలువ గ్రామమును అగ్రహారముగాజేసి, బ్రాహ్మణ కుమారశర్మకు దానమిచ్చినాడు. ఈ కుమారశర్మ సావర్ణసగోత్రీయుడు. పంచార్షేయ ప్రవరగలవాడు. ఇతనికి ఎనిమిది మంది కుమారులు. శాసనము వైశాఖ పూర్ణిమనాడు శక్తివర్మ 13 వ రాజ్య సంవత్సరమున వేయబడినది. శాసనమున కాజ్ఞప్తి శక్తివర్మ మహారాజే. ఈ శాసనము వ్రాసి, చెక్కినవ్యక్తి అమాత్యుడగు అర్జునదత్తుడు.

శక్తివర్మ యనంతరము కళింగమును పాలించిన రాజులు బలహీనులగుటవలన వీరి రాజధాని పిష్ఠపురమునుండి సింహపురమునకు మారినది. శాలంకాయనుల దండయాత్రలవలననో లేక వాసిష్ఠ గోత్రులగు రాజులవలననో వీరు పిష్ఠపురమును కోల్పోయియుందురు.

అనంతశక్తివర్మ సకునక శాసనము నాల్గవ శతాబ్ద్యంతముననో ఐదవ శతాబ్ద్యారంభముననో వేయించినట్టిది. ఈ శాసన రచయిత అర్జునదత్తుడు. ఇతనికి దేశాక్షపటలాధికృత, తలవర బిరుదములున్నవి. ఈ అర్జునదత్తుని పేరు రాగోలు శాసనమందున్నది.

సకునక శాసనమున తలవర బిరుదముకల అర్జునదత్తుడును రాగోలు శాసనమున పేర్కొనబడిన అమాత్య అర్జునదత్తుడును ఒక్కరే. అర్జునదత్తుడు, అనంత శక్తివర్మ తన 28 వ రాజ్యసంవత్సరమున వేయించిన సకునక శాసనకాలము వరకు జీవించియుండవచ్చును. అనంతశక్తివర్మ తండ్రి అనంతవర్మ. తాతపేరు మనుమనికిపెట్టు ఆచార మాకాలమున కూడ నుండెననుటకు శక్తివర్మ పేరు తార్కాణము. అనంతవర్మ కాలమున మాఠరకులజులు దక్షిణ కళింగముపై తమ ఆధిపత్యమును కోల్పోయిరి.

అనంతవర్మ కాలమున ఈ వంశీయులు పిష్ఠపురమును కోల్పోయి, సింహపురమును రాజధానిగా కళింగోత్తర భాగమును పాలించుచుండిరి. సింహపురము సింగుపురముగా ప్రసిద్ధికెక్కినది. నేడది సింగపురముగా వ్యవహరింపబడుచున్నది. సింగపురము విశాఖపట్టణము జిల్లాలోని చికాకోలు, నరసన్నపేటల మధ్యనున్నది.

మాఠరవంశ స్థాపకుడగు శక్తివర్మ యనంతరము రాజ్యమునకు వచ్చిన రాజులు వేయించిన శాసనము లింతవరకు ప్రకటింపబడినవి. ఈ శాసనములందు రాజులు పితృపాద భక్తులుగా వర్ణింపబడినారు.

| | | |
|---|---|---|
| 1. సకునక శాసనము[10] | | అనంతశక్తివర్మ |
| 2. బిరిధాన శాసనము[11] | } | చండవర్మ |
| 3. కోమరి శాసనము[12] | | |

8. Epigraphica Indica Vol. XII Page 1—3.

9. Early Dynasties of Andhra Desa. Page. 385.

10. Annual Report of the Archaeological Survey of India, New Delhi-1934-35 Page 65.

11. Ibid 1934-35—Page 64.

12. Epigraphica Indica Vol. IV—Page 142

4. చెక్కురి శాసనము[13] }
5. బృహత్ప్రోష్ఠ శాసనము[14] } ఉమావర్మ
6. ధవళపేట శాసనము[15] }
7. కోరోశండ శాసనము[16] విశాఖవర్మ

ఈ రాజన్యులు శాసనములందు 'పరమదైవతః' అని చెప్పబడినారు. చండవర్మ మహారాజు 'పరమ భాగవతః' అని చెప్పబడినాడు. అనంతశక్తివర్మ సకునక దాన శాసనము విజయసింహపురమునుండి ఈయబడినది. సింహపురము సింఘపురముగా మారి కాలక్రమమున సింగుపురమైనది. సకునకగ్రామము వరాహవర్తని విషయములోనిది. తైత్తిరీయ శాఖాధ్యాయులును సోదరులును అగు నాగశర్మ దుర్గశర్మలకీ గ్రామము దాన మీయబడినది. ఈ శాసనమును అనంతశక్తివర్మ తన 28 వ రాజ్యసంవత్సరపు ఫాల్గుణ శుద్ధ దశమీ తిథినాడు ఇచ్చినాడు. శాసనమున కాజ్ఞప్తులు కుమారామాత్యులగు (Junior Ministers శివభోజక, వసుదత్తులు. వీరు ఉన్నతాధికారులు. ఇందు శివభోజకునికి మహాబలాధికృతుడను బిరుదమున్నది Commander in Chief). వసుదత్తుడు దండనేత బిరుదాంచితుడు (General). శాసనమును వ్రాసినవాడు అర్జునదత్తుడు. దేశాక్షపటలాధికృత, తలవర (Chief Judge) బిరుదాంచితుడు. మహాతలవర బిరుదము నాగార్జునకొండ, అల్లూరు, కొండముడి శాసనములందు కనిపించుచున్నది. అనంతశక్తివర్మ కాలము. క్రీ. శ. 365—394.

అనంతశక్తివర్మ యనంతర మాతని పుత్రుడు చండవర్మ సింహపురాధీశుడయ్యెను. ఇతని రెండు శాసనములు విజయసింహపురమునుండి ఈయబడినవి. మొదటిది తిరిధాన శాసనము. చండవర్మ నాలుగవ విజయరాజ్య సంవత్సరమున గ్రీష్మర్తు రెండవ పక్షమున పంచమీ తిథినాడు ఈయబడినది. తిరిధానలేక తిరిధాణవాటకగ్రామము పలువురు విప్రుల కీయబడినది. ఇంతకుపూర్వము కళింగదేశముననున్న 36 అగ్రహారముల కీ తిరిధానగ్రామము చేర్చబడినది. శాసనము చెక్కినవాడు దేశాక్షపటలాధికృతుడగు రుద్రదత్తుడు. ఇతడు మాతృవరుని కుమారుడు.

చండవర్మ కోమర్తి శాసనమున పేర్కొనబడిన కోహేతూర గ్రామము ఏ విషయములోనిదో తెలుపబడలేదు. ఈ శాసనమును చండవర్మ తన 6 వ విజయ రాజ్య సంవత్సరమున చైత్ర శుద్ధపంచమీ తిథినాడు బ్రాహ్మణ దేవశర్మకు కోహోతూర గ్రామమును అగ్రహారముగా జేసి ఇచ్చెను. చండవర్మ 'బప్పభట్టారక పాదభక్తః' అని శాసనమున వర్ణింప బడినాడు.

చండవర్మ యనంతర మాతని పుత్రుడు ఉమావర్మ రాజయ్యెను17. ఉమావర్మ మూడు శాసనములింతవరకు ప్రకటింపబడినవి. అందు 9 వ విజయ రాజ్య సంవత్సరమున వేయించిన చెక్కురి శాసనము విజయవర్ధమాన పురమునుండి ప్రకటింపబడినది. ఉమావర్మ రాజ్యారంభ కాలమున సింహపురమును కోల్పోయియుండును. చెక్కురి శాసనము కాశ్యప గోత్రుడగు బ్రాహ్మణ యాశశర్మకు అస్తిహాలేరా గ్రామము నగ్రహారముగా నిచ్చు సందర్భమున వేయింప బడినది. రాజుయొక్క మౌఖిక ఆజ్ఞ ననుసరించి అతని 9 వ రాజ్య సంవత్సరము మాఘశుద్ధ సప్తమీ తిథినా డీదానము గావింపబడినది. పిష్టపుర వాసియగు కేశవదేవు డీశాసనలేఖకుడు. వర్ధమానపురము నేటి పాలకొండ తాలూకాలోని వడమ కావచ్చును. అస్తిహాలేరనేటి శృంగవరపుకోట తాలూకాలోని అతవ కావచ్చును. ఈ గ్రామములు విశాఖ పట్టణము జిల్లాలోనివి.

ఉమావర్మ బృహత్ప్రోష్ఠ శాసనము బ్రాహ్మణ హరిదత్తుని కివ్వబడి కళింగములోని 36 అగ్రహారములకు చేర్చబడినది. శాసనము నమలు పరచినవాడు వాసుదేవుడు. శాసన రచయిత మాతృవరుడు. శాసన ప్రతిగ్రహీతయు దేశాక్షపటలాధికృతుడునగు హరి

13. J. A. H. R. S. Vol. VI Page—53—54.

14. Epigraphica Indica Vol. XII Page 4.

15. J. A. H. R. S. Vol. X Page 143—144.

16. Epigraphica Indica Vol. XXI Page 23.

17. A R S I E—Annual Report of the Suparintendent of South Indian Epigraphy Madras. 1935 Part II Page 51.

దత్తుని కుమారుడు. ఈ శాసనము ఉమావర్మ 30 వ రాజ్యసంవత్సరము మార్గశిరమాస మందలి 20 వ దినమున అనగా మార్గశిరబహుళ పంచమీతిథినాఁ డీయ బడినది.

ఉమావర్మ బృహత్ప్రోష్ఠ శాసనమున హరిదత్త సూనుడగు మాతృవరుడును, హోణరేజ్ఞ గ్రామ తామ్రశాసనమున పేర్కొనబడిన మాతృవరుడును ఒక్కరే.

చండవర్మ — తిరిధాన శాసనము
|
మాతృవర
|
రుద్రదత్త

ఉమావర్మ — బృహత్ప్రోష్ఠ శాసనము
హరిదత్త
:
మాతృవర

హోణరేజ్ఞ శాసనము — ఉమావర్మ

హరిదత్త

మాతృవర

వంశవృక్షము

మాతృవర I

రుద్రదత్త హరిదత్త

మాతృవర (బృహత్ప్రోష్ఠ + హోణరేజ్ఞ శాసనములు)

ఉమావర్మ కాలమునాటికి మాసములో 30 రోజులు గణించునప్పుడు తిథులలెక్కన కాక బహుళ పంచమిని 20 వ దినముగా, అట్లే ఇతర దినములను లెక్కించు చుండిరని భావించవచ్చును.

ఉమావర్మ యనంతరము విశాఖవర్మ రాజయ్యెను. హోణరేజ్ఞ గ్రామశాసనమున పేర్కొనబడిన వసుషేణ రాజు ఉమావర్మ జ్యేష్ఠపుత్రుఁడై యుండవచ్చును. అతని మరణమువలననో మరే కారణము వలననో రెండవ కుమారుడగు విశాఖవర్మ సింహాసనమునకు వచ్చి కొలదికాలము మాత్రమే రాజ్యము చేసెను. ఇతడు తన 7 వ రాజ్యసంవత్సరమున కోరోషండ శాసనమును వేయించెను. విశాఖవర్మతో మాఠర వంశీయుల పరిపాలన మంతరించినది.

ఉమావర్మ హోణరేజ్గ గ్రామ తామ్రశాసనము

# శాసనము - మూలము



## మొదటి రేకు - రెండవ ప్రక్క

1. స్వస్తి విజయ సింహపురా ద్బప్పపాదభక్త మ్కలిఙ్గాధపతిః
2. శ్రీ మహారా జోమవర్మా—హోణరేజ్గ్రామే సర్వా సమవేతాన్
3. కుటుమ్బిన స్సమాజ్ఞాపయ త్యస్త్యేష గ్రామో స్మాభిఞ్వత్ర
4. వసుషేణ రాజస్య పుణ్యాయశోభివృద్ధయే వాసిష్ఠసగో
5. త్రాయ తైత్తిరీయస్బ్రహ్మచారిణే బ్రాహ్మణ భర్తృ శర్మణే 1



## రెండవ రేకు - మొదటి ప్రక్క

1. ఆసహస్రాంశు శశి తారక ప్రతిష్ఠమగ్రహారఙ్కృత్వా దస్త
2. యావాగ్రామదమ్మాద్వినిష్కృష్య కలిఙ్గాగ్రహార సామాన్యఙ్కృత్వా
3. సర్వ్వాకరపరిహారై శ్చ పరిహృత్య ప్రత్తః తదేవం విదిత్వా
4. ......ఋణ్యా గీత మర్యాదయోపస్థానఙ్కర్త్తవ్యం మేయహిర
5. ణ్యా...యమ్మవిష్యతుశ్చ రాజ్ఞో విజ్ఞాపయతి ధర్మ్మ



## రెండవ రేకు - రెండవ ప్రక్క

1. క్రమ విక్రమాణా మన్యతమ యోగా దవాప్యం మహీ మనుశాసతాం
2. ప్రవృత్తక మిదన్నానం సద్ధర్మ్మా మనుపశ్యద్భిరేషోగ్రహారోను
3. పాల్యః భవన్తి చాత్ర వ్యాసగీతాః శ్లోకాః బహుభి బ్బ
4. హుధా దత్తా వసుధా వసుధాధిపైః యస్యయస్య యదాభూమిః
5. తస్య తస్య తదాఫలమ్—స్వదత్తాం పరదత్తాం వా యత్నాద్రక్ష యుధి

## మూఁడవ రేకు - మొదటి ప్రక్క

1. స్థిరా మహీమ్మహిమతాం శ్రేష్ఠదానా చ్ఛ్రేయోనుపాలనమ్
2. షష్ఠింవర్ష సహస్రాణి స్వర్గే వసతి భూమిదః ఆక్షేప్తాచా
3. నుమన్తా చ తాన్యేవ నరకేవసేత్— ఆజ్ఞా వాసుదేవః
4. సంవత్ 30+10. వైశాఖాది 20 దేశాక్షపటలాధికృత
5. హరిదత్త సూనునా మాతృవరేణ లిఖితమితి॥*॥

### అ ను వా ద ము :

స్వస్తి. విజయసింహపురమందలి బప్పపాదభక్తుఁడును, కళింగాధిపతియును, మహారాజును అగు ఉమావర్మ హోణరేంగ గ్రామమునందందరిని సమావేశపరచి ఆజ్ఞాపించుచున్నాడు. ఈ గ్రామము మాచేత మా కుమారుఁడగు వసుషేణరాజుయొక్క పుణ్య యశోభివృద్ధికొరకు వాసిష్ఠసగోత్రికుడును, తైత్తిరీయశాఖాధ్యాయియును అగు బ్రాహ్మణ భర్తృశర్మకు సూర్యుని శశితారకలను ప్రతిష్ఠించుట ద్వారా అగ్రహారముగాజేసి వాగూమదంబమునుండి వేరుజేసి కళింగరాజ్యములో నొక సామాన్యమగు నగ్రహారముగా జేసి సమస్తవిధములైన సుంకములనుండి తప్పించి దానము చేయబడినది. అట్టిదానిని...... కర్తవ్యమును రాజుకు విజ్ఞాపించుచుండగా ధర్మ... ఈ దానము సద్ధర్మమును పాలించువారిచేత అగ్రహారము......అగుదురు. ఇందుకు వ్యాసగీతా శ్లోకములు ప్రమాణములు. చాలామందిచేత భూమి దానము చేయబడినది. భూమి భూపాలురకు చెందినది. భూమి ఎప్పుడెప్పు డెవరెవరిదో వారివారి కప్పుడప్పుడది ఫలము నిచ్చును. స్వదత్తముగాని పరదత్తముగాని ప్రయత్న పూర్వకముగా రక్షించుము. ఓ రాజశ్రేష్ఠుడా! దానముకంటె పరదత్తమగుదానిని సంరక్షించుటే శ్రేయోదాయకమైనది. అరవైవేల సంవత్సరములు భూదానకర్త స్వర్గమునందుండును. దీని నాక్షేపించువాఁడును; ఆక్షేపము ననుమతించువాఁడును; ఇతరులును నరకమందు వసింతురు. శాసనమున కాజ్ఞప్తి వాసుదేవుడు. సంవత్సరము 30+10. వైశాఖ మాసము లోని 20 వ దినమున శాసన వ్రాయబడినది. దేశము లోని అక్షపటలికులలో శ్రేష్ఠుఁడైన హరిదత్తుని కుమారుఁడగు మాతృవరేణ్యునిచే ఈ శాసనము వ్రాయబడినది.

# మనుష్యులూ - బొద్దింకలూ

శ్రీమతి ఆర్. వసుంధర

'ఈ ప్రపంచంలో అన్నింటికంటె అసహ్యకరమైన జీవి ఏది?' అని యక్షుడు ప్రశ్నించివుంటే ధర్మరాజు ఏమి సమాధాన మిచ్చివుండేవాడో నాకు తెలియదుగాని నన్నడిగితే తడుముకోకుండా 'బొద్దింక' అని చెప్పెయ్యగలను. ఈ వూరికి ట్రాన్స్‌ఫర్‌మీద వచ్చినప్పటినుంచీ నా మానసిక జీవితంలో బొద్దింక ప్రముఖస్థానాన్ని ఆక్రమించుకొన్నది. చీకటిపడ్డాక వంటగది తలుపు కాస్సేపువేస్తే తిరిగి వచ్చేసరికి గది నిండా వుంటాయి బొద్దింకలు--సన్నగా, ఓవల్‌గా, ఎల్లాగా. వాటిని చూడగానే 'ఛీ, ఛీ, ఎట్లా వున్నాయో, గదినిండా పరచిపెట్టిన బిళ్ళల్లాగ' అనుకుంటాను. ఒళ్ళు జలదరిస్తుంది.

ఒకసారి ఎక్కడో ఒక వ్యాసం చదివాను వాటి గురించి—అవి కొద్దిపాటి ఆహారంతో ఎన్నాళ్ళైనా బ్రతగ్గలవనీ, దేన్నైనా తిని బ్రతగ్గలవనీ, అనేకానేక సంవత్సరాల తర్వాత మానవుడు భూమీమీద లేకుండా పోయినప్పుడు మిగిలివుండేది బొద్దింకలేననీను. నేను లేకుండా పోయినప్పుడు బొద్దింకలుంటాయి. తరువాత నన్నుకూడా తిని బ్రతుకుతాయి! ఇది చదివినప్పటి నుంచీ వాటిమీది అసహ్యం మరింత పెరిగిపోయింది.

నేను లేకుండా పోయినప్పుడు వుండబోయే బొద్దింకలు, దేన్నైనా తిని బ్రతగ్గల బొద్దింకలు, అందరిచేతా అసహ్యించుకోబడే బొద్దింకలు!

వాటిని చూసి అసహ్యించుకొని వాళ్ళు వుంటారా అంటే ఒక్కోళ్ళు వుంటారని స్వానుభవం మీద తెలిసింది. లేబర్ వెల్‌ఫేర్ ఆఫీసరుగా ఆయన్ని యీ వూరు వేశారు క్రొత్తగా. ఇల్లు దొరగ్గానే నన్నూ మా పిల్లలు ముగ్గుర్నీ తీసుకొని వచ్చారు. ఆ రోజు రాత్రి యీ ఖండాలపు బొద్దింకల్ని చూచి, తిన్న అన్నమంతా వాంతి చేసుకొన్నాను. అసలే ప్రయాణపు బడలిక అందులో యీ అసహ్యం భరించలేక పోయాను.

నేను డోక్కుంటుంటే ఆయనా పిల్లలూ ఆత్రంగా చుట్టూ చేరారు.

'ఏమిటి? ఎందుకు? ఏమయింది?' అన్నారాయన కూర్చొనివున్న నా భుజాల్ని పట్టుకొని. 'చెంబుతో నీళ్ళు తీసుకరామ్మా' అన్నారు. శారద నీళ్ళుతెచ్చి అక్కడ పెట్టింది. కాస్త తెప్పరిల్లిన నేను చుట్టూ చూశాను. తొమ్మిదేళ్ళది శారద దూరంగా గోడకానుకొని నిలుచుండి నన్ను జాలిగా చూస్తూ పరిస్థితిని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తోంది. అదెప్పుడూ అంతే. అన్నీ అర్థం చేసుకో ప్రయత్నిస్తుంది. దాన్నిచూస్తే ఎందుకో నాకు చీకాకు ముంచుకొస్తుంది.

'ఎందుకలా నిల్చున్నావ్? కిష్టుణ్ణి బకెట్‌తో నీళ్ళు తెమ్మను, పో' అని కసిరి పంపించేశాను.

మూడేళ్ళవాడు శాయిలుబాబు భయపడిపోయి నిలుచుని వున్నాడు. నేను తన దిక్కున చూడగానే 'అమ్మా' అని ఏడుస్తూవచ్చి నన్ను చుట్టేసుకున్నాడు. 'నా దగ్గర ఛీ ఛీ వుందమ్మా. సీతక్క దగ్గరకు వెళ్ళు. యిప్పుడే వచ్చేస్తానుగా' అని వీపు తట్టి పంపించాను. సీత శాయిలుకంటే రెండేళ్ళు పెద్దది గనుక తన పెద్దరికాన్ని గుర్తుకు తెచ్చుకొని ఆతృత నణచుకొని 'రారా బాబూ' అన్నది. 'మీ రిద్దరూ బయటకువెళ్ళి ఆడుకోండి...నాకు బాగుందిగా' అన్నాను. వాళ్ళిద్దరూ సంతోషంగా బయటకు పరుగెత్తారు.

'ఈ యింట్లో నే మండలేను. ఛీ, ఛీ, ఎన్ని బొద్దింకలు! వేరే యిల్లు చూడాల్సిందే' అన్నాను.

'బొద్దింక లేం చేస్తాయి. అవీ ప్రాణులేగా, అంత అసహ్యమెందుకూ' అన్నారాయన సగం హాస్యంగా.

'అవును మరి, వాటి దగ్గరకు మీరు వెళ్ళ నవసరం లేదు గనుక ఎన్ని కబుర్లైనా చెప్పొచ్చు. కాని యిన్ని బొద్దింకలతో సహజీవనం చెయ్యటం నాకు సాధ్యంకాదు' అన్నాను.

'కావాలంటే యింకో యింటికోసం ప్రయత్నించవచ్చునుకో. కాని కేవలం వాటికోసమే యిల్లు మార్చాలా!' అన్నారు.

నాకు చాలా చికా కనిపించింది. 'ఏమిటీయన మరీ సన్న్యాసిలాగా! దేనికీ అసహ్యం లేదు. అందరు మగవాళ్ళలాగా పిల్లలు పసిగా వున్నప్పుడు బట్టలు పాడుచేసినా చీదరించుకోలేదు. అసలు అసహ్యం అనేది ...పత్తి సన్న్యాసి' అనుకున్నాను కోపంగా.

శారద కిష్టుడిచేత నీళ్ళబకెట్ పట్టించుకొచ్చింది. ఇం కేమన్నా సహాయం చెయ్యటానికి ఎదురు చూస్తూ నిలుచుంది. పాపం, యిందాక దాన్ని కసిరేశాను కదా అని జాలి కలిగింది.

నేనేం చెప్పినా వినకుండా లక్ష్యం లేకుండా వాళ్ళ ఆటల్లో మునిగి వుంటారు. అన్నీ వాళ్ళనుకున్నట్లే జరగాలి. లేకుంటే నానా రభసా చేస్తారు. శారద మాత్రం పిలవగానే ఆటలు వదిలేసి పరుగెత్తుకొస్తుంది, 'ఏమిటమ్మా' అంటూ. దాని విధేయత చూస్తే వెంటనే నాకు కసర బుద్ధివేస్తుంది. కసిరినా అది మాట్లాడదు. ఏమిటీ అన్యాయం అని అడగదు. అది ఏడ్చినా ఎదురు తిరిగినా ఒప్పుకోగలను. కాని అది అన్నీ మింగేసుకుంటుంది. చిన్నవాళ్ళను దగ్గరకు తీసుకున్నట్లు దాన్ని తీసుకోలేను. ఆ మింగేసుకోవటమే ఆ సంబంధం లేకపోవటమే చికాకు కలిగిస్తుంది నాకు. శారదకు అన్యాయం చేస్తున్నానని తెలిసినా, ఎంత నిగ్రహించుకొందామనుకున్నా, తీరా సమయం వచ్చేసరికి దాన్ని కసిరేస్తాను, ఎందుకో. తరువాత పశ్చాత్తాపం కలుగుతుంది. కాని మళ్ళీ సమయం వచ్చేసరికి అంతా మొదలు!

'సీతా శాయిలూ ఏం చేస్తున్నారో చూడుపో అమ్మా' అని శారదతో నెమ్మదిగా—ప్రేమగా అని సంతోషిస్తుంది అది—చెప్పాను. సంతోషంగా వెళ్ళింది అది అమ్మ చెప్పిన పని చెయ్యటానికి. 'ఇహ మీదట దాన్ని వూరికే కోప్పడకూడదు' అనుకున్నాను.

కిష్టుడు బకెట్ అక్కడపెట్టి ఎప్పుడో పారిపోయాడు దొంగవెధవ!—కడగాల్సి వస్తుందని. వాడిదంతా తప్పించుకు తిరిగే వ్యవహారమని దాగానే కనిపెట్టేశాను. వాడిని పిలిచి మరీ కడిగించాను ఆ రోజు.

* * *

రోజులు గడుస్తున్న కొద్దీ కిష్టుడి సంగతి బాగా తెలిసివస్తూ వుంది. వాడికి పద్నాలుగేళ్ళు. ఒక్క వుద్యోగంకోసం వయసులో పెద్ద వాళ్ళెందరో మా యింటి చుట్టూ తిరుగుతూ ప్రాధేయపడుతూ వున్నారు. ధరల పెరుగుదల వలన, యీ ప్రాంతాల ముఖ్యవృత్తి అయిన నేతపని మూలబడి పోవటాన యీ జవాను వుద్యోగం - తొంభై రూపాయిల సంపాదన — వాళ్ళ ప్రాణానికో పెద్దవరంగా కన్పిస్తుంది. పరిస్థితు లలా వుండగా యీ పద్నాలుగేళ్ళవాడీ పనిలో ఎలా దూరేశాడో అని నా కాశ్చర్యం కలుగుతుంది. బ్రతుక నేర్చినవాడు కిష్టుడు! పోనీ, పని సరిగా చేస్తాడా అంటే అదీ లేదు. తప్పించుకునే ప్రావీణ్య వాడికి పుటకతోనే అబ్బింది. చదువు చూద్దామా అంటే, తెలుగు వ్రాయనుకూడా సరిగా రాదు.

'బడికి వెళ్ళి చదువుకోకుండా యీ పనిలో ఎందుకు చేరావురా అప్పుడే' అనడిగాను.

'బడికి వంపించాలని మా అయ్య సూశాడండి గాని నేను లొంగలా. తిరిగి పెడిపోతానని యిందులో జేర్చాడు...సదువు నా కబ్బదండి. యిదే బాగుంది' అన్నాడు.

ఆ బడికి పంపిన వైనం వాడు చెబుతుంటే వినటం తమాషా. వాడి అయ్యకు కళ్ళు కనబడవు. ఎండలో కూలిపనిచేసి చేసి కనబడకుండా పోయాయని అంటాడు వాడు. కిష్టణ్ణి కోప్పడి కొట్టి బళ్ళోకి తీసుకపోయి, లోపల ఒదిలి, వాడి నాయన వెనక్కు తిరుగుతూనే వీడూ వెనక్కు తిరిగి వెనుకనే నడిచి

వచ్చే సేవాడట. 'మా అయ్యకి వూపు లేదుగా, ఎవక్కి తిత్తి నూసినా నా పాటికి నే వొస్తావుంటే కని పెట్టలేడండి' అని పకి పకి నవ్వుతూ చెప్తాడు. వాడి కళ్లల్లో కొంటెతనం తళతళా మెరుస్తుంది. వాడినిచూస్తే ముచ్చట వేస్తుంది నాకు.

మరొక రకం వాళ్లుంటారు. తండ్రి గుడ్డి తనాన్ని గురించి అలా నవ్వలేరు. ఆ గుడితనపు భారమంతా తమమీదే వున్నట్టు అంగీకరిస్తారు. అట్లాంటి తండ్రిని మోసం చెయ్యటం కలలోకూడా తలపెట్టరు. కాని అలాంటి వాళ్లు నాకు నచ్చరు. రక్తమాంసాలుండి తమదైన ప్రత్యేక జీవితాన్ని ఆశించి అనుభవించే మనుష్యులు కారు వాళ్లు. కిష్టుడు పిస లైన మనిషి. అందుకే వాడి కలాయించే వేషాలకు కోపం వచ్చినా వాడి చేష్టలకు ముచ్చట కలిగి ఆ మాట ఒదిలేసుకుంటాను.

కిష్టణ్ణి కాకుండా యింకో మనిషినికూడా యింటి పనికి వేసుకోవచ్చును మేము. ఆ వుద్యోగం కోసరం ఎందరో యింటి చుట్టూ తిరుగుతున్నారు. ఇంకా ఎవరినీ ఎన్నుకోలేదు ఆయన. వేళాపాళా లేకుండా మాటి మాటికీ ఒక్కోరు తలుపు తట్టటం, వుద్యోగంకోసం ప్రాథేయపడటం...చాలా న్యూసె న్సుగా వుంది.

ఆ రోజు మధ్యాహ్నం నిద్రపోయి ఆలస్యంగా లేచాను. కిష్టుడింకా యింటినుండి రాలేదు. పని మనిషి ఒస్తోందేమోనని చూడటానికి వాకిట్లోకి వెళ్లాను. బయట పదిహేడేళ్ల కుర్రవాడు అరుగు మీద కూర్చుని వున్నాడు నన్నుచూసి గభాల్నలేచి వినమ్రంగా నమస్కారం చేశాడు. శుభ్రమైన బట్టలు వేసుకొని మొహాన విభూతి పెట్టుకొని బుద్ధిమంతుడి లాగా వున్నాడు.

'అమ్మా, వుద్యోగం ఒకటి ఖాళీగావున్నదని తెలిసి అయ్యగారి నడుగుదామని వచ్చాను' అన్నాడు. రోజుకి నలుగురు యీ పనిమీదనే వస్తున్నారు. మామూలు కథేనన్నమాట.

'ఏం, అయ్యగారిని యింట్లోనైనా కాస్త ప్రశాంతంగా వుండనివ్వదలచుకోలేదా? ఆఫీసుకైంలో అక్కడికేపోయి అడగరాదా' అన్నాను. ఒక్క నిముషం తటపటాయించి 'సరేనమ్మా' అని వినయంగా నమస్కారంచేసి వెళ్లిపోయాడు. ఇంకా ప్రాథేయపడ కుండా అంతటితో ఒదిలినందుకు కొంచెం ఆశ్చర్యపడి లోపలికి వచ్చేశాను.

ఈ రామయ్యకే వుద్యోగం వచ్చింది. మరునాడు. వచ్చి వినయంగా నమస్కారం చేశాడు. 'నీ కిచ్చారా వుద్యోగం!' అన్నాను. 'అవునమ్మా' అంటున్న అబ్బాయి మొహంలో కృతజ్ఞత కొట్టవచ్చినట్లుగా కన్పడు తోంది—ఆ వుద్యోగం ఏదో నా దయవల్ల వచ్చినట్లు!

ఏ పని చెప్పినా వినయంగా చేస్తాడు. ఈ పని చేద్దామనిగాని ఆ పని తప్పించుకుందామనిగాని రామయ్యకు ఆలోచనేరాదు. నా మనసులో వుండే వూహనే కనిపెట్టి పట్టుకొని దాని ప్రకారం చెయ్యాలని కాచుకున్నట్లుగా కనపడతాడు. ఆ ఆతృతచూస్తే నాకు విసుగేకాదు అసహ్యంకూడా కలుగుతుంది. 'వీడు బొద్దింకల జాతి' అనుకున్నాను.

ఒకసారి శాయిలుబాబు దొడ్డికి వెళ్లివచ్చి నప్పుడు నేను పనిలో వుండటంచూసి తానే కడగ టానికి వెళ్లాడు. ఇట్లాంటి పనులు నా పిల్లలకి ఎవరైనా చెయ్యటం నాకు బాగుండదు. 'అక్కర్లేదు, వుండు, నేను వస్తున్నాను' అన్నాను. 'పరవాలేదు లేమ్మా' అన్నాడు. 'ఏమిటీ పరవాలేదు? పనిమనిషి నాగమ్మకు కూడా యీ పని చెప్పను నేను...వెళ్లు' అన్నాను. మాట్లాడకుండా నీళ్లచెంబు అక్కడ పెట్టేసి వెళ్లిపోయాడు.

వంటయింట్లోకి వెళితే అక్కడ ఒక బొద్దింక పుల్లిపాయకోసం వచ్చి తారట్లాడుతోంది. చీపురు తీసుకుని ఫట్‌మని కొట్టాను. దాంట్లోంచి తెల్లని చీములాంటిది బయటకు వచ్చింది. ఆ చీమును చూసి ఒళ్లు జలదరించింది. పాడు బొద్దింకకు రక్తం వుండదు. దేన్నైనా తిని అరిగించుకొనేది యీ చీమే కాబోలు! బొద్దింకకు అది చాలా అవసరమైనదీ, రక్తంకంటే మంచిదీ, భూమిమీద మనిషిలేకుండా పోయినప్పుడు బొద్దింకమ సజీవిగా విలువబోయేది

కావచ్చు! కాని...నా దృష్టిలోఅది పరమానహ్యకరమైన చీము.

'కిష్టా...కిష్టా...బాత్‌రూమ్‌లో నీళ్లుపొయ్యరా' అని కేకపెట్టాను. రామయ్య పరుగెత్తుకుంటూ వచ్చాడు.

'కిష్టుడిని మీరు సినిమాకు వెళ్లమన్నారని అప్పుడే వెళ్లిపోయాడమ్మా' అన్నాడు.

'అంటే చెప్పకుండా యింతముందుగానే వెళ్ల మన్నానా?...సరే, నీవువెళ్లి పిల్లల్ని స్కూలునుండీ తీసుకురా' అన్నాను. రామయ్య వెళ్లిపోయాడు.

కిష్టుడు యింతవరకూ యిక్కడేవుండి ఆఫీసులో క్రొత్త వుద్యోగం ఖాళీవచ్చిన విషయమూ, అది తనకే యిప్పించవలసిన అగత్యం గురించీ చెపూ వున్నాడు. 'ఏరా, యిక్కడ వుండటం నీకు బాగా లేదా? ఎప్పుడూ పిల్లలతో కలిసి ఎగురుతూ వుంటావు యింకేంపని చెయ్యకుండా...' అన్నాను నవ్వుతూ. 'ఆ వుద్యోగం యిచ్చినా జీతం పెరుగుద్ది గాని పనియిాడనే సెయ్యొచ్చు' అన్నాడు ధీమాగా. వాడి అయ్యకు కళ్ళు కనబడటం లేదు. పనిలోకి పోలేకుండా వున్నాడు. వీడు ఒక్కడే కొడుకు. తల్లి రోగిష్టిది. పాతిక రూపాయిలు జీతం ఎక్కితే యింట్లో వుండే ముగ్గురికి తిండికి జరుగుతుంది, లేకపోతేలేదు. కాబట్టి ఆ వుద్యోగం వాడికి చాల అవసరం...ఇంతా చెప్పినవాడు భయంలేకుండా నాతో చెప్పకుండనే సినిమాకు పరుగెత్తాడు - నీళ్లుపొయ్యటం తప్పించుకోవటానికి!

వీడి ఆగడం గురించి ఎదురింట్లో లెక్చరరు గారి భార్యకూడా చెప్పింది. ఆమె దగ్గర దేనికైనా కావాలని పావలా అర్ధా యిప్పించుకొంటూ వుంటాడట. నేను వీడిని బజారుకు పంపినప్పుడు ఆమె కూడా ఏదైనా తీసుకురమ్మని పని చెపూ వుంటుంది. 'సంపాదించుకోనీ చిన్నవెధవ' అని నేనూ చూసీ చూడ నట్లు వూరుకున్నాను. ఓసారి వాడూ వుండగానే ఆమె అన్నది - 'మీా కిష్టుడికి పొగరు ఎక్కువవుతూ వుందండి. నేను మేడమీాద నిద్రపోతుంటే పిలువగానే పలకలేదని ప్రక్కనున్న పున్నాగచెట్టు పైకెక్కి పై కిటికీలోంచి కేకలువేసి లేపాడు. భయపడిపోయా ననుకోండి...యింతాచేసి ఎందుకంటే వాడికి సినిమాకు పావలా కావాలని! ఆమె కోపంగానే చెప్పాలను కున్నా మాటబయటికి వచ్చేసరికి నవ్వు వచ్చేసింది. 'మొన్న ఏం చేశాడనుకున్నారు! మీారు జల్లెడ పడణాలకు తెప్పించారు గదా. బాగుందని అదేమాదిరి జల్లెడ తెమ్మన్నాను. పన్నెండణాలకు లెచ్చాడు. ఏమిరా అంటే ధర ఎక్కింది అన్నాడు' అన్నది.

అక్కడేవున్న కిష్టుడికి ఆమె నాతో యిదంతా చెప్పటం నచ్చలేదు. 'అయితే సామాన్లు మా అమ్మగారికీ ఒకటే ధర మీకూ ఒకటే ధర అంటే ఎట్లా కుదురుతుందండీ' అన్నాడు ఏ మాత్రం తొణకుండా. వీడి ఆగడానికి అంతు కనబడ్డం లేదు. ఇప్పుడు నీళ్లు పొయ్యకుండా సినిమాకు పరుగెత్తాడు.

రామయ్య పిల్లల్ని తీసుకొని వచ్చాడు. వాళ్లు బొమ్మలు ముందేసుకుని కూర్చున్నారు.

'నీకీ వుద్యోగం ఎలా వచ్చింది రామయ్యా' అన్నాను వూసుపోక.

'అమ్మా, ఆ నాడు అయ్యగారిని కలుసుకోవటానికివస్తే మీారు యింట్లో అడిగితే బాగుండదనీ ఆఫీసులో అడగమనీ చెప్పినమీాదట అయ్యగారిని ఆఫీసులో కలుసుకొన్నాను. నా కష్టసుఖాలు చెప్పుకున్నాను. వుద్యోగం యిచ్చారు' అన్నాడు. వుద్యోగం తనకు యిప్పించటానికి తగిన సహాయిచ్చి నేను మేలు చేసినట్లు! అయ్యగారికి నేను రికమెండు చేశాననికూడా అనుకొంటున్నాడో ఏమో! కృతజ్ఞతా త్యాగం వగైరాలంటే నాకు చెడ్డ చీకాకు.

'ఇంతకుముందు ఏం పనిలో వుండే వాడివి?' అన్నాను.

'నేను ఆరో క్లాసులో వుండగా చదువు మాని పించి కోమటికొట్లో గుమాస్తాగా చేర్పించారు. అప్పటి నుండీ అదే పనిలో వున్నానమ్మా'

'అందులోనే వుండక యిక్కడి కెందుకొచ్చావ్?' అనడిగాను.

'అక్కడ జీతం యాభై రూపాయిలే యిస్తుండే వారు. అక్కడ నా తమ్ముణ్ణి పెట్టి యిక్కడ చేరాను' అన్నాడు.

'నీ తమ్ముడి కెన్నేళ్ళు?'

'పధ్నాలుగు'

'పద్దులపని బాగా చేస్తున్నాడా?'

'వాడికి శ్రద్ధ తక్కువమ్మా. ఇక్కడనుండి వెళ్ళాక నేను వెళ్ళితే వాడికి సహాయం చేస్తాను'అన్నాడు.

'ఆరో క్లాసులో చదువెందుకు మానేశావ్?'

'చదువంటే నాకు చాలా యిష్టమమ్మా...కాని వీలుపడలేదు. మా నాయనకు నేతపని వృత్తి. మేము ఎనిమిదిమంది పిల్లలం. మా నాయన తెల్లవారు ఝామున ఎప్పుడు మగ్గంముందు కూర్చుంటాడో చీకటిపడ్డాక లేస్తాడు. వెలుతురు మొహం చూసేపనే లేదమ్మా...ఎంతచేసినా భోజనానికి జరగలేదు... యిప్పుడు కూడా జరుగుబాటు కష్టంగానే వుంది'

'అంతా నీవే మొయ్యాలని ఎక్కడుంది? ఎలాగో హైస్కూలువరకూ నెట్టివుండొచ్చు, నిజంగా చదువంటే ప్రీతివుంటే...' అన్నాను.

'నేనూ చదవాలనే అనుకున్నానమ్మా. కాని మా నాయన నన్ను పిలిచి 'నీవు అందరిలో పెద్దవాడివి. నీ వెట్లాచేస్తే నీ తరువాతివాళ్లూ అట్లానే చేస్తారు. నీవు మాటవినకుండా చెడిపోతే వాళ్ళూ అంతే అయిపోతారు...నీ బాధ్యత తెలుసుకో' అన్నాడు. అందుమీదట చదువు మానేశాను...' అన్నాడు రామయ్య.

బొద్దింక! అనుకున్నాను. కోపం, అసహ్యం కలిగాయి. బాధ్యత అంటూ బరువుమోస్తూ తనకేవీ ప్రత్యేకమైన ఆశలూ కోరికలూలేని—రక్తంలేని జీవి! తమ్ముడికి శ్రద్ధలేదని వాడిపని చేస్తున్నాడు. క్రమంగా అందరిపనీ చేస్తాడు! ఏ పనైనా చేస్తాడు!

'నీ యంత తెలివిమాలిన వాళ్ళుండరు మరి' అన్నాను విసుగ్గా.

నా మాట అర్థం కానట్లు చూశాడు. అవును మరి, ఎలా అర్థం అవుతుంది? తనచేత తండ్రి ఒక గాడిద బరువును మోయిస్తున్నాడనీ, అది తనలోని ఆశలను వ్యక్తం చేసుకోలేక పోవటంవలన, తిరుగుబాటు స్వయంప్రజ్ఞ ఏమీ లేకపోవటంవలన జరుగుతున్నదనీ గ్రహించలేదు. తనకు జీవితంలో ఏదో తనదైన ఒక ఆశ, ఒక ప్రయోజనం లేకపోవటంవలననే సంభవిస్తోందని తెలుసుకోలేదు! తనలాంటి వాళ్ళంటే తల్లిదండ్రులకుకూడా అలుసే నని కనుక్కోలేదు!

ఆ రోజు రాత్రి భోజనాలదగ్గర ఆయన అన్నారు. 'ఆఫీసులో ఒక ఖాళీ వచ్చింది. మన కిష్టుడి కైనా రాముడికైనా వేద్దామనుకుంటున్నాను. పాతిక రూపాయిలు జీతం ఎక్కువ వస్తుంది. కిష్టుడు వచ్చి తాను సీనియర్ని అని చెప్పివెళ్ళాడు. రామయ్య పెద్దవాడు, పనిబాగా చేస్తాడు...' అన్నారు.

రామయ్య అడగనైనా లేదు! కిష్టుడు, పిచ్చి వెధవ, ఆశపెట్టుకున్నాడు. సంతోషిస్తాడు.

'కిష్టుడు పాపం ఆశపడుతున్నాడు' అన్నాను.

'ఇదేం తాయిలం అనుకున్నావా? పని జరగటం ముఖ్యం' అన్నారాయన నవ్వుతూ.

ఉల్లిపాయల దగ్గరే తిరుగుతూ వుంది ఒక బొద్దింక అవి తనవే నన్న ధీమాతో! దాన్నేచూస్తూ వున్నాను, పరధ్యానంగా.

కిష్టుడికి వుద్యోగం రాలేదు! రామయ్యకేయిచ్చారు!

ఎందుకో నా చిన్నతనం జ్ఞాపకం వచ్చింది. తోటి వాళ్ళందరూ హాయిగా ఆడుకునే సమయంలో నన్ను యింట్లో చదువుకొమ్మని సిరిపేది అమ్మ. డ్యూటీ ఫస్ట్, డ్యూటీ నెక్స్ట్, డ్యూటీ ఆల్వేస్! ఏమైనా అభిప్రాయం వ్యక్తం చెయ్యబోతే 'నాప సాని కబుర్లు చెప్పకూడదు' అనేది. 'విరాడంబరత' అనే పేరుతో ఒకతాను బిన్నీరంగుగుడ్డ తీసుకొని అందరికీ గుడ్డలు కుట్టించి పడేసేది. నా మనసు మెత్తని పూల పిల్కా గౌన్లమీద వుండేది...

కిష్టుడు గొప్పవాడని నేనూ రాముడు గొప్ప వాడని సరళా - మా యిద్దరికీ ఎప్పటికీ ఎడతెగని వాదం వుండేది. రాముడంటే నాకు తగనికోపం......

... కిష్టుడికి వుద్యోగం రావాలి. వస్తే సంతోషిస్తాడు. రామయ్యకు వచ్చినా వాడికి సంతోషించటం తెలీదు..కానికిష్టుడికిరాలేదు. రాకపోవటంచాలఅన్యాయం!

ఇంకా ఉల్లిపాయల దగ్గరేవుంది ఆ బొద్దింక-నున్నగా, ఓపిగ్గా, బిళ్ళలాగా, చెక్కుచెదరకుండా.

మనుష్యులపోయి బొద్దింకలే బ్రతకటం సాధ్యమా? కావచ్చు. కాని...కాని...తెలివిగల మనిషి చివరికి మిగిలేది బొద్దింకేనని గ్రహించి తానే బొద్దింక అయి మిగులుతాడేమో!

ఎంత ఘోరం!!

# అగ్ని దేవో భవ

## శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి

మహారాజును, మాడిపోతున్నాను
వీతిహోత్రుని కాంక్షాజ్వాలావలయంలో చిక్కువడి
అరడుగుల పాంచభౌతిక శరీరాన్ని
అరచేతిలోని బూడిదగా మారిపోతున్నాను!
క్షణం క్రితంవరకు అస్త్రరుపదంగా, అలంకారప్రాయంగా, నే ధరియించిన
ధగద్ధగిత, మణిస్థగిత ముళ్లకిరీటాన్ని మరొకరు లాక్కున్నారు—
ఎనిమిదికాళ్లరథంమీద ఊరేగిన నా కన్నుగప్పి
రాజ్యరమావశీకరణవిద్య నభ్యసిస్తున్నారు—
నను కీర్తించిన మాగధులే ప్రొద్దుతిరుగుడుపూవులై
గులాములై, వారిపై గులాబీ కవితా పన్నీటిని చిల్కరిస్తున్నారు—
నేను వేయించిన శిలాఫలకాలు చెరగిపోతున్నాయి
నా రాజ్యపు టెల్లలు కరిగిపోతున్నాయి
నాపై వర్షించిన ప్రజాకృపానీలజలదం మరొకరిపై వర్షిస్తున్నది.
రూపసౌందర్య మెరుగని అరసిక ప్రపంచ మిది
అందుకే నేను కాలిపోతున్నాను
వినువీధిలోని తారకలో కలిసిపోతున్నాను.

*　　　*　　　*

మహాకవిని మండిపోతున్నాను
సర్వభక్షకుని ఉపగూహనోద్రిక్తతకు వాడిపోతున్నాను
నా కవితా ధనుష్టంకారమునకు విచలితులైన పాలకులు
గండపెండేరములుతొడిగి కనకరాసులతలంబ్రాలు పోసిన పాలితులు
మరొక ఆస్థానకవిని నియమించుకొంటున్నారు
మహత్తుకూ, జగత్తులోని విద్యుత్తుకూ దూరంగా పారిపోతున్నారు
నా గుండెలలో బందీయై, వాక్కున శారికయై
నవవికసిత మల్లియలా, మోహనరాగంలా, వాసనసజ్జికలా నను దరిజేరిన రాణి,వాణి
ప్రవాసిని నన్నుజేసి, నూత్న కవికిశోరుని పిపాసను తీరుస్తున్నది.

వ్రచనలు, మధురోహలవెన్నెలదండలు, జగ్రదహస్యపేటికలు
చెదపురుగుల తుత్తు దీర్చి చపలులకూ, అబలులకూ అనర్థము లౌతున్నవి
అందుకే నేను విండిపోతున్నాను
మానవేతిహాసంలో మ్రదచనల పుటను చింపి, వేదావాగర్భంలోకి జారిపోతున్నాను.

కళాకారుణ్ని కనుమరుగై పోతున్నాను
వేయునాల్కలవాడి విజృంభణంలో శత ముఖాలుగా పగిలిపోతున్నాను
గంధర్వజాతి బుట్టి, ఋతు రహస్యములు నేర్చి
మ్రాగిన మదిర త్రాగి, జీవనవిపంచీతంత్రులను మీటి
అణువుకు కదలిక నేర్పి, ఎడారిలో స్రవంతీస్వనము విన్పించి,
రాతిని నాతినిచేసి, రతీశృంగారముద్రల శుద్ధపఱచి
రాగచిత్రాలను, చిత్రరాగాలనూ మేళనముచేసి
సమస్తధరాహృదయాధినాథుడనై నర్తించాను !
అయ్యో ! అయ్యో ! అందరూ నన్నపుడే మరిచిపోతున్నారు
నా సుఖాంతగానం ప్రకృతి విషాదగానంలో లయమౌతున్నది
నా చిత్రాలు, సౌందర్యశకలాలు, రూపుమారి చూపరులకు చిరాకు కల్గిస్తున్నాయి
నా నాట్యగతులు నవతకు నాందికా లేకున్నాయి,
అందుకే నేను కనుమరుగై పోతున్నాను
అనంత విశ్వకళాభవనంలో శాశ్వతవిశ్రాంతికై తరలిపోతున్నాను.

*    *    *

ఓ...ఓ...ఓ...ఓ...మ్...
రండి, రండి నాలో కలిసిపొండి
నేనే సృష్టిశక్తిని ! భర్తను ! లయకర్తను
నా ఇచ్ఛామాత్రంలో అణువులు, ద్వ్యణువులు, త్ర్యణువులుగా మారగలవు
రాజులు తరాజులుగా, మహాకవులు కాకులుగా రూపభేదం పొందగలరు
నేనే శివత్రినేత్రాన్ని ! చితాగ్ని స్వరూపాన్ని ! సూర్యదైవాన్ని !
నాలోని ఓంకార నాదమే సర్వగాన స్వరూపం
అనండి అనండి అగ్నిదేవో నమః
అన్నవాడే శాశ్వతుడు, భవుడు
అననివాడు నిరాశయుడు, పరాభవుడు
అందుకే, అగ్నిదేవో నమః...అగ్నిదేవో నమః...అగ్నిదేవోనమః.

# దశకుమార చరిత్రపై సత్యాపనము

## శ్రీ ముద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రి

'న సా సభా యత్ర న సన్తి వృద్ధాః,
వృద్ధా న తే యే న వదన్తి ధర్మమ్,
ధర్మో న వై యత్ర తు నాస్తి సత్యం,
సత్యం న తద్య చ్ఛలనానువిద్ధమ్.'

1967 సెప్టెంబరు భారతిలో శ్రీ నిడదవోలు వేంకటరావుగారు ఇటీవల ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు ప్రచురించిన - శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రిగారు పరిష్కరించిన ఆంధ్రదశకుమార చరిత్రపైఁ జేసిన విమర్శ చూచితిని. పరిష్కర్తలైన శ్రీ చంద్రమౌళిశాస్త్రిగారు వ్రాసిన సంవీక్షలో అసంగతములైన విషయము లున్నవని విమర్శించి యున్నారు. అందులో నా ప్రస్తావన వచ్చినది గనుక నేను సమక్షములో నున్నాను గాంబట్టి నేనే యూహాగానము చేయవలసిన పని లేకుండనే నేనే నాకు సంబంధించినంతవఱకు ఉన్న సత్యమును వెల్లడించుచున్నాను.

శ్రీ వేంకటరావుగారు తమ విమర్శలో నిట్లు వ్రాసియున్నారు. (1901 లో వీరేశలింగం గారచ్చు వేసి భగ్నభాగములను పూరించి కుండలీకరించి యున్న విషయము, దాని ననుసరించియే 1925 లో వావిళ్ల వారచ్చువేసినారన్న విషయము మొదలైనవి తెల్పిన తర్వాత) 'వాస్తవిక పరిస్థితి యిట్లుండగా ప్రస్తుత ముద్రణములో సంవీక్షాకర్త లేరీతిగా వ్రాశారో చూడండి' అని సంవీక్షాకర్త వ్రాత నిట్లుదాహరించియున్నారు. 'శ్రీ ముద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు విద్వాంసులు – పరిష్కారానుభవము గలవారు. ఈ గ్రంథాన్ని తాళపత్ర ప్రతితోనూ, మాతృకతోనూ, ప్రథమ ముద్రణ ప్రతితోనూ సరిచూచి వ్రాతప్రతిలో లేని భాగాలూ, ఖిలములైన భాగాలూ – మూలాన్ని, అక్కడి రచనను దృష్టిలో పెట్టుకొని సాధ్యమైనంతవఱకు 'తద్రచనయ'గా పూరించినవారు శ్రీ శాస్త్రిగారే వాటికి కుండలీకరణాలతో యివ్వడం జరిగింది' అని. ఈ విధముగా సంవీక్షాకర్త వ్రాత నుద్ధరించి మఱియు నిట్లు వ్రాయున్నారు.

'పై వ్రాతనుబట్టి దశకుమార చరిత్రలోని లుప్తభాగములు పూరించినవారు శ్రీ ముద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారనియు, కుండలీకరణ విధానము ప్రథమముగా నీ ముద్రణమునందే చేయాయి బడి యున్నట్లును స్పష్టమగుచున్నవి. కాని యిది యెంత అసంగతమో నేను పైని వ్రాసిన ముద్రితాముద్రితప్రతి వివరణమువలన తెలియగలదు. ఇంతే గాదు. ప్రస్తుత పరిష్కర్తలు వీరేశలింగంగారి ప్రతి మాట యటుండనిచ్చి, క్రీ. శ. 1925 లో ముద్రణ నందిన వావిళ్లవారి ప్రతిగూడ పరిశీలించి నట్లు కానరాదు. ఆ ప్రతియందే పూరణములు కుండలీకరణములు వీరేశలింగంగారి 1901 వ సంవత్సరపు ప్రతిననుసరించియే ముద్రితములైనవని విశదముగా వ్రాయబడియుండగా ప్రస్తుత పరిష్కర్తలు శ్రీ ముద్దులపల్లి వారే లుప్తభాగములను పూరించిరనియు, కుండలీకరణ విధానము నూతనమనియు నెట్లు వ్రాసిరో దురూహ్యః అని వ్రాసి తర్వాత [illegible]

'ఇంక ముద్దులపల్లి వారెప్పుడు తాళపత్ర ప్రతిని సంప్రతించిరో, ఎప్పుడు పూరణాలు గావించిరో మనకు తెలియదు. గాని ఈ క్రింది యంశమును బట్టి వారు కందుకూరివారి పూరణములనే మార్పులు చేసిరని నిరూపించవచ్చును.

1925 ముద్రణమున సప్తమాశ్వాసాంత పద్యములలో నొకమాలినీవృత్త మున్నది. దాని పాఠ మిది.

*(వరమ కరుణ భావా! భారతామ్నాయసేవా
చరణ) వితరణాం భోధారణాధః కృతాంభో
ధర! (నిరుపమ భద్రీ!) ధైర్య జాంబూనద్రాద్రీ!
పరిగత (నయసూ్రతా!) భాసురామాత్య పాత్రా!

పై వృత్తమున పూరణ భాగములను పురస్కరించుకొని శేషాద్రి రమణకవులు 'తొలిపలుకులలో'

భ్రష్ట భాగములు పూరించుటలో మాతృకా భావములు చాలవఱకు సమర్థింపబడినవి.. మఱియు సప్తమాశ్వాసాంత పద్యములలో

'భారతామ్నాయ సేవాచరణ' అని వ్రాయఁబడినది. కేతన, తిక్కన సోమయాజి గ్రంథ రచనము భారత రచనము చెప్పనే లేదు' అట్టిచో భారత ప్రశంస కవి మతమునకు విరుద్ధము.' (పుట 12).

అని వ్రాసియున్నారని, ఆ పాఠము ప్రస్తుత ముద్రణములో తొలగింపబడినదని, యత్‌స్థానము గూడ మార్పుజెందినదని, శేషాద్రి రమణకవుల వ్రాతను జూచి దీనిని మార్చిరనుట స్పష్టమని...'దీనిని బట్టి ప్రస్తుత పరిష్కర్తల వ్రాతకెంత ప్రామాణ్యమీయదగునో విద్వల్లోకమే విచారించుగాత' అని యీ ప్రకరణమును సూచించిరి.

ఇందులో నాకు సంబంధించినంతవఱకు నేను ఉన్న సత్యమును వెల్లడింపవలె గాన వెల్లడించుచున్నాను. ఇందులో మసిఁ బూసి మారేడుకాయను నేరేడు గాయఁ జేయవలసిన పని లేదు. పంచాంగములు పోయిన నక్షత్రములు పోవునా? వీరేశలింగం గారి ప్రతియు, వావిళ్లవారి ప్రతియు ముద్రితములై యున్నవి. ప్రత్యక్ష సాక్ష్యముగా మండనే యున్నవిగదా!

శ్రీ వేంకటరావుగారు వీరేశలింగం పంతులు గారి ప్రతిని, వావిళ్లవారి ప్రతిని ఇప్పుడు రెండింటిని బోల్చి చూచియే యున్నచో నిట్లు వ్రాసియుండరనుకొందును. ఉన్నమాతృక యొక్కటేయని, భ్రష్ట భాగములలోని పూరణములు కుండలీకృతములై యున్నవని రావుగారే నిర్ణయించియున్నారు. క్రిమిదష్ట భాగములలోని పూరణలు 50 వఱకు ఉన్నవి. కొన్నిచోట్ల ఒకక్షరము, రెండక్షరములు, కొన్నిచోట్ల పదములు, మఱికొన్నిచోట్ల పద్యములోని పాదములు, వేఱొక కొన్నిచోట్ల పద్యములకు పద్యములే పోయియున్నవి. ఒకటి రెండక్షరము లున్నచోట్లను, యతి ప్రాస స్థలములలో అనివార్యములైనవితప్ప తక్కిన స్థలములలో చాలవఱకు పూరణములు భిన్నభిన్నములుగా నున్నవి. అప్పుడు గాదిప్పుడు చూడవచ్చును.

నేను 1924–25 లో వావిళ్లవారి దగ్గఱ నుంటిని. అప్పుడు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారీపుస్తకమును పరిష్కరింపవలసినదనిచెప్పి యొక వ్రాతప్రతిని, వీరేశలింగముగారి ప్రతిని ఇచ్చిరి. (తాళపత్ర ప్రతితోనూ సరిచూచినట్లు వ్రాయుట శ్రీ చంద్రమౌళిశాస్త్రిగారి యూహాగానమే). ఈ వ్రాతప్రతిని పరిష్కరణార్థమై యొవరికో యిచ్చినట్లును, మూఁడేండ్లుంచుకొని యేవో వ్రాతతప్పులను దిద్ది పూరణభాగములలో వీరేశలింగముగారి పూరణములనేయుంచి వారి ప్రతిలో నిట్లున్నదని ఫుట్‌నోట్సు పెట్టియున్నారని, వీరేశలింగముగారి పూరణములు గాకుండ క్రొత్తగా వ్రాయవలసినదని చెప్పిరి. లోఁగడ చూచినవారు పెట్టియుంచిన ఫుట్‌నోట్సులో తామే కొన్నిటిని ఉంచవలసినదని చెప్పిరి. వారు చెప్పినట్లుగనే వీరియినంతలో క్రొత్తగాఁ బూరించి కుండలీకరణముచేసి క్రింద ఫుట్‌నోటు పెట్టుచువచ్చితిని.

అనివార్యములైన చోట్లతప్ప పంతులుగారి పూరణలకును, నా పూరణలకును పోలికలే లేని పద్యపాదములను, పద్యములను మాత్రమే యిక్కడ ఉదాహరించుచున్నాను. భావైక్యమునకు సందర్భోచితమైన మూలమున్నదిగదా! చిత్తగింతురుగాక.

పంచమాశ్వాసములో ఒక్కప్రాయపువేశ్య విరక్తితో నొక తాపసుని సేవింపరాఁగా ఆపెతల్లి వృద్ధవేశ్య కులవృత్తి దిగనాడివచ్చినది గనుక బుద్ధిచెప్పి యింటికిఁ బంపవలసినదన్న సందర్భములో

రావుగా రుదాహరించిన యీ పద్యములో కుండలీకరణములును, కొన్ని పదములును వావిళ్లవారి ప్రతికి భిన్నముగా నున్నవి.

తే. తపము వడయుదు వని వెఱ్ఱితనము మిగిలి
వినదు నా మాట దేవ ! నీ వమనయించి
యెన్నిభంగులనై

18

క. .యింత తథ్యము సుమ్మీ !

అని యున్నది. క్రిమిదంశితమైన యీ ఘట్టమున వీరేశలింగముపంతులుగారు

యెన్నిభంగులనైన (ను హితము గఱపి
తనయ నింటికిఁ బంపుము తాపసేంద్ర !

క. అని దీనముగా వృద్ధాం
గన మఱిమఱి వేఁడ మనసు కరఁగినవాఁడై
మునిపతి యాసతిఁ గని నీ
జనని గృహంబునకు మరలఁ జను మన నదియున్.

క. అనఘ ! భవత్పదసేవా
శను వచ్చితిఁ గాచెదేని సరి, కావనిచోఁ
జన నింటికి, నీ సన్నిధిఁ
దను విచటనె విడుతు) నింత తథ్యము సుమ్మీ!

అని పూరించి కుండలీకరించియున్నారు. నే నిట్లు పూరించితిని

యెన్నిభంగులనైన (ను హితము సెప్పి
కూఁతు నింటికిఁ బంపి మా కులము నిలుపు.

మ. అని దైన్యంబున వేశ్యమాత
మిగులం బ్రార్థింప నార్ద్రాత్ముఁడై
వనవాసంబునఁ గష్టముం,
దపము సాఫల్యంబునుం జెప్పి బ
వ్వని నవ్వేశ్య బహుప్రకారముల
నిర్బంధించి పొమ్మన్న న
మ్మని వాక్యంబుల నాలకించి
యనియెం బూఁబోఁడి యార్యాళిగన్.

క. దేవా ! నీపదసేవను
భావించియ వచ్చియుంటి; వలదని యనుచోఁ
బావకుఁడే శరణం బగుఁ
దావక సన్నిధిన) యింత తథ్యము సుమ్మీ !

అని. ఇక్కడ సంస్కృతమూల మిట్లున్నది. 'అథ సా వారయువతి స్సైన తాపసేన భద్రే! వను దుఃఖా కరో౽యం వనవాసః, తన్నఫల మపవర్గః, స్వర్గో వా. ప్రథమస్తు తయోః ప్రకృష్ట జ్ఞానసాధ్యః ప్రాయో దుస్సంపాదఏవ. ద్వితీయస్తు సర్వస్యైవ సులభః కుల ధర్మానుష్ఠాయినః. తదకార్యారంభా దుపరమ్య మాతు ర్మతే వర్తస్వేతి సానుకమ్పం మభిహితా సా తు ప్రత్యావాదీత్. యది భగవత్పాదమూల మశరణం, శరణ్యా మస్తు మమ కృపణాయా హిరణ్యరేతా ఇత్యుదమనాయత.'

పంచమాశ్వాసము 65 వ పద్యములో

సీ. బలియుఁ డోడిన ధనములు గొనఁజాలక
పుడికిన.........బోవువారు

అని యుండఁగా పంతులుగారు
...పుడుకు(ప్రమాఁ కని యాన యుడుగువారు)

అని పూరించిరి. నేను
పుడికిన (దానితోఁ) బోవువారు,

అని పూరించితిని. 'బలిషు సాన్త్వనాని' అని మూలము.

సప్తమాశ్వాసాంతమున వీరేశలింగంగారి ప్రతిలో 164, 165 సంఖ్యగల పద్యములు రెండు మాత్రమే ఆశ్వాసాంతపద్యములుగా నున్నవి ప్రతి ఆశ్వాసాంత మునను కేతనకవి యొక నియమము పెట్టుకొని వ్రాసియున్నాఁడు. మొదట నొక వృత్తము, తరువాత నొక కందపద్యము, ఆ తరువాత నొక మాలినీ వృత్తము ఈ విధముగానే వ్రాసియున్నాఁడు. ఈ సప్తమాశ్వాసాంతమునను 164 వ పద్యము శార్దూల వృత్తముగా వ్రాసి 165 వ పద్యము కందపద్యము గాను, 166 వ పద్యము మాలినీ వృత్తముగానే వ్రాసియున్నాఁడు. 165, 166 పద్యములు క్రిమిదష్టములై యీ మాత్రము నిలిచియున్నవి.

క. విద్యానికషోపల! ధ
ర్మోద్యోగ విరూఢమాన సోల్లాస! రుచి
...............................
...............................

మాలినీ వృత్తము శకలము లిట్లున్నవి.
...............................
.........దః కృతాంభో

ధర..........జాంబునదాద్రీ
పరిగత ....................

ఇట్లుండఁగా వీరేశలింగం పంతులుగారు కంద పద్యము కొఱవకే 'జాంబూనదాద్రిని' జేర్చి రెండవ పాదము చివరనుండి

.........మహా
హృద్యానవద్యమతివై
శద్యా జాంబునదాద్రి సన్నిభధైర్యా!

అని పూరించి అంతటితోనే ఆశ్వాసమును ముగించిరి. నియమ ప్రవృత్తమైన మాలినీవృత్తము నిర్మూలమయ్యెను. మాలినీవృత్త శిథిలములు నిలిచి యున్నవి గనుక నియమభంగ మెందులకుఁ గావలె? నని నేను 165 వ పద్యముయొక్క ఉత్తరార్థముతో పాటు దానినిగూడ నిట్లు పూరించితిని.

క. విద్యా.........రుచి
(ప్రద్యోతన! సంపద్విభ
వద్యోరాజ ప్రమాణ! ప్రాజ్ఞధురీణా!)

మాలిని.

(పరమకరుణ భావా! భారతామ్నాయసేవా
దరణ! వితరణాం భోధారణా) ధః కృతాంభో
ధర! (యనుపమ భద్రీ! ధైర్య) జాంబూనదాద్రీ!
పరిగత (నయనూత్రా! భాసురామ్నాత పాత్రా!)

ఇక్కడ రెండుప్రతులకు ఇంత వ్యత్యాసమున్నది. ఈ మాలినీవృత్తమిట్లుండఁగా శ్రీరావుగారు

'భారతామ్నాయ సేవా చరణ' అని, 'నిరుపమ' అని యుదాహరించి 'చరణ' అనుపాఠముతో యతిస్థానము తప్పినదని వ్రాసియున్నారు. వారు చూచిన ప్రతిలో ఈ విధముగానే యున్నదేమో మనకు తెలియదు.

భారతామ్నాయసేవా అన్నపాఠము శ్రీ రావుగా రూహించినట్లుగా శేషాద్రి రమణ కవులు సూచించిన తర్వాత నేనే

సురుచిర గురుభావా! సూరి సంఘీయసేవా
దరణ........................

అని మార్చి నా పుస్తకములో వ్రాసి పెట్టుకొని యుంటిని. దశకుమార చరిత్రమును పరిష్కరించునాటి కాంధ్రసారస్వతములో నాకుఁ గల పరిచయ మొక్క సంవత్సర పరిమితమైనదే గనుకను, విశేషించి చారిత్రకాంశము లట్టె తెలియకపోవుటచేతను, ప్రతీతినిబట్టియు, తిక్కనకు భారతామ్నాయసేవ నంటఁగట్టితిని. పొరపాటని తెలిసిన తరువాత దిద్దుకొంటిని. దిద్దినపాఠ మిట్లుండఁ పరిష్కర్తలైన శ్రీ చంద్రమౌళిశాస్త్రిగారు.

(నిరత భరితభావా! నిస్తులామ్నాయసేవా
తరుణ కరుణ తాంభోధారణా) ధఃకృతాంభో
ధర! (వరగుణభద్రీ! స్థైర్య) జాంబూనదాద్రీ!
పరిగత (బుధసత్రా భాస్కరామాత్యపౌత్రా!)

అని మార్చివేసిరి. అసలు పాఠము కానపుడు గుణవద్దృష్టితో మార్చిన మార్పవచ్చునుగాక ఆ మార్చిన వారు కర్తృత్వము తమపై నంకితము చేసికొని యుండిన బాగుండెడిది. నా పాఠము కానపుడు దాని బాధ్యత నాకుండరాదుగదా!

పరిష్కర్త మార్చిన పై పద్యము నుదాహరించుటలో శ్రీ వేంకటరావుగారు 'నిస్తులామ్నాయ'కు 'నిర్మలామ్నాయ'యని, 'సేవాదరణ' అనుటకు 'సేవా చరణ' అని భిన్నముగాఁ జూపియున్నారు. పైగా యతిభంగమైనదని యుల్లేఖించియున్నారు. ఈ పాఠము వారి కెక్కడ దొరకినదో:

నవమాశ్వాసములో 38 వ సీసపద్యము

పుప్పొడి రాలంగఁ బొలుపారి వీతెంచు
మలయానిలమునకు నులికి యులికి
తీఁగలు కప్పొర మూఁగి యాఁతి సేయు
భృంగమాలికలకు బెదరి బెదరి

అని రెండు పాదములే యుండి తక్కిన రెండు పాదములు శిథిలములై యుండఁగా పంతులుగారు

(ఫలములు రాల్చుచుఁ బాదపాళిఁ జరించు
చిలుకల పలుకుల కలికి యులికి
కొమ్మావి చిగురు జొంపమ్ములు తిని కేరు
పికనినాదములకు బెగడి బెగడి)

అని పూరించిరి. వేమ

(యేలమావి క్రొన్ననల్, అలిఁగ్రోలి కేరు కో
యిల పిండుకూఁతల కలికి యలికి
దొరగాయల మెక్కి తారు రాచిల్కల
దుడుకు సందడులకు జడిసి జడిసి)

అని పూరించితిని. ఇందులో నింత విభిన్నత యున్నది.

దశమాశ్వాసములో 34 వ పద్యము

క. మనమునను మరఁగి వెలివడి
తనమేన్.........దాని మరలి చూ
చినయట్ల కటాక్షము నా
తనువునఁ గిలించె మదను దర్పం బలరన్.

అని యుండఁగా పంతులుగారు

క. మనమునను మరఁగి (క్రమ్మఱం
దనుఁ జేరునొ చేరదొ యని) దాని మరలి చూ
చినయట

అని పూరణము చేసిరి. నేను

క. మనమునను మరఁగి వెలివడి
తనమేన్ (చేరునొ చేరదొ యని) దాని మరలి
చూచినయట్ల.........

అని పూరించితిని.

దశమాశ్వాసము 63 వ సీసపద్యములోని
యెతు గీతి

నుండి రంత హనూమంతుఁ డుదధిఁ జేరి
యుఱక నుంకించు పగిది నుజ్జ్వాంత లూఁగి
...లయమ్మారుతంబు...వోలెఁ
దీవ్రగతిఁ బాతి యొకపాదు దీవిఁ జేరె

అని యుండఁగా పంతులుగారు

నుజ్జ్వాంత లూఁగి
(యూఁగి) లయ మారుతము (పెన్నుద్ది) వోలెఁ
దీవ్రగతిఁ బాతి యొకపాదు దీవిఁ జేరె. అని

పూరించిరి. నేను

............నుజ్జ్వాంత లూఁగి
(యోడ) లయమారుతంబు (పెన్నుద్ది) వోలెఁ
దీవ్ర గతిఁ............

అని పూరించితిని.

దశమాశ్వాసము 97 98 వ పద్యములు

క. తగునే నీవు పతివ్రత
మగని నకారణము పాపమతివై యమ్మెఁ

చ.

దునుముట నీతి గాన
దయతోడఁ బతివ్రత భర్తఁ బిల్వఁగాఁ
బనుపుము వాఁడు నా వలనఁ
బాపము వెట్టిన దీని నోర్చెదన్.

అని యుండగా పంతులుగారి పూరణములో

క. తగునే నీవు పతివ్రత
మగని నకారణము పాపమతి (క్రూరం
బుగ వికలాంగుని జేయుట
పగవాఁడును వెగునె యిట్టిపాపము సేయన్?

చ. అనవుడు ధన్యకుం డనియె
నా ధరణీశ్వరుతోడ నాయెడ
న్ననవర! దోష మిందుక గ
నంౘడె నేనియు నైఁప కిమ్మెయిన్)
దునుముట నీతి గాన దయ
తోడఁ బతివ్రత భర్తఁ బిల్వఁగాఁ
బనుపుము.......................

అని యున్నది. నేను పూర్తి చేసిన దానిలో

క. తగునే నీవు పతివ్రత
మగని నకారణము పాపమతివై యమ్మెఁ
(దెగఁబడి వికలాంగుని జే
యఁగ ఛీ నీచేతు లెట్టు లాడె దురాత్మా!

చ. అనవుడు ధన్యకుం డనె ధ
రాధిప! దీని యథార్థ మెన్నకే
తునుమఁగఁ బంప నీతియె? య
దోషుని నైన వతండు చెప్పెనం)
దునుముట నీతిగాన దయ
తోడఁ బతివ్రతభర్తఁ బిల్వఁగాఁ బనుపుము

అని యున్నది.

97 [వ] కందపద్య పూరణములో కవివమ్మ

తముగాని సబిందుకప్రాస వేయఁబడిన దని శేషాద్రి రమణ కవులు సూచించియుండఁగా పొరపాటేయని దానిని నా పుస్తకములో నిట్లు దిద్దుకొనియుంటిని.

దెగఁబడి వికలాంగుని జే

యఁ గతుల్ మాలిన మహాదురాత్మా చెపుమా?

అని. ఈ ముద్రణములో పరిష్కర్తలు శ్రీ చంద్రమౌళిశాస్త్రి గారు

దెగువను వికలీకృతుఁ జే

సి గతిన్ దప్పిన దురాత్మ! చెపు మిది యెట్లో?

అని మార్చి వేసిరి, కర్తృత్వము తమపైఁ బెట్టుకొన కుండనే.

సబిందుక నిర్బిందుక ప్రాస సాంకర్య మంత పట్టింపు లేనిది గాదని అప్పకవీయములో 'తీఁగ, డాఁగు, (పు) న్నాగ, భోగ' ప్రాసలతోఁ గూడిన భారత పద్యమునే దృష్టాంతముగఁ జూపి యుండుటచే నిక్కడ నేను సబిందుక ప్రాస ముండవచ్చు లెమ్మని వేసితిని. తరువాతఁ దరువాత ఆ నియమము గట్టిగఁ బాటించిన వారున్నారని తెలిసికొని మనకూర్పులో గ్రంథకర్త కసమ్మతమైన దెందుల కని మార్పు చేసితిని. పరిష్కర్తలు దానిని మార్చిరి. ఇట్టి మార్పులలో తమపేరు పెట్టుకొనియుండిన బాగుండునని శ్రీ శాస్త్రిగారికి వ్రాయునంతవఱకే ఆయెను.

గ్రంథ సమాప్తియందు ద్వాదశాశ్వాసాంతమున ఆశ్వాసాంత పద్యములు, గద్యము లేకుండఁగా పంతులుగారు 'నా యొద్దనున్న ప్రతిలో ఆశ్వాసాంత పద్యములు విడువఁబడి యున్నవి అని సూచిక వ్రాసి యున్నారు. శ్రీ వేంకటరావుగారు 'చివరి యాశ్వాసమున పద్యాలు పూర్తి చేశారు' అని వ్రాయుట యెట్లో తెలియదు.

ప్రతియాశ్వాసాంతమునను ఒక వృత్తము, ఒక కందపద్యము, ఒక మాలినీవృత్తము వ్రాయుట కవినియమము గాన ఇక్కడఁగూడ ఆ సంప్రదాయమును విచ్ఛిన్నము చేయుట యెందులకు? కని నేనీ క్రింది పద్యములను వ్రాసి అధస్సూచిక నుంచితిని.

మ. విలసచ్ఛ్రౌత విధీయమాన సరణీ
విధ్యుక్త యజ్ఞ క్రియా
కలనా తర్పిత దేవ తేంద్రముఖ ది
క్పాలా! గృహీతోజ్జ్వల
జ్జ్వలనా క్ష్మాష్టమ దేహభాగ! మతిమ
చ్ఛద్యానవద్యాత్మ! ని
ర్మల విజ్ఞాన! యనూనవాగ్విభవసా
మర్థ్యా! కవిగ్రామణీ! 94

క. నవరస భావాలంకృత
కవితా రచనా విధాన కల్పిత పాండి
త్య విశేష! యుభయభాషా
తివిశారద! బుధవిరాజి! తిక్కనయాజీ! 95

మాలిని

సురుచిర చిరకీర్తీ! సుందరాకారమూర్తీ!
చరిత సవన పూర్తీ! సత్కృపా చక్రవర్తీ!
పరిణత నయవేదా! భాగ్యలక్ష్మీ వినోదా!
స్థిరతర ఘనమోదా! తిక్కనామాత్యపాదా! 96

కందుకూరివారి వావిళ్లవారి ప్రతులకు రెండింటికిని ఇంత విభిన్నతఁ గానిపించుచుండఁగా శ్రీ రావు గారు 'ఇక మద్దులపల్లి వారెప్పుడు తాళపత్రప్రతిని సంప్రతించిరో, ఎప్పుడు పూరణలు గావించిరో మనకు తెలియ'దని సందేహించిరి. పోనీ నాకిందుఁ బ్రసక్తి లేకపోవుగాక పంతులుగారి పూరణములకు భిన్నముగా నున్న పూరణముల కెవరికైనఁ గర్తృత్వమీయక తప్పదుగదా!

మఱియు నిట్లు వ్రాసిరి. 'పూరణములు, కుండలీకరణములు వీరేశలింగంగారి 1901 వ సంవత్సరపు ప్రతిననుసరించియే ముద్రితమైనవని విశదముగా వ్రాయఁబడియుండగా ప్రస్తుత పరిష్కర్తలు శ్రీ మద్దులపల్లివారే లుప్తభాగములను పూరించిరనియు, కుండలీకరణ విధానము నూతనమనియు నెట్లు వ్రాసిరో దురూహ్యము' అని పేర్కొనిరి. ఇంతకు ముందిట్లు వ్రాసిరి. 'కుండలీకరణ విధానము ప్రథమముగా నీ ముద్రణముననే ఈయబడినట్లును స్పష్టమగుచున్న'దని వ్రాసియున్నారు. నూతనముగానని, ప్రథమముగానని పరిష్కర్తల వ్రాతలో నెక్కడ నున్నదో కానరాదు. వారి వ్రాతలో నింత మాత్రమే యున్నది...వ్రాతప్రతిలో లేని భాగాలనూ ఖిలములైన భాగాలనూ మూలాన్నీ అక్కడిరచననూ దృష్టిలో పెట్టుకొని సాధ్యమైనంతవట్టు 'తద్రచనయ'కా పూరించినవారు. శ్రీ శాస్త్రిగారే వాటిని కుండలీకరణాలతో ఇవ్వడం జరిగింది' అని వ్రాయ

బడి యున్నది. ఇందులో పరిష్కర్తలు చెప్పికొన్నది కుండలీకృతములైన పూరణములు తమవని భావింతు రేమోయని ఫలానావారివని, వారే కుండలీకరణము చేసి యున్నారని పాఠకలోకమునకు పరిచయము చేసినట్లున్నది.

ఇంత యనర్థమునకును అవకాశమిచ్చినది శేషాద్రి రమణ కవుల తొలిపలుకులే. వారు తమ తొలి పలుకులలో '1901 లో ప్రచురించిన ప్రతులై పోగా ఇప్పుడు...పరిష్కరింపించి వావిళ్లవారు ముద్రించిరి' అని వ్రాయుటతో 1901 లోని ముద్రణము గూడ వావిళ్ల వారిదేయని యూహింప నగుచున్నది. కనుక ప్రస్తుత పరిష్కర్తలు గూడ అట్లే యూహించి ప్రథమముద్రణ మనునది వావిళ్ల వారిదే యని యట్లు వ్రాసినట్లున్నారు. వీరేశలింగం గారి ప్రతి యిప్పుడు దొరకుటయే లేదు. నాయొద్దను ఆ ప్రతి లేదు. ఈ వ్యాసములో వారిపాఠము లుదాహరించుటకై ఆ ప్రతికొరకు రాజమండ్రిలో శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారికిని, కొవ్వూరులో శ్రీ వాజపేయయాజుల రామసుబ్బరాయకవి గారికిని, కడపలో శ్రీ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారికిని వ్రాసితిని. ఎవ్వరును ఆ పుస్తకము దొరకలేదనియే వ్రాసిరి. వీరేశలింగం పంతులుగారి హైస్కూలులోనే పనిచేయుచున్న శ్రీ సత్యనారాయణశాస్త్రిగారే ఆ ప్రతి లేదని వ్రాయగా నిక నెక్కడ దొరకు? నని మద రానునకు శ్రీ వేదము లక్ష్మీనారాయణశాస్త్రికి వ్రాయగా వారిపాఠ భేదములను వ్రాసిపంపిరి శ్రీ చంద్రవౌళి శాస్త్రిగారికి వావిళ్లవారి ప్రతిగూడ దొరకుట దుర్లభమైనదని తమ సంవీక్షలో దెల్పుకొనియే యున్నారు. ఇక కం. వీ. పంతులుగారి ప్రతి మాట యేమి చెప్పవలె?

శేషాద్రి రమణకవులే 1901 లో వీరేశలింగం పంతులుగారు ప్రచురించిన ట్లొక్కముక్క వ్రాసి యున్నచో ఇంతగొడవ పెరిగియుండెడిది కాదేకాదు. గ్రంథములోపల అక్కడక్కడ ఫుట్‌నోట్లలో వీరేశలింగంపంతులుగారి ప్రతిప్రస్తావన లున్నవి. కనుక శాస్త్రిగారు పంతులుగారి ప్రస్తావన యెత్తవలసినదే కాని యట్లు జరిగియుండలేదు. ఇంతగ్రంథము నడుపవలసి వచ్చినది!

వావిళ్లవారు నాచే నింతపని చేయించుకొనిరి గాన పీఠికనుగూడ నన్నే వ్రాయుమందురని నేనను కొనుచుంటిని. కాని శేషాద్రిరమణ కవులచే వ్రాయించి నారన్న సంగతి ఆ ప్రూఫ్ నాయొద్దకు వచ్చినప్పుడు తెలిసికొంటిని. ఇంత శ్రమచేసి యిన్ని పద్యములు వ్రాసినందులకు నా పేరైన ఎత్తలేదేయని నిష్ఠురము లాడి మనసు నొచ్చుకొనగా అప్పుడు శ్రీ వేంకటేశ్వర శాస్త్రిగారు నా పేరిరికించిరి.

శ్రీ చంద్రవౌళిశాస్త్రిగారు నాకు పరిచిత పూర్వులుగారు. వారు 5 - 9 - 1966 వ తేది నాకొక లేఖ వ్రాసిరి. అందులో 'కేతన దశకుమార చరిత్రమును ఎడిట్ చేయుటకు ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమిచే నియుక్తుడ నైనా'నని 'ఆ గ్రంథ మెక్కడ దొరకలే'దని, శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు మీ చిరునామా దెలిపి మీకు వ్రాయు' మన్నారని, 'ఆ పుస్తకము తప్పక మీ యొద్ద నుండును గనుక పంపఁగోరుచున్నా'నని వ్రాసి శ్రీ గడియారము రామకృష్ణశర్మగారి సిఫారసు పత్త్రమును గూడ జోడించి పంపిరి. నా పుస్తక మంపితిని. వారి లేఖలో 'తర్వాత ఆ గ్రంథముపై చేసిన కృషి యేమైన నుండినఁ దెలుపవలసిన'దని కోరుటతో జరిగిన వృత్తాంతమంతా విశదముగాఁ దెల్పితిని. నా లేఖను, నా పుస్తకములో నేను వ్రాసి పెట్టుకున్న విషయములను చూచుకొనియే శ్రీ శాస్త్రిగారు తమ సంవీ సంక్షేపముగా నుటంకించిరి.

దశకుమార చరిత్రతో ఫలానావారి కేవిధముగా సంబంధ మున్నదో యని శ్రీ వేంకటరావుగారు సందేహించి, ఈ సందేహమును పాఠకలోకమునకుఁ గూడఁ గల్పించి నందులకు నే నింత దూరము వ్రాయవలసి వచ్చినది.

ఇదంత గ్రంథ ప్రమాణముతోనే యున్నది గనుక విద్వల్లోక మింక సత్యనిరూపణము చేయ వచ్చును.

సత్య మే వాభిజానీమః
నాన్యతే కుర్మహే మతిమ్,
స్వధర్మ మనుతిష్ఠామః
తస్మా న్మృత్యుభయం న నః (భారత సూక్తి)

# విపర్యయమ్

శ్రీ వంగల పార్థసారథి ఆచార్య

ప్రమాద మదిరాపానము
ప్రమోదమని భావింతును!
ఉన్మాదములో భ్రమించి
ఒహో! పురోగతి యందును!

జనన జరా విపన్మృతులు
క్షణ క్షణమ్మెదురైనా
నిర్లక్ష్యము చేసి—అదే
నిర్భయ లక్షణ మందును.

బహు కార్య భర వ్యగ్ర
వ్యాపృతి గౌరవ సాధన
కాల సూచికా యంత్రాం
గము లాగిన క్షణమెఱుగను!

సూర్యోదయ సందర్శన
సూచియందు నభివృద్ధికి;
అస్తమయంతో తరిగే
ఆయుష్యమనే యెఱుగను!

ప్రవాహ వేగము నెఱుగను
ప్రభూ! జీవితము నెఱుగను!

# మఱుగుపడిన సంస్కృత కవిరత్నము, మీమాంసకమిహిరుడు శాలికానాథుడు

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు యం. ఏ.,

'అగాధగర్తేషు మహార్ణవస్య,
వసన్తి రత్నాన్యమిత-ప్రభాణి.[1]

సంస్కృత సారస్వతసాగర మపారము, అగాధము. ఎండక న్నెఱుగక, కవిలాసిర్మాణప్రవీణులు, ప్రౌఢ వైదుషీభూషితులు అగు విద్వత్కవు లెందఱిందు జాడ కూడ తెలియక మఱుగుపడిపోయిరో చెప్పలేము. పతనపాతనములనుండి దూరమై, విస్మృతి పంకమగ్నము లైన ఉదాత్తకావ్యనాటకాదు లెన్ని ఉత్పన్నము లైనవో.

దాక్షిణాత్యకవిశేఖరులలో విఖ్యాతుడైన నీలకంఠ దీక్షితులు

'కతి కవయః, కతి కృతయః
కతి లుప్తాః, కతి చరన్తి, కతి శిథిలాః'

అని యొకచో వ్రాసియున్నాడు.

(కవితల్లజు లెందఱో, కృతిరత్నము లెన్నో, ఇం దెందఱు మఱుగుపడిరో, ఎన్ని కృతిరత్నములు విస్మృతి దూళిధూసరితములో, ఎన్ని పఠనపాఠనమున ప్రచారమునందిజీవించియున్నవో, ఎన్ని ఉత్పన్నములో, ఎన్ని త్రుటితములో చెప్పజాలము)

గృధ్రదృష్టివలె నిశితదీర్ఘమగు దృష్టిగల గవేషణ నిపుణుల కఠోరకృషిఫలముగా ఎడనెడ అట నట విస్మృతులగు కవితల్లజులు, విస్మృతిశిథిలము లగు కావ్యములు వెలువడుచుండును. మఱుగుపడిన ఒక కవిశేఖరుని గూర్చి, తత్కవితాశకలములను గూర్చియు ఇట వివరింపబడును.

**శాలికానాథుడు (క్రీ. శ. 750 ప్రాంతము) –**

1. జైమినిమహర్షి, 2. శబరస్వామి, 3. ప్రభాకరుడు ('గురు'వు), 4. కుమారిలభట్టు పై ప్రభాకరుని శిష్యులగు 5. శాలికానాథుడు, మహోదధియు, 6. వాచస్పతిమిశ్రుడును మీమాంసా దర్శన నిర్మాతలలో మహారథులు.

పై వారిలో జైమిని మీమాంసా సూత్రము లను నిర్మించి, మీమాంసాసౌధమునకు పునాదులు వేసెను. జైమిని సూత్రములకు భాష్యకర్త శబర స్వామి (క్రీ. 100–500). శాబరభాష్యము పై 'బృహతి, లఘ్వి' అను రెండు భాష్యములను రచించిన మహామహుడు ప్రభాకరుడు. ఈయన అంతేవాసియగు శాలి(రి?)కా నాథుడు తన గురువు నిర్మించిన బృహతిపై 'ఋజువిమల' అను ఉపవ్యాఖ్యానమును, లఘ్విపై దీపశిఖ అను వ్యాఖ్యను రచించుటేకాక 'ప్రకరణ పంచిక' అను ప్రత్యేక గ్రంథమును కూడ కూర్చెను శాలికానాథుని సబ్రహ్మచారి మహోదధి పండితుడు. ఈయన గ్రంథము లేవో తెలియదు.

కాని, తత్కృత శ్లోకములు 2, 3 సుభాషిత రత్నకోశమున, శ్రీధరదాసుని సదుక్తి కర్ణామృతము నను లభించినవి. ఇంచుమించుగా లోకాయత (నాస్తిక)

1. థామస్ గ్రే (క్రీ. 1716 – 1771) అను ఆంగ్లకవితల్లజు ఈభావమునే మహాహారముగ నిట్లు నుడివెను.

'Full many a gem of purest ray serene,
The dark unfathomed caves of ocean bear:
Full many a flower is born to blush unseen,
And waste its sweetness on the desert air'–Thomas Gray. (1716–1771 AD.)

మతముగా (Atheistic; Nihilistic)2 మారిన మీమాంసా దర్శనమును ఆస్తికమార్గమునకు మరల్చిన మహామహుడు కుమారిలభట్టు (క్రీ. 750). ఈయన గ్రంథములు 'తంత్రవార్తికము, శ్లోకవార్తికము, టుప్టీక' అను రత్నత్రయము. త్రిలోచన పండిత శేఖరుని శిష్యుడును, షడ్దర్శన టీకా నిర్మాతయు అగు వాచస్పతిమిశ్రుడు (క్రీ. 976) ప్రాతః స్మరణీయుడు. భామతీకర్తయు భామతీభర్తయునగు నీ మహామహుని గ్రంథాంతరములు :

1. తత్త్వబిందు.
2. న్యాయకణికా.
3. న్యాయవార్తిక టీకా.
4. న్యాయసూచీ నిబంధ.
5. బ్రహ్మతత్త్వ సమీక్షా.
6. (భామతి).
7. సాంఖ్యతత్త్వ కౌముదీ.

బిల్హణ మహాకవి బిల్హణ చరిత్రమున – ఇట్లు వ్రాసియుండెను.

శా. నైవ వ్యాకరణజ్ఞమేతి పితరం, న
భ్రాతరం తార్కికం,
దూరాత్ సంకుచితైవ గచ్ఛతి యథా
చండాలవ చ్ఛాందసమ్,
మీమాంసా నిపుణం నపుంసక ఇతి
జ్ఞాత్వా, నిర స్యాదరాత్
కావ్యాలంకరణజ్ఞమేవ కవితాకన్యా
వృణీతే స్వయమ్.'

(కవితాకన్య పితృస్థానీయుడని శబ్దశాస్త్రవేత్తను చేరదు; సోదరతుల్యుడని తార్కికు నంటదు; (ఛాందసుని) వేదపండితుని చండాలునిగా భావించి సంకోచముతో దూరమునుండియే తొలగిపోవును. మీమాంసా విశారదుని నపుంసకుడని భావించి, నిరసించి, కావ్యాలంకార విశారదునే ఆదరముతోవరించును.)

పై భావములు సామాన్యముగా స్థూలదృష్టితో మడివినవనియే చెప్పదగును. తర్కమీమాంసావ్యాకరణాది శాస్త్రములయందు కూలంకష వైదుష్యముగల విద్వత్ప్రకాండు లెందఱో మనోహర కవితా నిర్మాణ నిపుణులు కలరు. ప్రౌఢశబ్దశాస్త్ర విశారదులగు పాణిని, భట్టి, మురారియు కావ్యనాటక నిర్మాతలే. తార్కికసింహులగు వేదాంతదేశికులు, ప్రసన్నరాఘవ కర్తయగు జయదేవుడు, రుద్రన్యాయవాచస్పతియు హృదయావర్జకములగు కావ్యములను రచించిరి. తర్కవ్యాకరణములందును, పూర్వోత్తర మీమాంసలయందును, వేదాధ్యయనమునందును ఉద్దండపండితుడగు వేంకటాధ్వరి మీమాంసగ్రంథములనేకాక, కావ్యచంపూ - నాటకాదుల నెన్నిటినో రచించెను. కావున తర్కవ్యాకరణాది శాస్త్రములయందు సిద్ధహస్తులైన పండిత మూర్ధన్యులనైనను కవితాకన్య చేపట్టదనుట సత్యముకాదు. శాలికానాథుడును ఈ కక్ష్యకు చెందినవాడే. మీమాంసకాచార్య పరంపరలో ఈయన అయిదవ తరమువాడనియే కాని, ఈయన మనోహర కవితా నిర్మాణ నిపుణుడని విద్వల్లోకము మెఱుగదు. ఈతని కావ్యకృతు లేవియో తెలియదు కాని తత్త్వచింతామంజరినుండి రాలినకొన్ని దళములు మాత్రము మనకు లభించుచున్నవి. ఇట్టి కావ్యదళముల నేరి, ఇట ప్రదర్శింతును. సుభాషితకోశములయం దీయన కవితాశకలములు కొన్ని నిక్షిప్తములైనవి.

### శాలికానాథుని శ్లోకరత్నములు

**1. శాల్మలీపాదప – శుకాన్యోక్తి :**

ఫలలోభముచే భ్రాంతిచే నొకచిలుక బూరుగు చెట్టు నాశ్రయింప దానిపళ్లు పగిలి అందలిదూది మాత్రము వెలువడెనట; నక్క మేషాండభ్రాంతితో గొఱ్ఱెవెంట నరుగుట యిట్టిదే.

శా. 'ఏతస్మిన్ కుసుమే స్వభావమహతి ప్రాయో
మహీయః ఫలం
రమ్యం స్వాదు సుగంధి శీతల మలం
ప్రాప్తవ్య మి త్యాశయా,

2. సర్వతంత్రస్వతంత్రులగు శ్రీ వేదాంత దేశికులు (క్రీ. శ. 1268–1369) రచించిన 'సేశ్వర మీమాంస' అను గ్రంథరాజము నిట స్మరింపదగును (వేదాంతదేశిక గ్రంథమాలా–III వేదాంత విభాగః, 2 సంపుటమ్; 1940 కాంచీపురమ్.)

శాల్మల్యాః పరిపాకకాలకలనాబోధేన
కీరః స్థితః,
యావత్ తత్ఫుటసంధి నిర్గతపతత్తూలం
ఫలాత్ పశ్యతి'

(--'సుభాషిత రత్నకోశః' సు. ర. కో 1063 శ్లో. 192 పు. కవినామరహితము. 'సదుక్తి కర్ణామృత=సదుక్తి. IV. ప్రవాహ, 55 వీచి 5 శ్లో.'శాలికానాథస్య')

2. న్యగ్రోధమును(మఱ్ఱిచెట్టును) గూర్చి అన్యోక్తి:

వేలకొలది మఱ్ఱిగింజలలో అత్యంత స్వల్పమగు నేదొకకొక్కటియో కొంతకాలమునకు మహావృక్షమై సాంద్రచ్ఛాయ కలిగి తనచెంతకు చేరిన పథికులకు మార్గాయాసమును తొలగించును.

శా. 'న్యగ్రోధే ఫలశాలిని స్ఫుటరసం
కించిత్ ఫలం పచ్యతే
బీజా న్యంకురగోచరాణి కతిచిత్
సిధ్యంతి, తస్మిన్నపి,
ఏక స్తేష్వపి కశ్చి దంకురవరో
బధ్నాతి తా మున్నతిం
యా మధ్వన్యజనః స్వమాతర మివ
క్లాంతిచ్ఛిదే ధావతి'

—(సు. ర. కో 1063 శ్లో. 192 పు. 'శాలికస్య' సదుక్తి. IV. 58—1. 'శాలికానాథస్య' (ప. సా. రత్నాకర (Ms. 184b;) హంసవి. గణి: అన్యోక్తి ముక్తావళి, పు. 129, 172; వాగ్భట : కావ్యానుశాసన—పు. 35; భోజప్రబంధ సా. సం (Ms); సుభాషిత సు. ర. భాం. 642 పు. 3 శ్లో. బొంబాయి. 1928

3. అమరసింహ ప్రశంస:

'ప్రయోగ—వ్యుత్పత్తౌ,
ప్రతిపద విశేషార కథనే,
ప్రసత్తౌ, గాంభీర్యే,
రసవతి చ వాక్యార్థఘటనే,
అగమ్యాయా—మన్యైర్
దిశి పరిణతే శ్చార్థవచసోర్,
మతం చే దస్మాకం
కవి రమరసింహో విజయతే'

--[సు. ర. కో. 24 శ్లో. 279. పు. 'శాలికస్య'; సదుక్తి. V. 27—2 'శాలికానాథస్య']

4. కవికోవిదుల—భువనోత్తర =సర్వతోముఖ)

శా. 'య న్నేత్రై స్త్రిభి రీక్షతే న గిరిశో,
నాష్టాభిర ప్యబ్జభూః,
స్కందో ద్వాదశభి ర్న వా, న మఘవా
చక్షుస్సహస్రేణ వా,
సంభూయాపి జగ—త్త్రయస్య
నయనైర్ ద్రష్టుం న తచ్ఛక్యతే,
ప్రత్యాదిశ్య దృశౌ, సమాహితధియః
పశ్యన్తి యత్ పండితాః'

—[సు. ర. కో. 1249 శ్లో. 222 పు. (కవినామ రహితము); సదుక్తి. V. 25. 2 శ్లో.' ('శాలికానాథస్య'; మునిచంద్రగణి 'పారసూక్తావళి' (Ms.) 779. శ్లో.]

తా. [త్రినేత్రుడైనను దేనిని పరమశివుడుకూడ చూడజాలడో, ఎనిమిది కన్నులున్న బ్రహ్మ యైనను దేనిని కనలేడో, ద్వాదశనేత్రు డయ్యు కుమారస్వామికూడ దేనిని చూడనేరడో, సహస్ర నేత్ర సమన్వితుడయ్యు ఇంద్రుడు దేనిని చూడ లేడో, ఈ జగత్త్రయగల నేత్రములన్నియు కలిపి నను దేనిని కాంచలేవో అట్టి భువనాద్భుత వస్తువును (దృశ్యమును) ద్వినేత్రుడయ్యు పండితుడు (కవి) తనచర్మ చక్షువుల నిరసించి, గాఢసమాధినిష్ఠుడై తనప్రజ్ఞాచక్షువుతో (దివ్యదృష్టితో The Mind's eye) దర్శింప గల్గుచున్నాడు.]

పై భావముతో పోలికగల ఈ క్రిందిపద్య మెవరు రచించిరో కాని చాల రమ్యముగా నున్నది:

బుధశేఖరుని లోకాతీత ప్రజ్ఞ

శా. 'ద్వాభ్యాం య స్సహరి, స్త్రిభి ర్న చ హరః,
సప్త్యా న చై వాష్ట
య న్న ద్వాద గుహో.
న దశకద్వంద్వేన లంకాపతిః,
య న్నేంద్రో దశభిః శతై ర్,
న జనతా నేత్రై రసంఖ్యై రపి,
తత్ ప్రజ్ఞానయనేన పశ్యతి బుధ శ్చై కేన
వస్తు స్ఫుటమ్'

—(పండిత భవదత్తశాస్త్రి చరణులచే 'తిలక మంజరీ' భూమికలో నుదాహృతము. 5 పు.

రెండు నేత్రములుగల హరి కాని, త్రినేత్రుడగు పరమశివుడుకానీ, అష్టనయనములుగల బ్రహ్మకానీ, ద్వాదశనేత్రములుగల కుమారస్వామికానీ, ఇరువది నేత్రములుగల రావణుడుకానీ, వేయి కన్నులుగల ఇంద్రుడుగానీ, అసంఖ్యాకములగు నేత్రములచే జన బృందముకానీ దేనిని చూడలేదో అట్టి నిగూఢవస్తువును ప్రస్ఫుటముగా తన ప్రజ్ఞానేత్ర మొక్కదాని చేతను పండితుడు దర్శింప గల్గుచున్నాడు—

—'రవి కాననిచో కవి కాంచునేకదా?' అను తెనాలి రామకృష్ణకవి రచనగా లభించిన పద్యము నందలి భావము పై భావములతో సంవదించుచున్నది—అని భావము.

5. పిప్పల వృక్షమును (రావిచెట్టు) గూర్చి

శా. 'సత్యం పిప్పల, పాదపోత్తమ,
ఘనచ్ఛాయోన్నతేన త్వయా
సన్మార్గో చ్చ మలంకృతః, కి మపరం త్వం
మూర్తి భేదో హరేః,
కిం చాన్యత్ ఫలభోగ హృష్ట ముఖరా స్సర్వ
మాశ్రితాః పత్రిణో
యత్ పుంస్కోకిలకూజితం విదధతే
సన్మానురూపం పరమ్.'

—[సు. ర. కో. 1061 శ్లో. 192 పు: సదుక్తి. IV. 52. 2 శ్లో. (శాలికానాథస్య'.): ప్ర. సా. రత్నాకర (M. S) 184 b. (కవినామ రహితము)]

## ఉపజీవ్య గ్రంథ ముక్తాకలాపము
(Bibliography)

1. అన్యోక్తి ముక్తావళి (హంసవిజయగణి) కావ్యమాల 88. నిర్ణయసాగర ప్రెస్, బొంబాయి క్రీ. శ 1907.

2. కావ్యానుశాసన (వాగ్భట) కావ్యమాల 43-నిర్ణయసాగర ప్రెస్, బొంబాయి క్రీ. శ. 1894.

3. తిలకమంజరీ (ద్వితీయావృత్తి (ధనపాల) కావ్యమాల 85 – నిర్ణయసాగర ప్రెస్, బొంబాయి క్రీ. శ. 1938.

4. పూర్వమీమాంసా దర్శనసార (ప్రొం. వా కాణే) (In English) క్రీ. శ. 1924.

5. ప్రసన్నసాహిత్య రత్నాకర (నందపండిత) (అముద్రిత) క్రీ. శ. 1924.

6. భోజప్రబంధసారసంగ్రహ (అముద్రిత) వ్రాతప్రతి భండార్కర్ - ప్రాచ్యగవేషణ నిలయమున కలదు.

7. సదుక్తికర్ణామృత (శ్రీధరదాస) పంజాబ్-యూనివర్సిటీ— సీరీస్ – 15. క్రీ. శ. 1933.

8. సారసూక్తావళీ (అముద్రిత)

9. సుభాషితరత్నకోశ(విద్యాకర), పరిష్కర్తలు: డాక్టర్—ధర్మానంద కోశాంబి. డాక్టర్- వి. వి. గోఖ్లే. క్రీ. శ. 1957
Harvard Oriental Series No. 42 Harvard

10. సూక్తిముక్తావళి (అ. భ. జల్హణకవి) పరిష్కర్త: ఎంబార్–కృష్ణమాచార్య. క్రీ. శ. 1938. (Gaekwad's Oriental Series-No. 82. (వ్రాతప్రతియు)

# నా ఆకాశం

శ్రీ చెరబండరాజు

ఓం బెల్లా మెడలు సాచి
కాలుతున్న కడుపులతో
కంకాళాలై తిరుగుతున్న
నా జాతికి శాంతిని చల్లదనం
అందించే జలధారలకై
పిడికెడు పిడికెడు ఎడారి ఇసుకను
పిండుతున్న పిండుతున్న

రెక్కలు తెగి
ఒంటిమీది ఈకలూడి
వణికి వణికి చలిని త్రాగి
మండు టెండను చప్పరిస్తూన్న
నా జాతి కపోతాన్ని
రుతుచక్రం క్షమించేట్టు
కాలాన్ని వడ్డాణంగా చుట్టుకు
వంచుతున్న వంచుతున్న

ఆకురాలి
నిలువెల్లా బెచ్చులెగసి
వీడలే ప్రాణాలుగా భయంకరంగా
కూలిన గోడల్లా నిల్చున్న
నా జాతి చెట్లకు
ఆత్మను పట్టించేందుకు
బంధించి గాలిని బోనెక్కించి
కాగులు కాగులుగా అపరాధాల్ని
కక్కిరిస్తున్న కక్కిస్తున్న

పురుగులుపడి
చర్మపు డొలకల్లా
డొక్కలు వ్రేలాడేసుకున్న
నా జాతి జీవనదుల్ని
మళ్లించేందుకు
నలుదిక్కుల కొండల్నెన్నో
చితగ్గొట్టి రుతుపవనాల్ని
అడ్డుతున్న అడ్డుతున్న

మార్గంచెడి
వెలుగులారి
పెదాలు కాల్చుకు
ఆశాదీపాల్ని ధ్వంసం చేసుకు
అంధకారపు అభయ హస్తాల్ని
శూన్యంలోకి దీనంగా చూస్తున్న
నాజాతి దృక్పథపు ఆకాశాన్నివెలిగించేందుకు
సూర్య చంద్రుల్ని తారల్ని
పాదాక్రాంతుల్ని చేసి గొంతులపై
చేస్తున్నా
కథక్కళీ, కథక్కళీ

ఏది ఏది నా జాతీ ?
నే కోరే చల్లదనం, కపోతం
ఫల పుష్పాదుల పచ్చని చెట్లూ
ఆ రుతుపవనం ?
నా ఆకాశం ?

# కేసరివలె డు*

'త్రిపుర'

మోహన్‌రెడ్డి క్లబ్ హౌస్ వరండాలోకి వచ్చి నిలబడ్డాడు. లోపల మిస్ కపూర్ అల్లరి ఎక్కువయిపోయింది. మిస్ కపూర్ 'వేడి' మాటలు తట్టుకోలేకపోయాడు మోహన్‌రెడ్డి.

సిగరెట్ తీసి కసిగా వెలిగించాడు.

టెన్నిస్ కోర్టులో సింగిల్స్ ఆడుతున్నారు వధ్వానీ, కేశవరావు. వధ్వానీది పవర్ టెన్నిస్. కేశవరావుది క్లబ్ టెన్నిస్—హాఫ్ వాలీలూ, జాగ్రత్తగా, తెలివిగా, సున్నితంగా డ్రాప్‌షాట్లు. స్పిన్ సర్విస్. వధ్వానీ పొట్టిగా, లావుగా, కుదించిన పీపాలాగ. కేశవరావు పొడుగ్గా, కేబుల్‌వైర్‌లాగ. ఇద్దరికీ టెన్నిస్ ఒక పేషన్.

మోహన్‌రెడ్డి వాచీ చూసుకున్నాడు. ఈపాటికి మెసేజ్ వచ్చిఉండాలి. నాలుగున్నరకి ఏ సంగతీ ఫోన్ చేస్తానని కర్నల్ చెప్పాడు శనివారం మధ్యాహ్నం, నవ్వుతూ సాగనంపుతూ. కర్నల్ సెబాస్టియన్‌కి తన క్రింది ఆఫీసర్లు పిల్లలకింద లెక్క. వాళ్ళకి వీకెండ్ కావాలి. వాళ్ళకి క్లబ్బుల్లో స్లీవ్‌లెస్‌బ్లౌజుల్లో ఉన్న అమ్మాయిలతో సోఫాలమీద కూచుని మాట్లాడ్డం యిష్టం. తనకి వీకెండ్స్‌లో మాగజైన్లూ, న్యూస్‌పేపర్లూ, పీటర్‌ఛేనీ నావల్సూ చాలు. వాళ్ళకి టర్టిల్‌నెక్ స్వెట్టర్లూ, ఉక్కురంగు ట్రౌజర్లూ, అద్దంలా మెరిసే జోళ్ళూ కావాలి. తను పాత డ్రెస్సింగ్ గౌన్ వేసుకుని, పైప్‌నిండా పొగాకు దట్టించి, కాళ్ళు జాపుకుని చదువుతూ వీకెండ్స్ గడిపేస్తాడు.

అయిదున్నర అయింది టైమ్. ఇంకా ఏ మెసేజీ రాలేదు. రెడ్డి వరండా మెట్లు దిగి కంకర బాటమీద మెల్లగా నడిచి కాంపౌండ్ గేట్‌దాకా వెళ్ళాడు. మూసిఉన్న గేటుమీద చేతులు ఆనించి నిలబడ్డాడు, రోడ్డువేపు చూస్తూ.

ముగ్గురు బెంగాలీ కుర్రాళ్ళు ఫుట్‌బాల్ తన్నుకుంటూ పరుగెత్తారు, సిమెంట్ రోడ్డుమీద. బీహార్ మిలిటరీ పోలీస్ ట్రక్ మెల్లగా, బరువుగా పోతూంది. లోపల పెద్దడ్రమ్ములు, గన్ బాక్సులు; కాళ్ళుజాపుకుని కొందరూ, టోపీలూ ముఖంమీద కప్పుకుని పడుకున్న వాళ్ళు కొందరూ, పాములా జారిపోతూన్న సిమెంట్ రోడ్డుని కళ్ళు ఆర్పకుండా, పరధ్యాన్నంగా చూస్తూన్నవాళ్ళూ. విక్టోరియా హాస్పిటల్ నర్సులు మెల్లగా క్వార్టర్స్‌వేపు నడుస్తున్నారు. చేతిలో కానుగ పువ్వులు ఎఱ్ఱటి గుత్తిగా పట్టుకుని, పక్కగా, ధూళిలో, చిన్నగా పాడుకుంటూ పోతోంది ఒక పాప, ఎనిమిదేళ్ళది. రెండో నంబరు బస్ రోడ్డు చివర ఆగి, దింపి, ఎక్కించి, మళ్లీ కదిలింది. వెఱ్ఱిగా పూసిన ఎఱ్ఱటి పువ్వులు సాయంకాలం నీరెండలో, అటూ యిటూ రోడ్డుకి.

మోహన్‌రెడ్డి గేటు తోసుకుని పైకివచ్చి హాస్పిటల్‌వైపు నడిచాడు. టి. బి. క్లినిక్‌లో దగ్గులు. ఎక్స్‌రే డిపార్ట్‌మెంట్ మూసి ఉంది. వరండాలో ఒక వార్డ్‌బాయ్ గోళ్ళల్లోని మట్టి అగ్గిపుల్లతో తీసుకుంటున్నాడు. కాంపౌండ్‌లోకి ప్రవేశించాడు మోహన్‌రెడ్డి. తెల్లగా ఏంబ్యులెన్స్‌కార్లు జాలిగా నిలబడి ఉన్నాయి. ఎమర్జెన్సీ రూమ్‌లో డాక్టర్లు ఖంగారుగా తిరుగుతున్నారు.

---

* 'కెరలి పొరలి దూకుతోంది కేసరివలె కీడు
చిటచిటమని రగులుకొంది చిరతల కనువిప్పు.'

'అంగారవల్లరి': కె. వి. రమణారెడ్డి

వర్షం దబదబపడ్డం మొదలుపెట్టింది. నీరెండ ఎక్కడికి పోయింది? ఆకాశపు టంచుల్లో, పొలిమేరల్లో పొంచిఉన్న మేఘాలు సింహాంలాగవచ్చి పడ్డాయి. పచ్చటి చెట్లమీద ఎఱ్ఱగా విరిసిన పువ్వులమీద; న్యూమోనియా ఊపిరితిత్తులలాగ తడిసి, అసహ్యంగాఉన్న గోడలు ఎండుతూ ఆరోగ్య తెల్లదనం కోలుకుంటున్నవేళ. వెదుళ్లతో కట్టిన యిళ్లు తడిసి ఉన్నాయి. తడిసిన కాకులు ముద్దయిపోయిన రెక్కలు ఆరబెట్టుకుంటున్నాయి. కాని, వెనుకనుంచి, ఒఖ్ఖసారిగా మళ్లీ దుమికింది వర్షం.

మోహన్ రెడ్డి వార్డులు దాటుకుంటూ వెళ్లాడు. వరండాలు అన్నీ తడిసి ఉన్నాయి. వార్డులోకి వెళ్ళాడు. గుప్పున ఫినైల్, ఏన్టిసెప్టిక్ లోషన్ల వాసనలు చుట్టుముట్టాయి. టేక్ బహదూర్ బ్లాంకెట్ కప్పుకుని గోడవైపు చూస్తూ పడుకుని ఉన్నాడు. జోళ్ల చప్పుడు విని కళ్లు తిప్పాడు మోహన్ రెడ్డివేపు. నేపాలీ కళ్లు మెరుస్తున్న చిన్నగుండీల్లాగ ఉన్నాయి. కుడిచెయ్యి బ్లాంకెంట్ చీకట్లలోంచి పైకి తీశాడు. పచ్చగా, బలంగా, వెడల్పుగా చెయ్యి. పచ్చబొట్లు. తనపేరు నేపాలీలో. ఒక చక్రం. చక్రం మధ్యలో ఏదో రాసి ఉంది.

చెయ్యి పట్టుకుని, నవ్వుతూ, 'ఛీరప్. టేక్ బహదూర్' అన్నాడు.

'ఇంకా ఎన్నిరోజు లుండాలి సాబ్.'

'ఇక్కడ బాగుంది, టేక్ బహదూర్. అక్కడ ఎలా ఉందో తెలుసుగా యిప్పుడు. ఏ నిమిషమైనా –,

'ఇక్కడేమీ బాగాలేదు. ఆలుచ్చాళ్ళి –'

మోహన్‌రెడ్డి మళ్లీ టేక్‌బహదూర్ చెయ్యి పట్టుకుని, 'ఛీరప్. ఇక్కడ ఎవరో నర్సు నీ వలలో పడుతుంది. మజా' అన్నాడు......చంపడానికి షూట్ చెయ్యి. ఉక్కురంగు తెల్లవారుజామున, లోహంలాగ గట్టిగాఉన్న చలిలో ఖుర్కీతో పొట్టలు చీల్చు... లోహంలాగ తయారుచేసిన దేహాలతో ఒక్కసారిగా పరుగెత్తి, శత్రువుల ట్రెంచిల్లోకి దుమికి పొడు, బేయొనెట్లతో...స్విచ్‌వేస్తే అరుస్తూ వెఱ్ఱిగా ఉరికే ఎంజిన్.. ఎఱ్ఱరాతి బేరక్స్‌లో జాగ్రత్తగా పోషించి, కుమ్మరి మెల్లగా మెత్తటిమట్టితో గట్టిగా ఖంగు ఖంగుమనే కుండల్ని తయారుచేసినట్లుగా...యీ లోహపు దేహాలు అంతకంటె?...

రెడ్డి టేక్‌బహదూర్‌వేపు చూసి, నవ్వి, 'మళ్లీ శనివారం వస్తాను. అంతలో ఎంరిత్తనో...' అని, బహదూర్ గుండీ కళ్లల్లో మత్తుగా మెరుపు రావడం చూసి, మెల్లగా పైకి వచ్చాడు. వార్డు రూమ్‌లో డాక్టర్ గంగూలీ కాగితాలమీద సంతకాలు గీకుతున్నాడు తొందరతొందరగా. రెడ్డిని చూసి, కుర్చీలోంచి సగంలేచి, 'గుడ్ యీవినింగ్ కేప్టెన్ రెడ్డీ. మీరింకా రాలేదేమిటి అనుకుంటున్నాను. మీ టేక్ బహదూర్‌ని చూశారా?' అన్నాడు.

రెడ్డి తల ఊపాడు.

'మీ సోల్జర్లకీ, మా సివిలియన్ పేషెంట్లకీ అదే భేదం. మావాళ్లు కాల్లో ముల్లు గుచ్చుకుని ఏబ్సెస్ అయివస్తే, ప్రాణం పోయినట్లే అరుస్తారు. బహదూర్ వళ్లంతా జల్లెడలాగ అయిపోయింది. నొప్పి అని అనడు. అలా గోడవేపు చూస్తూ బాధ పడతాడు రాత్రంతా. మార్ఫియా వద్దంటాడు' అన్నాడు గంగూలీ.

కిటికీలోంచి చూస్తే, వర్షం ఏనుగుతుండాల్లా పడుతూంది. టిన్ రేకులమీద దబదబ బాదుతూంది. సిమెంట్‌రోడ్డుమీద పటాకీలు పేలుతున్నట్లు. నేలంతా చెమ్మ. గదిలో ఓమూలని స్టెరిలైజర్ చప్పుడు. తెల్లటి టేబుల్ క్లాత్‌మీద తుప్పు మరకలు...ఎవరో ఎప్పుడో తడిసిన యినపపస్తువు పెట్టారు. తుప్పు శాశ్వతంగా అంటుకుంది. నల్లటి కఱ్ఱ రూలర్ ఒకటి అడ్డుగా పడివుంది టేబుల్ మీద. 'ఇక్కడ వీళ్లకి రూలర్ ఎందుకో' అనుకున్నాడు రెడ్డి పరధ్యాన్నంగా.

'ఎన్నాళ్లలో డిశ్చార్జి చెయ్యగలరు' అడిగేడు.

'రెండుమూడు నెలలదాకా అవొచ్చు, యీ లోపల ఏమీ అవకపోతే.'

మోహన్‌రెడ్డి లేచి హాండ్‌షేక్‌చేసి పైకి వేగరంగా వచ్చాడు. చీకటిపడుతూంది. సింహంలా దుమికిన వర్షం ఆగింది, పంజాలునాకుకుంటూ. కాలవల్లో బురదనీరు రక్తంలాగ, వడివడిగా, దూకుడుగా పారుతూంది. ఎలిమట్టిని వర్షం బురదచేసింది. సిమెంట్‌రోడ్డు మాత్రం ధిక్కరించి, శుభ్రంగా, నల్లగా, నిగనిగలాడుతూ, తనకేమీ అవనట్లుగా.........

క్లబ్‌హౌస్ వరండాలో నిలబడి, బరువైన ఎఱ్ఱటి కిటికీ కర్టెన్ మెల్లగా పక్కకి తొలిగించి, లోపలకు చూశాడు రెడ్డి. వధ్వానీ, ఉప్రేతీ, మిస్ కపూర్, నాథన్ బ్రిడ్జి ఆడుతున్నారు. దూరంగా కేశవరావు ఏకాగ్రతతో డార్ట్స్ విసురుతున్నాడు, వొళ్లంతా వంకరగా తిప్పుతూ. దీపాలచుట్టూ బ్లాక్‌కాట్ కాయితాలు చుట్టి ఉన్నాయి. లోపలకి వెళ్ళాడు రెడ్డి.

నాథన్ పేకముక్కల పైనుంచి కళ్లెత్తి చూశాడు. ప్రశ్నార్థకంగా కనుబొమ్మలు ఎత్తాడు. రెడ్డి జవాబుగా కనుబొమ్మలు దించాడు. నాథన్ తనకి ఆ జవాబు నచ్చినట్లుగా మూతి అటూ యిటూ తిప్పాడు. నాథన్‌కి యింకో రెండు రోజులు ఉండాలని ఉంది. కర్నల్‌నుంచి మెసేజ్ రాకపోతే యింకా ఉండొచ్చు. మిస్ కపూర్‌ని జీప్‌లో రుద్రసాగర్ తీసుకువెళ్లి అక్కడ తియ్యటి కబుర్లు చెప్పొచ్చు, తోటలో గడ్డిమీద పడుకొని. ఇక్కడ వెచ్చగా బ్రిడ్జి ఆడొచ్చు. ఎప్పుడూ కటువుగా 'మగ' వాసనలతో గడిపిన తరువాత, మెత్తగా, రంగులతో, ప్రపంచానికి 'యిదిగో నా దేహం...యిదిగో దీన్నిచూడు–యిది ఎలా ఉంది? యింత జాగ్రత్తగా శిక్షణయిచ్చి కట్టుదిట్టాల్లో ఉంచాను చూడు...' అంటున్నట్లు కనిపించే ఆడవాళ్లు తనకి కావాలి. తన బాస్ పిప్పచూపి వెక్కిరిపోయి తన చేతుల్లో వేడిగావచ్చే ఆడవాళ్లు కావాలి. రెడ్డి ఫూల్. బ్లడీ యిన్సెన్సిటివ్ ఫూల్...అందుకే రెడ్డి అంటే తనకి అమితంగా ప్రేమ. రెడ్డిని యిరిటేట్‌చేస్తే రెడ్డి ఒక టన్ను యిటుకల్లాగ తనమీద పడతాడు. అలా పడుతూంటే' తనకి ఖుషీ.

మిస్ కపూర్ 'టూ స్పేడ్స్' అంది. ఉప్రేతీ పెదవి విరిచి 'పాస్' అన్నాడు. నాథన్ ముక్కల్ని మరొకసారిచూసి, తల ఎగరేసి 'త్రీ నోట్రంప్స్' అన్నాడు. కేశవరావు డార్ట్స్ బోర్డు దగ్గరగావెళ్లి పాయింట్స్ లెక్ఖ పెట్టుకుని సంతోషంగా ముఖం పెట్టాడు.

రెడ్డి హాలుదాటి అవతలి గదిలోకి వెళ్లాడు. వెచ్చటి గదిలో బిలియర్డ్స్. విస్కీ గ్లాసులు ఎడమ చేతుల్లో, 'క్యూ'లు కుడిచేతుల్లో పట్టుకున్న క్రిష్ణన్, మండల్. క్రిష్ణన్ వెడల్పుగా, పొట్టిగా: రోజుకి రెండుసార్లు షేవ్ చెయ్యబడ్డ గెడ్డం. దవడ దృఢంగా, ముందుకు. మీసం నల్లగా, హాండిల్ బార్‌లాగ వంగి. తెల్లటి ట్విల్ షర్టుపై గుండీలు రెండూ విప్పిన చోట నల్లగా రింగులు తిరిగినజుత్తు. మండల్‌ది హైరోడ్డు క్రాపు. పెదవులు గట్టిగా, విల్లులాగ. చిన్నగా వంగి, మెరిసే ముక్కు. ఇటు చూస్తే బలమైన పెద్దకళ్లు. చేతుల్లో 'జాగ్రత్త'. పొడుగాటి వేళ్లు బలంగా, సున్నితంగా 'క్యూ'ని పట్టుకుని. ఫోటోగ్రాఫర్ ఎంతో ప్రయత్నించి తనకి అన్నిటికంటె బాగా ఉంది అనిపించే కోణాన్నించి చూసినట్లు చూసి మోహన్‌రెడ్డి మనసులో స్నాప్ షాట్లలాగ తీసి జ్ఞాపకం ఉంచుకుంటాడు. ఇది మండల్... అది వధ్వానీ...అది వర్షంలో తడిసి నీళ్లు రాలుస్తున్న కానుగచెట్టు...'ఎక్కడో జీవితంలో విఫలమయిన మగతనం' యీ ఆటల్లో చూపిస్తారు బాస్టర్డ్స్ అనుకున్నాడు రెడ్డి.

క్లబ్ సెక్రెటరీ గదిలోకి వెళ్ళాడు రెడ్డి. థంగా ఫోన్‌లో మాట్లాడుతూ రెడ్డినిచూసి, ఫోన్‌ని చేతితో మూసి. 'మీకే' అన్నాడు నవ్వుతూ. రెడ్డి ఫోన్‌ని చేతిలోకి తీసుకుని వినడం మొదలుపెట్టాడు. ఫిడేలు తీగమీద రాస్తున్నట్లు మాటలు.

వీకెండ్ ముందుగానే అయిపోయిందన్నమాట. కర్నల్ విచారాన్ని ప్రకటించాడు. ఈ రాత్రే చేరుకోవాలి కేంప్‌కి థంగా మంగోలియన్! ముఖంవేపు చూస్తూ రెడ్డి కర్నల్‌తో అన్నాడు: 'నాథన్ ఏడవ్వొచ్చు కాని నాకు ఫరవాలేదు... ఎంతమంది లేరు...నా సంగతి తెలుసు మీకు. కాదు...అలాంటి

అసమర్థతలేదు. అదీ తెలుసు మీకు'...నవ్వు...'జస్ట్ లేజీనెస్...థేంక్యూ సర్ ... ఇంకో అరఘంటలో బయలుదేరుతాం...ఆల్ రైట్ సర్.' ఫోన్ క్రేడిల్‌లో పెట్టి థంగాతో అన్నాడు: 'మళ్లీ గొడవ మొదలు పెట్టారు యూస్ట్ పాక్ రైఫిల్స్. పోవాలి. రెండు కార్టర్ బ్రౌన్ పుస్తకాలు కావాలిట ట్రైగ్‌కి.'

లైబ్రరీ గదికి వెళ్లారు యిద్దరూ. బీరువా తెరిచి రెండు పుస్తకాలు తీశాడు. అట్టలమీద 'వేడిగా' బొమ్మలు ఉన్నాయి. 'సరిపోతాయి' అనుకున్నాడు రెడ్డి.

హాలులోకి వచ్చాడు. నాథన్ డమ్మీ ముక్కలు పరిచి మిస్ కపూర్ ముఖాన్ని 'తాగుతున్నాడు'. మిస్ కపూర్ ఎర్రటి కింది పెదిమల్ని పళ్లతో నొక్కుతూ జాగ్రత్తగా చూస్తూంది పేకముక్కల్ని. నాథన్ రెడ్డి ముఖంచూసే తెలుసుకున్నాడు గడువు అయిపోయిందని. 'వెల్ వెల్. యూ వారానికి యింతే. బాక్ టు ది ట్రెంచెస్. రెడ్డీ, యీ రబ్బర్‌తో ఆఖరు.'

రెడ్డి బేరర్‌ని పిలిచి సూట్‌కేసులు మేడమీంచి తీసుకురమ్మన్నాడు. కేశవరావు చదరంగపు పావుల్ని సర్ది స్టేట్స్‌మన్‌లో యిచ్చిన ప్రాబ్లమ్‌ని సాల్వ్ చేస్తున్నాడు. దగ్గరగా వెళ్లి చూడ్డం మొదలు పెట్టాడు రెడ్డి. నల్లరాజా మధ్యని బందీ అయి వున్నాడు. చుట్టూ 'పిన్స్'. నల్లగుర్రం ఏకాకిగా నల్లగడిలో. నల్లబంటు యిక్కడ. ఖాళీ. తెల్ల గుర్రం గర్వంగా నల్లరాజుని ఆటకాయిస్తూ యిక్కడ. దూరంనుంచి వికటంగా నవ్వుతూ తెల్లశకటు అక్కడ్నుంచి అడ్డుతూంది......

'మొదట, ఆ తెల్లబంటుని...' అన్నాడు మెల్లగా రెడ్డి, వేలుతో చూపిస్తూ.

'ఉష్' అన్నాడు కేశవరావు విసుగ్గా, రెడ్డి వేలుని పక్కకి నెట్టుతూ.

బేరర్ సూట్ కేసులు తెచ్చి వరండాలో పెట్టాడు. బ్రిడ్జ్ గ్రూప్ లేచింది.

'మళ్లీ ఎప్పుడు?...'

'కీప్ ది ఫ్లాగ్ ఫ్లయింగ్...'

'బై బై'

నాథన్ ఎవరూ చూడకుండా మిస్ కపూర్ వైపు చూసి ఎడంకన్ను సగంమూసి తెరిచాడు.

కార్డురాయ్ పంట్లాల వెలుగునీడల మెరుపులు...జోళ్ల కంకరమీద...జుత్తుమీద దీపంకాంతి నునుపులు. జీప్ గరాజ్‌లోంచి పైకితీసి క్లబ్ హౌస్ వరండా దగ్గరగా తీసుకొచ్చాడు. బేరర్ సూట్‌కేసులు వెనకని పెట్టాడు. నాథన్ కూడా ఎక్కి, కూర్చుని చెయ్యి ఊపాడు అందరికీ. పులిలాగ దుమికింది జీప్, క్లబ్ వదిలేటప్పటికి.

వీధి దీపాలు లేవు. భయంభయంగా వణుకుతున్న నక్షత్రాలూ కిటికీ సందుల్లోంచి దీపంకాంతులు బ్లాకౌట్‌ని ధిక్కరించి వస్తున్నాయి. ఊరి పొలిమేరలు దాటారు. దాటగానే రోడ్డు కొండంమీదికి పరుగెట్టింది. తల దులుపుకుంటున్నట్లు చెట్లు. జీప్ హెడ్‌లైట్లు చీకటిలో సొరంగం చేస్తూంటే అందులోంచి అతివేగంగా దూసుకుంటూపోతూంది. గేర్లు మార్చడం, స్టీరింగ్ గట్టిగా పట్టుకుని పూర్తిగా తిప్పడం, హేర్‌పిన్ కర్వ్స్......

నాథన్ సిగరెట్‌మీద సిగరెట్ కాలుస్తున్నాడు. లోపల వెచ్చగా పెట్రోలు వాసన. పైన రాజ్జగాలి, కొండగాలి. భాగ్వరా కొండమీద చదును. ఏదో క్లిష్టమైన ప్రశ్నకి జవాబులాగ టీ దుకాణం. హరికేన్ దీపం వెలుగుతూంది. నల్లకాయితం ఒకటి చుట్టిఉంది సగందాకా. గాలికి కదులుతోంది.

జీప్ ఆపి, యిద్దరూ బురదలో వేసిన యిటుకల మీద అడుగులు జాగ్రత్తగావేస్తూ లోపలకు వెళ్లారు. సీసాల్లో అక్కడే బేకరీలో తయారుచేసిన బిస్కెట్లు, కేకులు. చార్‌పాయ్‌మీద మెత్తటిచాప, దానిమీద మేనేజరు. దుప్పటి కప్పుకుని కూర్చుని. హుక్కా తాగుతున్నాడు గుప్‌గుప్ మని. పదేళ్ల చిన్నారి ఒకమూల మసిబారిన టీ కెటిల్‌లో నీళ్లు నింపుతూంది. అంచులు విరిగిన కప్పులు వరసగా బోర్లించి ఉన్నాయి టేబుల్‌మీద. గోడని ఆనుకుని

ఒక బెంచీ, మధ్యని ఒక టేబుల్. చుట్టూ నాలుగు కుర్చీలు. దుప్పటి ముసుగులోంచి కళ్లు మెరుస్తున్నాయి. ముఖంమీద గట్టిగా లాగి పరిచిన చర్మం ఎముకల్ని పైకి తోస్తూంది. దీపం వెలుగుపడి మెరుస్తూంది ఎముకలమీది చర్మం. పరాగ్గా అక్కడా అక్కడా లేచిన తెల్లటి గెడ్డం.

చిన్నారి పదేళ్లది. ఎఱ్ఱటి నేతచీర మోకాళ్లదాకా ఎత్తికట్టి పిసింద్రీలాగ తిరుగుతూంది, అదీ యిదీ సర్దుతూ. కాటుకరంగు జుత్తు, యిష్టం వచ్చినట్లు బాబ్ చేసుకుంది. పొడుగాటి లేత వేళ్లు నల్లటి సీతాకోకచిలుకల్లాగ ఎగురుతున్నాయి, వస్తువుల్ని సర్దుతూంటే. సిగ్గుగా నవ్వింది చిన్నారి దేహం అంతా.

రాక్షసిబొగ్గు చిటచిటమని రగులుకొంది. చిరుత పులుల కన్నుల్లో నిప్పులాగ మెరిసింది రాక్షసిబొగ్గు. చకచకమని నీళ్లు మరిగాయి! ఆవిరి.

అంచులు విరిగిన కప్పుల్లో టీ పోసి టేబుల్ మీద పెట్టింది చిన్నారి. చిన్నారి ముఖంమీద దెబ్బలు బాగా మానిపోయాయి. గెడ్డంమీద మచ్చ మాత్రం అరంగుళం పొడుగ్గా, ఎ గా మానుతూంది.

'బిస్కెట్లు కావాలా?' అంది చిన్నారి కళ్లల్లో చేపల్ని మెదిలిస్తూ, దగ్గరగావచ్చి. గుడ్డిదీపం వెలుతురు మచ్చమీద పడింది. ఎఱ్ఱగా జెఱ్ఱిలాగ మెరిసింది.........

.........అటువేపు చెట్ల గుంపులోంచి మెషీన్ గన్ మతిపోయినట్లు టక టక. గుళ్లు కసిగా యిటువేపు చెట్లల్లోకి దూసుకునివచ్చి పేలుతున్నాయి. రెడ్డిముందుగానే కఠినంగా ఆర్డర్ యిచ్చాడు గూర్ఖాల ఉద్రేకాన్ని పైకి రానివ్వడానికి వీలులేకుండా. కుడిపక్క ట్రెంచ్‌లో రైఫిల్ కాక్‌చేసిన శబ్దం వినిపించింది. ఆ ట్రెంచి ముందు పాతిన చెట్ల కొమ్మల్లోంచి పొడుచుకుని రైఫిలొకటి ముందుకు వెళ్లింది. తొందరపడితే మోసం, తెలివి తక్కువగా చావడం. తలకొంచం పైకి ఎత్తి గూర్ఖాలీలో చాకుల్లాంటి బూతులు రెండు విసిరాడు. హవిల్దార్ గురుంగ్ నవ్వు వినిపించింది. రైఫిల్ వెనక్కి లాబడింది. రెడ్డి బైనాక్యులర్స్‌తో జాగ్రత్తగా పరిశీలించేడు అవతలి గట్టుమీద దాగిఉన్న మెషీన్‌గన్ పోస్టుని. మెల్లగా హుకుం జారీ చేశాడు. ఆ హుకుం పైనుంచి కిందకి తన మెషీన్‌గన్ పోస్ట్‌దాకా వెళ్లింది.

చిన్నారి తలమీద బుట్ట పెట్టుకుని మధ్యగా కుందేలులాగ పరుగెత్తుతూ రావడం ఎవరూ చూడలేదు. ఎఱ్ఱటి నేతచీర, తలమీద బుట్ట...చిన్నారి గుట్ట దాటుతూ గుళ్లవర్షంలో యిరుక్కుంది.

గందరగోళం...ట్రెంచిలో ఉద్రేకం ... రెడ్డి బైనాక్యులర్స్ని కిందపడేసి, ట్రెంచి గోడమీదికి ఎగబాకేడు. వెనక్కితిరిగి, ఫైర్ ఆపుచెయ్యమని ఆజ్ఞ యిచ్చాడు. కుడిపక్క ట్రెంచిలోంచి కూడా ఒక ఆకుపచ్చ యూనిఫార్మ్ పైకి ఎగబాకిరావడం చూశాడు. ఆలోచనకి సమయంలేదు. నిబంధనలకి సమయంకాదు, ఎ టినేలమీద, రాళ్లమీద పడిఉంది వందగజాల దూరంలో చిన్నారి. పొదల పక్కనుంచి పాకుతూ పోయారు. పక్కగా, దూరంగా, వేగంగా పాములాగ పాకుకుంటూ పోయే యూనిఫార్మ్‌లో టేక్‌బహదూర్ అని రెడ్డి గమనించాడు.

బోర్లాపడిఉంది చిన్నారి. కుడిచెయ్యి పైకి ఎత్తి ఊపుతూంది. ఆయాసంతో రెడ్డి చిన్నపొదపక్క ఆగాడు. తలమెల్లగా ఎత్తిచూస్తే, టేక్‌బహదూర్ చిన్నారి దగ్గరగా చేరడం కనిపించింది. టేక్‌బహదూర్ దేహాన్ని ఒక అడుగు పైకిఎత్తి చిన్నారిని చేతులతో పట్టుకుని లాగబోయాడు......

కూలేడు. గుళ్లు టేక్‌బహదూర్ దేహంలో పదకొండు ద్వారాల్ని తెరిచాయి. ఎఱ్ఱటి నేలమీద రక్తం గడ్డకట్టింది నల్లగా. ఎదురుగా పాకిస్తాన్ నీలి ఆకాశంలో మబ్బులు దూదిలాగ ఎగురుతున్నాయి. ఆకుపచ్చ యూనిఫార్మ్‌లో టేక్‌బహదూర్ ఎఱ్ఱటి నేలమీద. రెపరెపలాడింది ఎఱ్ఱటి నేతచీర. రెడ్డి నుదుటిమీది చమటబొట్లు కళ్లల్లోపడి మండడం మొదలుపెట్టాయి. లేవకుండానే వెనక్కి తిరిగి చూశాడు. ఇంతవరకూ ఎవరికీ తెలియకుండా కామూఫ్లాజ్‌చేసి ఉంచిన తన మెషీన్‌గన్ ఒక్కసారిగా దూకింది.

ఆకాశంలో మబ్బులు. ఎఱ్ఱటి నేలమీద చిన్నారి కానుగపువ్వు లాగ లేచింది. పక్కని కోడిగుడ్లు ముక్కలుగా, ముద్దగా, పచ్చగా, ఎఱ్ఱగా, తెల్లగా. బుట్ట తిరగబడి ఉంది. రెండు మంటల నడుమ చిక్కుకున్న బెదురుకళ్ల లేడిలాగ చూస్తోంది చిన్నారి. సన్నగా ఏడుపు మొదలు పెట్టింది పాకుతూ గురుంగ్, రింగామార్ వచ్చారు. తన మెషీన్ గన్ అటువేపు పోస్ట్‌ని ధ్వంసం చేసింది. ఇద్దరూ జాగ్రత్తగా టేక్‌బహదూర్‌ని మోసుకుపోయారు. చిన్నారి బుట్టవేపుచూస్తూ పెద్దగా ఏడుపు సాగించింది. చిన్నారి చెయ్యిపట్టుకుని పొదలపక్కనుంచి జాగ్రత్తగా తిరిగి ట్రెంచిలోకి వచ్చాడు రెడ్డి......

........హుక్కా పక్కకిపెట్టి కొమిల్లా బెంగాలీలో ఏమిటో గొణిగాడు మేనేజరు. రోజంతా కిళ్లీలు నమిలే పళ్లు. రెండుదేశాల బోర్డర్ దగ్గర అటూ యిటూ రవాణాలు - కోడిగుడ్లు, సిగరెట్ లైటర్లు, వీలయినప్పుడు బంగారం, పైలట్ పెన్నులు. ఇంతకుముందు సులభంగా, అదాయంలేని బాటలమీద రహస్యంగా రవాణాలు. ఇప్పుడు విచ్చుకత్తుల్లాగ, పొంచిఉన్న సింహాల్లాగ నిలబడ్డ సైన్యాలమధ్యనించి చిన్నారి కోడిగుడ్ల బుట్టలు అపాయం లేకుండా రాలేకపోతున్నాయి.

నాథన్ లేచాడు. చిన్నారి కళ్లు ఏమిటో చెప్పబోయాయి. రెడ్డి డబ్బు లిచ్చేశాడు. బురదలో బాగా అణిగిపోయిన యిటుకలమీంచి దాటుకుని రోడ్డుమీదికి వచ్చారు. చిన్నారి గుమ్మం దగ్గర నిలబడింది. హరికేన్ లాంతరు జాలిగా వెలుగుతూంది.

ఆకలిగొన్న పులిలాగ గురకతీసి ఉరికింది జీప్ ముందుకు. పడమటనుంచి మేఘాలు మళ్లీ నల్లగా, బరువుగా కమ్ముకుంటున్నాయి. జీప్ మలుపు తిరగబోతూంటే వెనక్కితిరిగి చూశాడు రెడ్డి. చిన్నారి అలాగే నిలబడిఉంది.

తన ఆల్బమ్‌లో యిదొక స్నాప్‌షాట్ అనుకున్నాడు రెడ్డి. ఓబెరాయ్స్ రూమ్‌లో చేతుల్లో విస్కీగ్లాసులు పట్టుకుని దృఢంగా, దబ్బుగా, కారు టైర్లు స్మగ్లింగ్‌చేసే క్రిష్చన్, మండల్. గోడవైపు చూస్తూ, మార్ఫియా లేకుండా బ్యాండేజిల్ల కింద టేక్‌బహదూర్. ప్రవాసజీవితపు నడిసముద్రంలో చదరంగం, టెన్నిస్ లైఫ్‌బోట్లమీద కేశవరావు...

మేఘాలు తయారుగా ఉన్నాయి. [illegible] పేర్చి ఉన్నాయి. మందుగుండు పొడిగా ఉంది. తెల్లటి దీపాల్ని నల్లటి కాయితాలు నిర్భయంగా కప్పుకున్నాయి. ఇనుము కరగబోతూంది. సీసం వర్షిస్తుంది. చిన్నారి అలాగే నిలబడిఉంటుంది. నిలిచి చూస్తున్న చిన్నారి కనుపాపలు ఆశీర్వదిస్తాయి.



# 'తాలాంకనందనీ పరిణయము': ఒక పరిశీలన

శ్రీ రంగాచార్య

తాలాంకనందనీ పరిణయముపై నవంబరు (1967) 'భారతి'యందు ప్రచురింపబడిన వ్యాసమును చూచితిని. అందు పేర్కొనబడని ముఖ్యమైనవిషయములఁ కొన్నింటిని పాఠకులకు తెలుపవలయునను నుద్దేశ్యమున నావద్దగల 'తాలాంకనందనీ పరిణయము' (ప్రతులు) తదిత రాధారములచే ఈ వ్యాసమును వ్రాయుచున్నాను— విజ్ఞులు పరిశీలింతురుగాక !

ఆంధ్రభాషాయోష కమూల్యాలంకారము లొన గూర్చిన కవివర్యులు మరింగంటివారు. 'ఆంధ్రకవుల చరిత్ర' కారునిమండి 'సమగ్ర ఆంధ్రసాహిత్య' కర్త వరకు ఈ కవులగూర్చి తెలుపుచున్నారు. ఐనను అందలి విషయములు చాలవర కసమగ్రములుగనే గలవు. అందుకు ముఖ్యములగు కారణములు. 1. ఈ కవుల గ్రంథము లందుబాటులో లేకపోవుట. అలభ్యముగ నుండుట. 2. వీరినిగూర్చి వ్రాయువారు, తద్రచన లను కూలంకషముగ పఠింపక 'ఇట్లు వ్రాసిరి' 'అందిట్లు గలదు' అని తెల్పుట.

అద్యతనాంధ్ర సాహితీ ప్రపంచమున మరింగంటి కవులనుగూర్చి కొంతవరకు పరిశ్రమించిన వారలలో సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు కీ. శే. శేషాద్రి రమణ కవులు, పండిత శ్రీ ఆదిరాజు వీర భద్రరావుగారు, డా. శ్రీ బిరుదురాజు రామరాజుగారును ఇదంప్రథములుగా పరిగణనీయులు. నేటివరకు సిద్ధమై ప్రచురణమైన 'సమగ్ర ఆంధ్రసాహిత్యము'న మరింగంటి కవులగూర్చి అసమగ్రముగ గలదు. అందు ఆయా కాలమున చేరని- కవులు—ప్రబంధములు ఇంకను గలవు.

తాలాంకనందనీ పరిణయమను ఈ షష్ఠ్యాశ్వాస ప్రబంధ నిర్మాత] మరింగంటి వేంకట నరసింహా చార్యులు. ఈతడు మౌద్గల్యగోత్రుడు. భావనా చార్యుల పుత్రుడు. నల్లగొండ జిల్లా దేవరకొండసీమ యందలి 'కనగల్లు' గ్రామవాసి. 1842 క్రీ. శ. ప్రాంతమున నుండినవాడు. 'శతఘంటావధాన' బిరు దాంచితుడైన మరింగంటి సింగరాచార్యుల కీర్తడారవ పురుషుడు. 'తాలాంకనందనీ పరిణయము' 'ఇందిరాల భాగవతము' అనున వీతని రచనలు. ఈ కవిని గూర్చియు - తాలాంకనందనీ పరిణయమునుగూర్చియు విపులమైన వ్యాసమును శ్రీ ఆదిరాజు వీరభద్రరావు గారు వ్రాసినారు[1]. 'లక్ష్మణరాయ పరిశోధకమండలి' (హైదరాబాదు)యందుగల తాళపత్రప్రతి వీరి కాధా రము. అందు వారును కొన్నివిషయములలో పొరపాటు పడిరి.

## 'తాలాంకనందనీ పరిణయము—ప్రతులు'

1. 'లక్ష్మణరాయ పరిశోధకమండలి (హైదరాబాదు) తాళపత్రప్రతి సమగ్రము.

2. డా. శ్రీ గోపాలకృష్ణరావుగారు M. A. Ph. D. రీడర్—తెనుగుశాఖ — ఉస్మానియా విశ్వ విద్యాలయము - తాళపత్రప్రతి - సమగ్రము.[2]

---

1. తెలంగాణ పత్రిక' సం—4, సంచిక 44
వ్యయ జ్యేష్ఠ బ. 10.
(25–6–1946 ఆదివారము.)
,, సం. 4, సంచిక 50
(2–7–1946 ఆదివారము.)

2. వీరివద్ద ఈ ప్రతి సమగ్రముగ నున్నట్లు నాకు తెల్పినవారు—పూజ్యులు డా. రామరాజుగారికి కృతజ్ఞుడను.

3. మా తండ్రిగారు — శ్రీ రాఘవాచార్యుల వారివద్ద.

1. వ్రాతప్రతి
2. తాళపత్రప్రతి } ఈ రెండును అసమగ్రములు.

3. పై రెండుప్రతుల ననుసరించి వ్రాసినవారు మా నాయనగారొక ప్రతి- అది కొంత యసమగ్రము.[3]

పై ప్రతులననుసరించి మేము వ్రాసుకొనిన గ్రంథము నాధారముగ నేనీ వివరముల వ్రాయుచున్నాను. ప్రథమమున (మా) ప్రతినిగూర్చి తెల్పుదును[4] —

ప్రథమాశ్వాసము: — అదినుండి కొంతభాగ మసమగ్రము. అనగా 'ఉద్దేశించి రంగసాంగ...' అను వచనారంభమువరకు, అచటినుండి ఆశ్వాసమంతయు సమగ్రము.

ద్వితీయాశ్వాసము: — సమగ్రముగ గలదు. ఆశ్వాసాంతమున 'నాగబంధము' గలదు.

తృతీయాశ్వాసము: — ప్రారంభమునుండి 120 సంఖ్య గల పద్యమువరకు సమగ్రము (120 పద్యమున ఒక చరణము లేదు). మిగతా భాగము సంపూర్ణముగ — సమగ్రముగ గలదు. ఆశ్వాసాంతమున 'సోష్ఠ్య నిరోష్ఠ్యకందము' గలదు.

చతుర్థాశ్వాసము: — మధ్య మధ్య కొన్నిపద్యము లసమగ్రములు. ఆశ్వాసాంతమున 'సోష్ఠ్య త్ర్యక్షర కందము' గలదు.

పంచమాశ్వాసము: — ఆరంభమునుండి 'అనియుల్లసొక్కులాడగ' — ఇత్యాది పద్యము (26) వరకు సమగ్రము. మరల 115 పద్యమునుండి 122 పద్యమువరకు మధ్య మధ్య కొన్ని పద్యపాదములు భ్రష్టములు. అంతమున 'సుమగుళుచ్ఛబంధము' గలదు.

షష్ఠాశ్వాసము: — 111 సంఖ్య పద్యమువరకు మంచిగా గలదు. 112 సంఖ్య పెద్దవచనము. చాలా భాగము జీర్ణము. 222 నుండి 228 పద్యమువరకు కొన్ని పద్యభాగములు లేవు. ఇందు (136 సంఖ్య గలది) సుమారు 60 చరణముల సీసమాలిక యున్నది.

పై వివరముల ప్రకారముగ ప్రస్తుత ప్రబంధమునందలి గద్యపద్య సంఖ్య ఈ విధముగ గలదు.

| | |
|---|---|
| ప్రథమాశ్వాసము | 253 |
| ద్వితీయా ,, | 296 |
| తృతీయా ,, | 198 |
| చతుర్థా ,, | 351 |
| పంచమా ,, | 406 |
| షష్ఠాశ్వాసము | 232 |
| మొత్తము | 1736 |

ప్రబంధ మింకను కొంతభాగ మసమగ్రముగనా! పూర్తిగ లభించిన రెండువేల పద్యములకు హెచ్చుగా నుండునేమో! యని నా యూహ:

## ఈ కవివంశము — రచనాకాలము

కవి తన వంశీకులగూర్చి ఇట్లు తెల్పినాడు.

'మంత్రమంత్రార్థ స్వతంత్రమంజుల బోధ
చేత చేతనుల రక్షించినారు
దీనావనకృపాన దీనాభిధాన చిం
తామణి ఖ్యాతిచే దనరినారు
కుంభినీ పరవాది కుంభినీంద్ర విభేద
కంఠీరవ ప్రభ గాంచినారు
నయవిలక్షణ సత్వ వినయ గరిమల మహి
మహిమగాంచి రభిం దిజ మహితకీర్తి (?)

---

3. వ్రాత—తాళపత్రప్రతులను ఏతత్కవి వంశీకులు కీ॥ శే॥ శ్రీ ఆ. మరింగంటి శ్రీ రంగాచార్యుల వారు మా కొసంగినారు.

4. నేటివర కెవ్వరును తాలాంకనందనీ పరిణయము ప్రతుల వివరముగాని గద్య పద్య సంఖ్య గాని తెలుపకపోవుటయు—పాఠకులకు పరిశోధకులకుమిక్కిలిగా ఉపకరించునను ఉద్దేశ్యముతో నేనీ వివరముల నొసంగుచున్నాను.

సర్వ చార్వాక ముఖ మత దుర్వహోగ్ర
..........................
..........................
గర్వహరులు మరింగంటి పూర్వగురులు
(1—24)

గ్రంథస్థాధారమునుబట్టి కవి వంశము:—

భావనాచార్యుడు—(కవిప్రపితామహుడు)
|
నరసింహదేశికుడు
|
వేంకటకృష్ణదేశికుడు
|
భావనాచార్యుడు
|
వేంకటరాఘవాచార్యుడు (కేశవస్వామి శతకకర్త) — వేంకటనరసింహాచార్యుడు (తాళాంకనందనీ పరిణయ కర్త)

(వంశవర్ణన హెచ్చుగా చేసినాడు. అనూరి మరింగంటియని వీరి కా పేరెట్లు వచ్చినది, వీరివంశమునం దాద్యులు, వారి ప్రభావమును గలదు. సాహితీ లోకమున కావిషయము సుపరిచితముగుటచే తుదిభాగపు వంశవృక్షముమాత్ర ముదాహరించినాను).

'తాళాంకనందనీ పరిణయ' కర్తయగు వేంకట నరసింహాచార్యులు తన యగ్రజుడగు వేంకటరాఘవార్యునిగూర్చి హెచ్చుగా ప్రశంసించినాడు. అందలి రెండు పద్యములు—

శ్రీ మద్వేంకట రాఘవ
ధీమణియె మదగ్రజుడు తదీయ ఘనకృపా
స్తోమముచే నేమముచే
క్షేమముచే మనితి నారసింహార్యుడనన్ (1—39)

గురు తమోహారి సంతతకువలయాప్తు
డురుకళానిధి సత్సంగతోత్సవుండు
విష్ణుపదసక్తకరుడు కవిప్రియుండు
వసుధ మాయన్న మా యన్నవంటివాడు (1—40)

ఈ రాఘవార్యుడు మహాప్రతిభావంతుడని, కవి ప్రియుడని, పై పద్యమువలన నూహింప వీలగుచున్నది. తద్రచనలగూర్చి తెలుపబడలేదు. ఈతని రచన 'కేశవస్వామి శతకము'[5] మాత్ర ముపలభ్యమైనది. ఇది యంత్యప్రాసలతోగూడిన సీసపద్య శతకము. (దీని రచనా కాలము శా. శ. 1778. క్రీ శ. 1856). కవి తన శతకమున

'శాలివాహన గత శకవర్షములు వసు
ఋషి గిరి శశి సంఖ్య రూఢి నడవ
ప్రభవాది షష్టి సంవత్సరాంత స్థి[illegible]
తానందనామాబ్ద మవని గడవ
తలపగా దగు దారి నెలత పేర్నెల నిండు
పున్నమ రోజున ప్రొద్దు బొడవ
కేశవపుర చెన్నకేశవశతకంబు
విండె నామది నాతడుండి నొడవ
తద్గుణ స్తుతి మధురామృతంబు కడవ
గా భజించిన నరు లఘౌఘముల గెడవ
కలిగి కల్యాణ కరణ భోగములు గుడువ
కేశవస్వామి భాస్వత్ఖగేశగామి (108 పద్యము)

పై పద్యమునందు 3 వ చరణము పొరపాటుగా నున్నది. దానిని 'తలపగా దగు దారితలను పేర్నెల' అని సవరించిన సరియైన యర్థము వచ్చును. దారి=మార్గము, తల=శీర్షము[6] అనగా 'మార్గశీర్షము' అను మాసమగును. కవి చెప్పికొనిన ఆనంద నామ సంవత్సర మార్గశిర శుద్ధపౌర్ణమియగును.

| | |
|---|---|
| శతక రచనా కాలము | శా. శ. 1778 |
| | క్రీ. శ. 1856 |
| తాళాంకనందనీ పరిణయము | శా. శ. 1764 |
| | క్రీ. శ. 1842 |

5. వివరములకు నా వ్యాసము 'మరింగంటి వేంకటరాఘవాచార్యులు—కేశవస్వామి శతకము'. 'భారతి' 1966 డిసెంబరు.

6. మాసములయందు శ్రేష్ఠమగు మాసము మార్గశీర్షమనుటకు 'మాసానాం మార్గశీర్షోహం ఋతూనాం కుసుమాకరః—' అను గీతా శ్లోక వాక్యములే ప్రమాణము.

నేటివరకు తాలాంకనందనీ పరిణయమును గూర్చి వ్రాసినవారు కేశవస్వామి శతకకర్తకును — తాలాంకనందనీపరిణయ కర్తకును సంబంధముగలదని గాని - సహోదరులనిగాని తెలుపకపోవుటచే శతకాధారములు స్థితమిందు పేర్కొనవైనవి.[7]

గత మాసము (నవంబరు' 67, భారతియందు) (64 పుటలో) 'ఇది సుమారు 1872 క్రీ. శ. ప్రాంతమున ముగింపబడినదని 'గోలకొండ కవుల సంచిక'ద్వారా పేర్కొనవచ్చును' అని గలదు. ఈ పై వాక్యము పూర్తిగా పొరపాటు — కావున 'గోలకొండ కవుల సంచిక' యందును తాలాంకనందనీపరిణయము నందును గల గ్రంథరచనాకాలాధారముల నొసంగుచున్నాను.

'గోలకొండ కవుల సంచిక'. 'పూర్వకవి పరిచయము'. 411 పుట.

'క్ర - సం —140. వేంకట నరసింహాచార్యులు, మరింగంటి.'

ని— కనగల్లు— నల్లగొండ, జి.

కా—శా. శ ౧౭౬౪ (1764) క్రీ. శ. ౧౮౪౨ (1842).

ర—'తాలాంకనందనీపరిణయము.'

ఇందిరాల భాగవతము (యక్షగానము.)

ఈ రెండు గ్రంథములు హైదరాబాదు లక్ష్మణరాయ పరిశోధక మండలి యందు గలవు.

ఇక 'తాలాంకనందనీపరిణయము'న షష్ఠాశ్వాసము చివర—

'కలియుగ శాలివాహన శ
కంబులు వేదరసాచలేందు సం
ఖ్యలుజను నందు నాంగిరస
హాయనభాద్రపదాసితాష్టమిన్
కలితమ్ముదూక్తి నీ సరస
కావ్యము పూర ముగా రచించె వ
త్సలఘుడు శేష శైల శిఖ
రాగ్ర విహారి లసత్కృపారతిన్.'

దీని ప్రకారముగ 1764 శాలివాహన శకము అనగా క్రీస్తుశకము 1842 అగును - అంగీరస సంవత్సర భాద్రపద బహుళ అష్టమీ తిథి (1842 సం) ప్రబంధ రచన సమాప్తమైనది.

ఇంత స్పష్టముగ రచనాకాలము తెలిసికొను నాధారము లున్నను — పై వి ఆ విధముగ వ్రాయుట సరిగాదు, దీనివలన మరింగంటి వెంకట నరసింహాచార్యులు తాలాంకనందనీపరిణయమును క్రైస్తవ శకము 1842 సం. ముగించెనని నిస్సంశయముగ చెప్పవచ్చును. ఈ సమయమువరకు కవి సుమారు 50 ఏండ్లప్రాయమునకు హెచ్చుగా నుండియుండును.

## ప్ర బం ధ వి ష య ము

కథా విషయ మింతకుపూర్వము తెలిసినదే గావున మరల వ్రాయుట యనవసరమేమో! కవి యీ ప్రబంధమును 'సకలాలంకరణ పదప్రకరణ గూఢశ్లేష శ్లేష శ్లాఘనీయ పురాణ రచనా ప్రవీణ చమత్కృయాధురంధర కవిపురందర నాట్యరంద స్యంద దమంద ప్రధాన మాధుర్య ధుర్యంబుగ'ను, 'దుష్కరపదపుష్కలశుష్క కవితాపరిష్కారులగు దుష్కవుల నిరసించి కలుషలతావితానలవిత్రంబుగా పవిత్రజనస్తోత్రపాత్రంబుగా నొక్క చిత్రకథా చరిత్రంబు రమాకళత్రాంకితంబుగా' రచియించెను. దీనిని 'సంతత కల్యాణ పరంప రాక్రాంత దిగంతంబగు నటుల'ను, 'శృంగార రస ప్రధాన ప్రబంధముగను' వ్రాసినాడు.

ప్రబంధమున వర్ణనలు హెచ్చుగా గలవు. అటవట కొన్ని వ్యాకరణ దోషములు ఛందోభంగములు గలవు. కవి తన ప్రబంధమునుగూర్చి—

'ఉరుతర కందవేణి లస
దుత్పలలోచన చంపకాంగి భా
సురతనుమధ్య రమ్యవళి
సుందరవృత్తనితంబ గీతవి
స్వర బహుమత్తకోకిల ర
వస్వరభావ్యరయైన కావ్యమున్
దరి—' అని బహుచమత్కృతిగా చెప్పుటయే గాక ఇందలి! కథావృత్తాంతమును తత్తదుచితరస పోషణమునుక్లేశట్లు వివరించినాడు—

7. శతకమున 107 వ పద్యమున కవి తన వంశీకులగూర్చి తెలి నాడు. దానివలన నీ యుభయుల సంబంధము నిస్సంశ ము.

'చెలి నెత్తుకొనిపోయి చెలరూపుదానయ్యె
నన్ను విస్మయరసం బావహించె
ఆ లక్షణుండు దిగంబరుండై పొతే
ననివ హాస్యరసంబు ననుకరించె
రౌద్రజంతువులు కౌరవులం బ్రేల్చెనటన్న
సరణి బీభత్సరసంబు వొడమె
తమను కర్ణుండు నిందలు వచించెనటన్న
బెలుచ వీరరసంబు పిక్కటిల్లె
తుదకు రాముడు కన్య నెత్తుననె పల్కె
నన్న శాంతరసంబుపై చెన్ను మిగిలె
పెండ్లికి సుభద్ర నిముజూడ ప్రేమ గోరె
ననిన శృంగారరస మంతకంత జెలగె.'

(5—54)

ఇట్టి వింత రచనలు ఇంకను కొన్ని యిందు గలవు- వ్యాసవిస్తరభీతిని వదలుచున్నాను.

కవిని గూర్చియు—తత్కృతిని గూర్చియు తెలిసి కొనుటకు ముఖ్యాధారములు కృత్యాద్యంతములు హెచ్చుగ తోడ్పడును. కృత్యాదిని గూర్చి తెలిపియుంటిని.

## ఆ శ్వా సా ం త ము లు

అముక్తమాల్యద యందలి ఆశ్వాసాంత పద్యములవలెనే ఇందును గలవు[8]. ప్రథమ—షష్ఠాశ్వాస పద్యములను—ఒక గద్యనుమాత్రము ముదాహరించుదును.

'ఇది శేషాద్రి గుహా విహార కమలా
హృత్పోల్లసద్భావనా
ర్యదయావత్సుత రాఘవార్య గురుచం
ద్రప్రాజ్ఞ సోదర్యమౌ
హాద మౌద్గల్యకులీన వేంకట నృసిం
హాచార్య సంప్రోక్త ధీ
పద తాలాంకనునందనీ పరిణయా
శ్వాసంబు ప్రాధాన్యమున్
ఇది ధారాళ మరంద మాధురీ వచో౽
హీన ప్రథా రాఘవా
ర్యదినేశానుజ భావనార్య తనుజ
ప్రోథాంక మౌద్గల్య భూ
విదితోద్వేల్లిత కీర్తి.........సరమా
ద్వ్యా నారసింహార్యహ
పద తాలాంకనునందనీ పరిణయా
శ్వాసంబు షష్ఠంబగున్.

## 'గ ద్య'

'ఇది శ్రీ మచ్ఛేషధరాధర సౌధవీథీ విహరణ వేంకట రమణ చకు ర్విలక్షణాక్షీణ కృపా కటాక్ష వీక్షణా పరిలబ్ధ లక్ష్మీ లక్షణానవద్య విద్యా విలాస శ్రీనివాస గురుచరణ స్మరణాభ్యసన రసనా వికాస నిస్తుల్య కల్యాణ సాకల్య మౌద్గల్య గోత్రపవిత్ర భావనాచార్యపుత్ర పర్యాశ్రయ కైంకర్య విధాన వేంకటనృసింహార్యాభిధాన ప్రణీతంబైన తాలాంకనందనీపరిణయంబను మహా ప్రబంధంబునందు...ఆశ్వాసము సంపూర్ణము.'

ఈ కవివర్యుని 'ఇందిరాల భాగవతము'ను నేనింక చూడలేదు. ఈతని చాటువులు కొన్ని మావద్ద గలవు. కాలాంతరమున వానిని గూర్చి తెలుపుదును.

సాహిత్యసేవ చేయుచున్నామను ఏకాడవికాలో—సంస్థలో ధనైకసాధ్యములైన యిట్టి ప్రబంధముద్రణ భారము వహియించి—సుపరిష్కృత మొనర్చి ప్రచురించిన ఆంధ్ర సాహిత్యమున నెన్నియో అమూల్య గ్రంథములు లభించును. అందు ముఖ్యముగ మరిం గంటి వారివి.

కొంతకాలము తరువాత గూడ ప్రాచీన గ్రంథముల స్థితి యిట్లేయున్న ఆంధ్రులమైన మనము విచారించుటతప్ప చేయకలిగిన దేమున్నది.

---

8. అముక్తమాల్యద యందు ఆశ్వాసాంతమున గద్యలేక పద్యము మాత్రమే గలదు. కాని ఇందు పద్యము, దానివెంట గద్యయు గలదు. పద్యములు రెంటియందు 'ద' ప్రాసతోనే యున్నవి.

# నా కోసం కన్నీళ్ళు కార్చొద్దు

## శ్రీ భైరవయ్య

ఈ సమస్యల్ని
ముసుగు మనుష్యుల్ని
ఈ వక్రోక్తుల్ని
వ్యర్థాలాపవాదుల్ని
ఈ విషస్వప్నాల్ని—విషపు నవ్వుల్ని
తేనె పూసిన కత్తుల్ని
నమ్మక ద్రోహుల్ని
ఆచరించలేని సిద్ధాంత ప్రకాండుల్ని
దుర్భరాన్ని
ఈ కుళ్ళుని
ఛేదించుకుంటూ
నేవెళ్ళి పోతున్నప్పుడు
నేస్తం
నా కోసం కన్నీళ్ళు కార్చొద్దు.
వాటితో
ఈ ఏహ్యానికి బందీని కావించొద్దు
చీకట్లు చీల్చుకుని
ముందుకు పోతున్న
నా గమనానికి
ఆనకట్టలు వెయ్యొద్దు
విస్తృత విశ్వంలో
విహరించబోయే నన్ను
రెక్కలు విరిచి
నేల రాల్చొద్దు
జిహ్వాగ్రాల కొసల మెసలు కరుకులతో
వద్దు నేస్తం వద్దు
సంతాప సభల్లో
నామానాన్ని చెరచొద్దు
సరిగమ పదనిస
మీ భావదారిద్ర్యాన్ని నా కంట గంటొద్దు
హంసలా ఎగురుతూ
అంతెత్తు మించి చూస్తే
అందంగా కనిపించింది
అజగరమని తెలియదు
దోవతప్పి వచ్చాను
ప్రవరాఖ్యుణ్ణైతే కానుగాని
ప్రలోభుణ్ణికాను
నందనవనంలా వుంది
నట్టేట దిగుతాననుకోలేదు
ఊబిలోంచి ఊడిపడ్డాను
వెనక్కి పిలవొద్దు
వద్దు నేస్తం వద్దు
విమర్శల్లో తద్దినాలు పెట్టే మహామహుల్నించి
పొగడ్తలతో పొంచుండే కబళించే రాహువుల్నించి
నికృష్టుల్నించి
ఈ ఘోర తమస్సునుంచి
పరస్పరద్వేషం—కావేషం
సిఫిలిస్‌లా సర్వాంగంగా వ్యాపించిన జాతినుంచి
ఈ అబద్ధాన్నుంచి
మానుపిల్లుల్నించి
దూరంగా—సుదూరంగా
వెళ్ళిపోతున్నప్పుడు
నాకోసం కన్నీళ్లు కార్చొద్దు నేస్తం
సుడిగుండాల్లో ముంచొద్దు
ప్లీజ్.

# వెన్నెలకంటి యన్నయ్యకవి కాలము

శ్రీ చేకుమళ్ల కామేశ్వరరావు

షోడశకుమార చరిత్రయను[1] తెలుగు కథల ప్రబంధమును వెన్నెలకంటి యన్నయ్యకవి వ్రాసినాడు. ఆ పుస్తకము కొంత మాత్రమే లభించినది. దాని యవతారికాభాగము దొరకకపోవుటచేత నా గ్రంధ కాలనిర్ణయ మొక సమస్య యైనది.

వెన్నెలకంటి యన్నయ్య తన కావ్యమును తన తండ్రియైన సూరామాత్యునకె యంకిత మిచ్చినట్లు ఆశ్వాసాంత గద్యములనుండి మనము గ్రహింపవచ్చును. ఆశ్వాసాంత పద్యములలో గొంచెముగా చారిత్రకాంశము లున్నవి. అవి కవికాల నిర్ణయమునకు సహాయపడునేమో పరిశీలింపవలసియున్నది. ఆ పద్యములలో మనకు నుపయోగపడు భాగములను మాత్రమే యిచ్చట నుట్టంకించెదము—

మా. ...శైవసిద్ధాంతవేదీ!
...యజ్ఞకర్మ ప్రవీణా!

క. ...అన్నయ సూరామాత్యా!

క. శ్రీ రామాయణ భారత
పారాశరసూక్తి కూర్మ పద్మ ప్రముఖా
పార పురాణ విలోచన
గౌరవధన్యా! మంత్రిగణ మూర్ధన్యా!

మా. హరిహరపదపద్మ ధ్యానాంతరంగా!
నరపతినయవిద్యానర్తకీనాట్యరంగా!
పరబలతిమిరాళీఖండనోద్యత్పతంగా!

క. ...శిష్యవర్గ మహాశ్రీ
ప్రాచుర్యమూల......

శా. ఆపస్తంబ పవిత్రసూత్ర! హరితఖ్యాతాన్వయా!
.........షట్పుత్రవేకుల.........

క. .........మణిఖచితభూష
వరితోషణ సుకవిలోక!......

ఉత్సాహ. బంధురప్రబంధ బంధభవ్య......
సింధురాశ్వ ప్రచుర తురగ సేవ్య వాజి శిక్షణా!

క. శ్రీ హర్ష ముఖ్యసుకవి స
మాహిత కావ్యప్రపంచ!
.మంత్రి యన్నయసూరా!

ఉ. ట్టియుగంధరాది నరపాలకమంత్రి మహా...సం
ఘట్టన ధీ ధురంధర!.

మందారదామము. సంగీత సాహిత్య సారస్యలోలా!
అంగీకృత శ్రీమ దద్విప్రధానా!

క. శ్రీ భార్గవ, కామందక
వైభావసహోపధార్య! వాసవమంత్రి
ప్రాభవ!.........

మ. సరసానందన! సత్కళాగమవరి
ష్ఠా కృష్ణకందార! భా
స్వర నానారసభావ నిర్మథన బో
ధక్షాత్మ! విద్యా నిరం
తర గోష్ఠీ జగదేకమల్ల! బహుశా
స్త్రగ్రంథ సిద్ధాంత వి
స్తర విజ్ఞాన కవిత్వ కావ్యకలనా
సర్వజ్ఞ సోమేశ్వరా!

ఉ. ...............మత్సరో
ద్దాను విరోధిమంత్రి జన
తా దృఢమంత్ర రహస్య...

క.
నాటకముఖ కోహళాది నాట్యరహస్యో
ద్ఘాటన నిపుణ! ప్రజ్ఞా
పాటవ చాతుర్య! మాన్య భరతాచార్యా!

---

1. షోడశకుమార చరిత్రము ఆంధ్ర సాహిత్య పరిషత్తు, (కాకినాడ)వారు 1932 లో ప్రకటించిరి.

పై పొగడికలనుండి కొన్ని యంశములు తెలియుచున్నవి. వెన్నెలకంటి సూరన యాపస్తంబ సూత్రుఁడు. హరితస గోత్రుఁడు. ఆర్వేలవాడు. అన్నయ మంత్రి పుత్రుఁడు. శైవసిద్ధాంత మెఱిఁగినవాడు. యజ్ఞములను జేసినవాడు. హరిహరారాధన ప్రియుఁడు. కవులను బోషించెను. ఏదియో ప్రబంధ రచన చేసి యుండును. నూత్నభరతాచార్యుఁడుగాన నేదియో నాట్యగ్రంథమును గూర్చియుండవచ్చును. అనేకమంది శిష్యులున్నవాడు. అతఁడు మహాప్రధాని. భట్టు, యుగంధ రాదులతో సమమైనవాడు. మంత్రిగణ మూర్ధన్యుఁడు. గుప్తముల శిక్షణ నెఱిగినవాడు. కృష్ణకందారరాజు, భోజరాజు, జగదేకమల్లుఁడు, సర్వజ్ఞ సోమేశ్వరుల వంటివాడు.

అతఁడు యజ్ఞయాగాదులను చేయుటచేత సూరన సోమయాజి యనవచ్చును. అయితే యతఁ డేరాజువద్ద మహాప్రధానిగానున్నాడో పై పొగడికలనుండి విశదముకాలేదు. కాని వానినుండి కాలనిర్ణయమును జేయవచ్చును.

'కవిత పుట్టిల్లు వెన్నెలకంటి యిల్లు'[2] అను సామెత యేర్పడినది. ఇంక నేయితర కవియైనను పైన జెప్పిన సూరనసోమయాజిని వర్ణించినాడేమో చూడవలసియున్నది.

జక్కయ మహాకవి విక్రమార్క చరిత్రమను తెలుగు ప్రబంధమును వ్రాసి, వెన్నెలకంటి సిద్ధన మంత్రికి క్రీ. శ. 1385 ప్రాంతములో నంకిత మిచ్చెను. సిద్ధనమంత్రి వంశమునకు మూలపురుషుఁ డైన సూరనసోమయాజి యిట్లు వర్ణింపబడినాడు—

సీ. వేదశాస్త్ర పురాణవిజ్ఞాన సరణిమై
        నధిగత పరమార్థుఁడై తనర్చె
    [3]నెద్దనపూడి, రాజేంద్ర చోడక్షమా
        రమణుచే నగ్రహారముగ నడసె
    గనకదండాళికాచ్ఛత్రచామర
        ప్రముఖ సామ్రాజ్య చిహ్నముల నొప్పె
    సర్వతోముఖముఖ్యసవనక్రియాప్రౌఢి
        మఖియ వంశమ్ముల నుద్ధరించె

గీ. నన్నదానాది దానవిద్యా ఘనుండు
    పరమశైవప్రదానాళపారగుండు
    హరితవంశాంబునిధిచంద్రుఁ డార్యమతుఁడు
    సుగుణ విభ్రాజి సూరన సోమయాజి.

ఈ పద్యములోని సూరనసోమయాజి హరిత సగోత్రుఁడు, సర్వతోముఖాది యజ్ఞములు చేసినవాడు. సామ్రాజ్యచిహ్నములు వడసినవాడు. రాజేంద్రచోడుని వలన [4]నెద్దనపూడి యగ్రహారమును బొందెను. (ఈ యెద్దనపూడి గుంటూరుజిల్లాలోని నరసారావుపేట తాలూకాలో నున్నది.) అన్నయకవి వర్ణించిన సూరన సోమయాజియు, నీ సోమయాజియు నన్ని గుణములలోను సరిపోయిరి. కాని వెన్నెలకంటి సూరన యను మఱియొకడుకూడ నున్నాడు. అతనితోఁగూడ సరిచూచికాని నిర్ణయము చేయరాదు.

జక్కనకవి వ్రాసిన షష్ఠ్యంతములలో నొక వెన్నెలకంటి సూరన పేర్కొనఁబడినాడు—

ఉ. వెన్నెలకంటి సూరన వి
    వేక గుణాఢ్యుఁడు, వేద శాస్త్రసం

---

2. వెన్నెలకంటి వేంకటాచలకవి వ్రాసిన శ్రీకృష్ణ ప్రబంధములోని వాక్యము.

3. ఈ పాఠము సరియైనది కాదనియు 'నెద్దనపూడి రాజేంద్రచోడక్షమారమణుచే నగ్రహారములు వడసె' యను పాఠము సరియైనదనియు భావించి నేలటూరి వెంకటరమణయ్యగారు యెద్దనపూడి రాజేంద్రచోడు డనువా డుండవచ్చునన్నారు. (భారతి, మే 1935 పుట 693.) కాని సూరన సోమయాజియొక్క కాలమును నిర్ణయించుటకు నితర సాధనములుగూడ నున్నవి. ఇంతకును నెల్లూరిచోడులు, కొణిదెనచోడులు, పొత్తపిచోడులను చోడ వంశములను వినుచున్నాముగాని యెద్దనపూడి చోడుల వంశనామమును వినలేదు. కాబట్టి పై పాఠమే సరియైనది.

4. ఎద్దనపూడి చిరకాల మొక వంశమువారి స్వాధీనములో లేదేమో! క్రీ. శ. 1149 నాటి యొక శాసనములో దానిని త్రిభువనమల్ల దేవరాజు గుండెమెడ యన్నయమంత్రికి దానము చేసినట్లున్నది. (తెనుఁగు కవుల చరిత్ర, నిడదవోలు వెంకటరాయ కృతము. 1953. పుట. 196.)

తునుక—'మహారాజాధిరాజ పరమభట్టారక పరమేశ్వర'.... పశ్చిమ చాళుక్యరాజా లెట్టివారో యితఁడు నట్టివాడె. సోమేశ్వరుఁడు 1108 ప్రాంతపువాడు. ఇతని కుమారుఁడు కన్నారుఁడు లేక కందారుఁడు. అతఁడు 1111 లో సింహాసన మెక్కెను. అతని శాసనములు కృష్ణపురములో నున్నవి. కృష్ణపురమునకు సంబంధించిన కందారుఁడే అన్నయకవి పేర్కొన్న కృష్ణకందారుఁడని నిర్ణయింపవచ్చును. అతని కుమారుఁడు జగదేకభూషణ వీరసోమేశ్వర మహారాజు. అతనికి లేక యతని తాతకు సర్వజ్ఞ బిరుదుండుటలో విచిత్రమేమియును లేదు. నాగమహారాజుల శాసనములు క్రీ. శ. 1325 వఱకును గనఁబడుచున్నవి.

పశ్చిమ చాళుక్య, తూర్పు చాళుక్య, సామ్రాజ్య చోళ, కాకతీయ, కళింగ, నాగ, దక్షిణకోసల మహారాజులు తఱచుగాఁ బోరాడు కొనుచుండిరి. ఒకరొకప్పుడు, మఱియొక రింకొకప్పుడును గెల్చుచుండుట సహజము.

తెలుగురాజ్యములైన దక్షిణకోసల, నాగరాజ్యములయొక్క కవిత్వపోషణ, కావ్య రచనను గుఱించి తెలుగు చరిత్రకారులు తగిన పరిశీలన చేయకుండుట విచారకరము. ఆంధ్రభోజాఁ డీనంశములవాడై, క్షేమేంద్ర, భల్లటాది కవు లిక్కడివారు కావచ్చును. వేములవాడ భీమకవి యీ యాస్థానములను దర్శించుచుండెను. ఆ ప్రాంతమందలి సాహిత్య చరిత్రను వెలిదీయుట భాషాభిమానుల విధి.

అట్లు అన్నయకవి పేర్కొన్న సర్వజ్ఞ సోమేశ్వరుఁడు పైనఁ జెప్పిన నాగరాజులలో నొక్కఁడని సబబుగా దలపవచ్చును. కృష్ణకందారుఁడు పైనఁ జూపిన నాగరాజులలో నొకఁడు. అట్లు వారందఱును కూడ క్రీ. శ. 1130 కి పూర్వమున్న వారో, లేక సమకాలికులో యగుచున్నారు.

రాష్ట్రకూటచక్రవర్తులలోని మూడవ కృష్ణుఁడే (క్రీ శ. 888) ఈ కృష్ణకందారుఁడని శిమల్లంపల్లి సోమశేఖరశర్మగారనిరి. కాని యీ రాజు కొఱకు నంత వెదకకుఁ బోనక్కర లేదు. నాగరాజులలో నొకఁ డాపేరునకు సరిపోవువా డున్నాడు కదా!

అన్నయకవి కాల నిర్ణయమునకు యాదవ రాజైన కృష్ణకందారుని (క్రీ. శ. 1247-1260) గ్రహించి, షోడశకుమార చరిత్ర రచన 1260 కిఁ దిమ్మట, ఏ పదునాల్గవ శతాబ్ద ప్రారంభములోనో నుండవచ్చని కొందఱు విమర్శకుల యూహ. అతఁడు నాగరాజ వంశములోని వాడని భావించుటచేత నా గ్రంథ రచనా కాలమునంత దిగువకు లాగనక్కరలేదు.

పైన జెప్పిన రాజుల కాలము 1130 కి పూర్వము లేక సమకాలము. వెలనాటి రాజేంద్ర చోడుఁడు క్రీ. శ 1115-1136 కి మధ్యనున్నవాడు. కాఁబట్టి షోడశకుమార చరిత్ర రచన క్రీ. శ. 1125 ప్రాంతమని సహేతుకముగా నిశ్చయింపవచ్చును. దీనికి నభ్యంతరముగా దోఁచెడియొక చిన్న యంశ మిచ్చట ముచ్చటింపఁబడును.

సూరన సోమయాజి శ్రీ హర్షకవిత్వ ప్రియుఁడని పొగడికలలోఁ జెప్పబడినాడు. ఆ శ్రీహర్షుఁ డెప్పటివాడు? సంస్కృతమున నైషధీయ కావ్యమును సృష్టించిన కవి విషయమై శ్రీనాథ మహాకవి—

'భట్టహర్షుని కవితా నిగుంభనములు

సంతరించితి నిండు జవ్వనంబునయందు
హర్షనైషధకావ్య మాంధ్రభాష'

యని హర్షశబ్దమును మాత్రమే వాడినాడు. హర్షుఁడు క్రీ. శ. 1189—1195 నాటివాడు. అన్నయకవి యీ కవి పేరును బేర్కొనుటచేత నటుపిమ్మటివాఁడగునెడి యాక్షేపణ పుట్టవచ్చునుకదా! ఆ హర్షునికి పూర్వమె శ్రీహర్షుఁ డున్నాడు. అతఁడు శ్రీహర్షుఁడనని శాసనములలో సంతకము చేసికొన్నాడు. ఆ మహారాజు 606-646 నాటివాడు. రత్నావళి, ప్రియదర్శిక, నాగానందమను ప్రశస్త నాటకముల సృష్టించినాడు. అన్నయకవి యతనినె స్మరించినాడు. కాఁబట్టి హర్షనామము మన సిద్ధాంతమునకు నడ్డురాదు.

---

8. రెడ్డి రాజ్యముల చరిత్ర (ఆంగ్ల గ్రంథం) పుట. 504.

షోడశకుమార చరిత్రకు మూలమేదియను ప్రశ్న వెదుక్కొనుటలో కష్టముండదు. విక్రమార్క, భోజ, కాళిదాసాది కథలు నానాటికి పెరుగుచు, మారుచుఁ బోవుచుండును. కాబట్టి వాటి రచనకు మూలమేది యనునది యంత ముఖ్యమైన ప్రశ్న కాదు. దశకుమార చరిత్ర కావ్యమును దండి ప్రత్యేకముగా సృష్టించినట్లు తోచుచున్నది. అన్నయకవి షోడశకుమార చరిత్రను వ్రాసిన విషయ మెఱిఁగియో, కేతనకవి దశకుమార చరిత్రను దెలుగులో వ్రాసె ననవచ్చును. కొఱవి గోపరాజు (1350–1410) వ్రాసిన సింహాసనద్వాత్రింశిక యొక్క తెలుగు వచన కావ్యమునుబట్టి వ్రాసిన ట్లగపడుచున్నది. సంస్కృతములో భోజరా యమను పేరుగల గ్రంథ ముండినది. ఇప్పుడు లభ్యమగుటలేదు. పుక్కిటి కథలలాగు వృద్ధి బొందెడి కథ లివి. కాఁబట్టి అనంతామాత్యుని భోజరాజీయమునకుఁగూడ మూలానుసరణమంతగా నుండదు.

అన్నయకవి తన గ్రంథమునకు షోడశకుమార చరిత్రమను పేరొక్కటియే పెట్టినాడు. భేతాళ పంచవింశతియను మారుపేరు గూడనున్నట్లు తెలియ జేయలేదు. అయితే దీనిలో నిరువదియైదు కథ లుండుటచేత కాబోలు దీనికిఁగూడ భేతాళ పంచ వింశతి యను పేరు వాడుకలోనికి వచ్చినది. ఏదైనను కవి భల్లటుఁడు వ్రాసిన భేతాళపంచవింశతి యొకటి యున్నదని లక్షణ కావ్యములనుండి తెలియుచున్నది. అంతేకాక ఆ పుస్తకమును [9]వేటూరి ప్రభాకరశాస్త్రి గారు పరిశోధించి, పైకెత్తి, ముద్రణకు సిద్ధము చేసినారట! కవి భల్లటుఁడను పేరుగలవారు పెక్కు మంది యున్నట్లుగాఁ గనఁబడుచున్నది. వాటి వివరము లిక్కడ ననవసరము. ఏమైనను షోడశకుమార చరిత్ర, భేతాళ పంచవింశతియు వేర్వేఱు గ్రంథములు. షోడశకుమారచరిత్రమను సంస్కృత గ్రంథముండవచ్చును. కాని దానియనుసరణ దీనిలో నంతగా నుండదను విషయమెఱుఁగవచ్చును. ఈ రకపు కథల స్వభావమట్టిది. తెలుగు కవులు మూలానుసరణకుఁగాక కవిత్వమునకు నెక్కువ ప్రాముఖ్య మిచ్చిరి.

షోడశకుమార చరిత్ర యవతారికా భాగము లభింపక పోవుటచేత, దానికర్తయగు అన్నయ్య కవిని గుఱించి రెండేమాటలు చెప్పగలుగుచున్నాము. అతని తాత యన్నయ, తండ్రి మారన సోమయాజి. తండ్రికే తన గ్రంథము నంకితమిచ్చెను.

కృతిపతియైన మారన సోమయాజిని గుఱించి మాత్రము గొన్ని వివరములు ఆశ్వాసాంత పద్యముల నుండి తెలియుచున్నవని వెనుకనే చెప్పబడినది. కృతిపతి హరిహరనాథ భక్తుఁడు. తిక్కన మహాకవి హరిహరారాధన చేసిన వాడని మన మెఱుఁగుదుము. హరిహరారాధన తెలుగుదేశములోనికి పదునొకండవ శతాబ్దిలోనే ప్రవేశించినదని [10]ద్రాక్షారామశాసనమునుండి తెలియుచున్నది. కాఁబట్టి యన్నయకవి గ్రంథములోని హరిహరారాధన ప్రస్తావనకు మనము విచిత్రపడనవసరము లేదు.

జక్కన మహాకవి విక్రమార్క చరిత్రములో మారన సోమయాజినిఁ గీర్తించి, సిమ్మటివారిని విడిచిపెట్టి, మనుమడైన సిద్ధమంత్రి విషయ మెత్తుకొనెను. అక్కడ మనుమడనగా నా వంశమువాడని మాత్రమే భావము. కవులు సుప్రసిద్ధులను వర్ణించి, యప్రసిద్ధులను విడిచిపెట్టుచుండుటకూడ గలదు కదా!

అన్నయకవి కవిత్వశైలికి నన్నయభట్టుగారు ఒరవడి కాబోలు. సంస్కృతపుపాలు కొంచె మధికము. తిక్కన మహాకవికి బిమ్మట నా యుద్యమము మారినది. తెలుగు నుడులకు ప్రాముఖ్యము ఏర్పడినది. ఈ చక్కని యుద్యమమును శ్రీనాథ మహాకవి తుడిచిపెట్టినాడు. ఈ యుద్యమమునుండి యించుమించుగా నిరువదియవ శతాబ్దినాటికిగాని వాఙ్మయము కోలుకొనలేదు.

షోడశకుమారచరిత్రముయొక్క పూర్ణప్రతి సంపాదనకోసము సాహిత్యపరులు పరిశోధింపవలసి యున్నది.

---

9. సమగ్రాంధ్ర సాహిత్యము. సం. 4. పుట. 31.

10. ద. హిం. శా. సం. 4. సంఖ్య–1059. (ఆంధ్ర కవి తరంగిణి సం. 2. పుట. 148.)

# అంతమవనికథ

డాక్టర్ మాదిరాజు రంగారావు

భూమి తిరుగుతున్నది
భూమిపై తిరిగే మనకు
దివానిశారూపాలలో
రవిచంద్రుల చలనభ్రాంతి.

ప్రపంచం ఆకర్షిస్తున్నది
ప్రపంచంలో బతికే మనపై
త్రివర్గ రూపాలలో
త్రికరణాధికార ముద్రలు.

మనోనేత్రం విప్పిచూడు ఒక్కసారి
శాఖోపశాఖలుగా సంకీర్ణంగా
విస్తరించిన మహావృక్షం, ఈ ప్రపంచం
పైన ఎక్కడో పాతుకపోయి
అదృశ్యంగా ఉన్నవి దీని వ్రేళ్లు.
క్రిందుగా ఆకర్షణీయంగా
కిసలయపత్రపుష్పఫలసంతతి.

మొగిళ్ళు, చుక్కలు, మెరపులూ
మరపింపజేయు ప్రేయోరూపాలు
ఆకుల కదలికలో సంగీతం.
రంగుల కూర్పు తీర్పులో చిత్రకళ.
అవిరళ మాధుర్య సౌందర్యంతో
ఆత్మను రసపదవి నదపీయసంగా
భ్రమింపజేసి, పరిభ్రమింప జేయు
వివర్తకళారూపం.

ప్రక్కనే పరిశీలింపదగినవి
ముండ్లు, పురుగులు, తుట్టెలు, కోకొల్లలు.

ప్రాణం మృత్యువు రెండూ
వికాస వినాశ దశలలో
ఒకేచోట కలిపిఉన్న రూపం.

ఆకాశంలోకి చొచ్చిన శిరస్సుపైనుండి
క్రిందికి జారిన చీకటి జడలు
ఊగిపోవగా గాలికి దిశలలో,
తరగ లుదరిపడు కడలివలె
నిలచిఉంది సనాతనవృక్షం.

ఈ చెట్టు కొమ్మలపై ఏండ్లుగా
గూళ్ళు కట్టుకొని నివసిస్తున్న పక్షులు.
దప్పికగొని పిడచకట్టిన నాల్కలతో
తపిస్తూ నిలచి ఉన్నవీ,
చలికి ముడుచుకొన్న శరీరాలతో
వణకుతూ ఒదిగి ఉన్నవీ,
వానజల్లుకు తడిసి ముద్దై
వెచ్చదనంకోసం వగర్చేవీ,
వసంతం వచ్చేవరకూ
ఆశతో బ్రతికి ఆనందించేవీ,
కలలు ప్రోది చేసుకుంటూ
బయళ్లపై రోదసిలో దృష్టిబరపేవీ,
బహువిధస్థితులకు ప్రతీకలుగా ఉన్నవి.

ప్రకృతిలోని అవరోధాలను నిరోధిస్తూ
ఘర్షిస్తూ లంఘిస్తూ లొంగుతూ జ
జీవనయాత్ర సాగిస్తూంది ప్రాణికోటి.

అనుభూతి సమార్ద్రమై హృదయం,
అనుభవ పరిపక్వమై మనస్సు,
అవతరించు ఉదయారుణ రూపంతో
మంచు క్రమ్మిన తూరుపుదిశవలె,
బహుదృశ్య పరంపరలు వహించి
ఏ అనుకూల స్థితికైనా
ఏ ప్రతికూల స్థితికైనా
చెట్టునీడ ప్రతిఫలించిన కాపారంవలె

తుపాను రాత్రి పెదుర్కొమ మహానదివలె
ఎప్పుడూ సర్వసన్నద్ధమే.

అడవులు పర్వతాలు నదులు ఎదురైై
మానవుడు వెనుకాడి నిలచిపోయాడా?
యుద్ధాలు క్షామాలు దుఃఖాలు వచ్చినా
అతని జీవితపారంపరి ఆగిపోయిందా?

ఈ చెట్టు నీడక్రింద
బ్రతుకు తెల్లవార్చే ఓ మనిషీ!
ఒక్కసారి అద్దంలో చూచుకో నీ ముఖం!

ఎన్ని మంచు పొరలు
ఎన్ని చీకటి తెరలు!
వాటి వెనుకనే ఎందరెందరు రాక్షసులు!
వాటి చాటునే ఎన్నెన్ని జంతువులు మృగాలు

ఎన్ని వెలుగు కలలు!
ఎందరెందరు దేవతలు!
ఈ కళ్లు చెవులు మనస్సు మొదలుగా
వారి సేవకులు, వీటి అనుచరులేగా.
ఆత్మ నావరించిన ముసుగుతోనే
మనిషి వ్యక్తిత్వరూపం ఉంటుంది.
ఎన్ని సాహసకృత్యాలు చేయించి
ఎన్ని నాగరక రీతులు నిర్మించింది.
ఈ ముసుగు లేకపోతే
మానవు డేస్థితిలో వుండేవాడో?
శిలగానా? కలగానా?
చీకటి ముద్దగానా?
వెలుగు గీతగానా?

నీలదుకూలం కప్పుకొని వస్తుంది రాత్రి
నీలాకాశం వంగిపోయి
విశాలపృథ్వీఫాలం చుంబిస్తుంది.
చెట్టుక్రింద చీకటిలో
కమరెప్పలు వ్రాలి

అంతమవని కథ

మనస్సు విశ్రాంతి నభిలషిస్తుంది.
అపుడు నిదుర, స్వప్నం—

కనురెప్పలు విచ్చి
చెట్టుక్రింద వెలుగులో
మనస్సు వ్యాపారనిమగ్నమౌతుంది;
అపుడు మెలకువ, లౌకికం.

బంగరుపూవుల తెల్లని పటుశాల్వవ
కప్పుకొని వస్తుంది ఉషస్సు.
దిక్కులకన్నులుచెమ్మగిల్లి
మధుపరాగకింజల్కాలౌతవి చూపులు.

విశాలపృథ్వీహృదయం
జీవకోటిని గుండెకు హత్తుకుంటుంది.
అనంత గగన హృదయం
ఆనందతరంగాలోలమై పరవశిస్తుంది.

ఒక్కొక్క లిప్త ఒక్కొక్క దీపంవలె
వెలిగి కాలం దీపతోరణ మౌతుంది.
ఒక్కొక్క లిప్త ఒక్కొక్క పుష్పంవలె
వికసించి కాలం పుష్పదామ మౌతుంది.

ఎప్పటికపుడు గాలులు క్రొత్తగా
చెట్టుకొమ్మలను మేల్కొల్పుతాయి
ఎప్పటికపుడు రాలిన ఆకుల స్థానంలో
క్రొత్తవి తలయెత్తి మెదలుతాయి.

బయట మంచుపొర తొలగిపోతూంటే
లోపల మసకతెర తరల్లివస్తూనే ఉంది.
రవి శుభ వీక్షణాలు ప్రసరిస్తూనే ఉన్నవి.
భువి స్వర్ణ పథాలందరికీ లభించడంలేదు.

ఊహకూ చేతకూ
ఆశకూ ఆశయానికీ
సంబంధం బాంధవ్యం చేకూరీ చేకూరకా
బ్రతుకు భోగభూమిగా, శిల్పఖండంగా

మారడంలోనే లేదు:
నిజస్వరూపావగతి, ఓ మనిషీ !

నాగరక సంపన్నంగా సాగిన
ఈ వృక్షాన్ని వదలగలవా?
నిదుర పొరవలె ఆవరించిన
ఈ పీడను మరవ గలవా?

పగలు రాత్రి అన్న భిన్నరూపాలు
ప్రకృతి పొందు పరిణామముఖాలు
నిదుర మెలకువ అన్న భిన్నస్థితులు
మనస్సు పొందు పరివర్తన దశలు.

సాగిపోవు గాలులు
మలుపులు మలిగి తాకు వెలుగులు
పగిలిన రంగురంగుల గాజుబొమ్మలు,
ఒకటేమిటి ఈ ఆవరణంలో
ఎన్ని ధ్వనులు? ఎన్ని ప్రతిధ్వనులు?
ఎన్ని రూపాలు? ఎన్ని ప్రతిరూపాలు?

ఇవి అంకితమైన బ్రతుకులో
అహి పలె చుట్టలు చుట్టుకొని
పరున్న అహంకారం అట్టడుగున
పడిఉన్న ఆత్మ:
స్వస్వరూపం ఎరుగ గలవా?

సంకల్ప వికల్ప శక్తిగల మనిషీ!
నిశ్చయ వివేచన ఎరిగిన మనిషీ!
అప్పటివర కీచెట్టునీడ తప్పదు!
అప్పటివర కీస్వప్నచిత్రం అవదు.

# గ్రంథ విమర్శలు

## చేతనావర్తం

(వచన కవితా సంకలనం)

[రచయితలు : సుప్రసన్న; పేర్వారం జగన్నాథం; సంపత్కుమార; వే. నరసింహారెడ్డి; ప్రచురణ : సాహితీబంధుబృందం, వరంగల్లు; 96 పేజీలు. వెల : రూ. 3.]

అభ్యుదయ కవిత్వంనుండి విడివడ్డ వచన కవిత ప్రత్యేకమైన రూపాన్ని, అస్తిత్వాన్ని పొందింది. కుందుర్తి, తిలక్‌లు ప్రస్థానికులుగా సాగిపోతున్నది యీ ఉద్యమం. వచన కవిత్వాన్ని వ్రాస్తున్న వాళ్ళలో చాలమందిని పట్టుకొని వేధిస్తున్న సమస్యలు అసందిగ్ధత; అయోమయం; అంతు దొరకని 'మిస్టిసిజం'; శబ్దపరిధి విస్తృతి తెలీకపోవటం; చెప్పింది ఎంతైనా పాఠకుని హృదయాన్ని హత్తుకోలేకపోవటం. అందుకే వచన కవులు కొందరు కవిత్వం చెప్పబోయి కవిత్వానికి అర్థం చెబుతున్నారు. మరికొందరు ఏ అనుభూతీ కలిగించని అయోమయ శబ్దాడంబరంతో పత్రికల కెక్కుతున్నారు. పూర్వపు లాక్షకవులు, చిత్ర బంధ కవిత్వాలను వ్రాసినవాళ్ళుకూడ పడని శ్రమను ఆధునిక కవులు కొందరు పడుతున్నారు. చెప్పిందేదో విచిత్రతను కలిగించాలనితప్ప అందంగా ఉండాలనీ, ఆనందంకలిగించాలనీ ఆలోచించటంలేదు. విచిత్రత సౌందర్యం కాదని గ్రహించలేకపోతున్నారు. భావాలలో విప్లవం తేలేని పలువురు కవులు సంప్రదాయికచ్ఛందస్సును కాదనటమే కవిత్వమని విఱ్ఱవీగుతున్నారు. పూర్వపు కవులు కొందరు చెప్పదలచుకున్న భావాన్ని పద్యపు చట్రంలో ఇమిడ్చటంలో ఎన్నో వ్యర్థపదాలను అరువు తెచ్చుకుని సహజ సంపదను కోల్పోయేవారు. నేటి కవులు స్వేచ్ఛగా వచన కవితలో వ్రాయటానికి పూనుకొనిగూడ భావావేశాన్ని ఎలా నిగ్రహించుకోవాలోతెలీక ఆవేశాని కవిత్వంగా మార్చుకునే రసవాదవిద్యలో ప్రావీణ్యం లేకపోవటాన కవితాస్వరూపాన్ని కళంకితం చేసికొంటున్నారు. కవిత్వపు ధాన్యరాసిలో కాలం అనే గాలి వీచినతరువాత మిగిలే మంచిగింజలలాగే నవకవులలో ప్రతిభావంతులు నిలుస్తారు. ఈ కవులకు కూడ లోడ్డైనే విత్తనపు గింజలవలె నిలిచి కలకాలం సమృద్ధిగా సాహిత్యక్షేత్రాన్ని సుసంపన్నం చేస్తారు.

మేలిరకం వచనకవులుగా కవితావరణంలో చేతనావర్తాన్ని కల్పించ జూస్తున్న కవులుగా యీ 'చేతనావర్తం'నుండి పరిచయమౌతున్న కవులు సుప్రసన్న; పేర్వారం జగన్నాథం; సంపత్కుమార; వే నరసింహారెడ్డిగారలు. వీరి కవితలు వచన కవిత్వంలో చిరస్థాయిగా నిలిచే కవితా ఖండికల నెన్నింటినో అందించాయి. శబ్దశక్తినీ, ఉక్తివైచిత్రినీ, ఔచితినిర్వహణను పాటించటంలో యీ కవులు సమర్థులు. అంతేగాక ఆధునికకాలంలో వస్తున్న కవితారీతులనూ విశాలప్రపంచంలోని వైజ్ఞానికాభివృద్ధినీ, మనస్సులోని మారుమూలలను వెలికితీసే ఫ్రాయిడియన్ భావ సందోహాన్ని, సృష్టిని అనాదిగా వేదిస్తున్న పర సారాటపు మూలకారణాలనూ, వ్యక్తి స్వాతంత్ర్య ప్రాముఖ్యతనూ అన్నింటినీ కళ్ళువిప్పిచూపి సానుభూతితో అర్థం చేసికొని, విజ్ఞానాన్ని జీర్ణం చేసికొని విశ్వలోకైక భావనతో కవిత్వాన్ని చెప్పబూనుకొన్నారు.

ఆధునికాంధ్ర కవిత్వాన్ని సమగ్రంగా దర్శింపజేసే 'భూమిక'ను యీ కావ్యానికి అలంకారంగా సమకూర్చారు శ్రీ కోవెల సుప్రసన్నాచార్యులు. '1935 ప్రాంతాన భావకవిత్వంమీద తిరుగుబాటుగా అభ్యుదయ కవిత్వం ప్రారంభమయింది...అభ్యుదయ కవితారంభంతోపాటు ప్రయోగవాదం కూడ ప్రధానంగానే గోచరిస్తుంది. నూతనత్వాన్నిగూర్చి అన్వేషణగా ప్రారంభమయిన ఈ కవిత రెండు శాఖలుగా ప్రవర్తించింది. రెండు మార్గాలలోనూ కొందరు కవులు రచించటంవల్ల దీనిలో పృథగ్విభాగం ఆదియందు జరుగలేదు.' 'ప్రగతివాద కవులూ, ప్రయోగవాదకులుగా అభ్యుదయ కవులను వర్గీకరించడం జరుగుతున్న

వీరి పరిశీలనానైపుణ్యం కొనియాడ తగినది. నవ్యాంధ్ర కవిత్వమంటే తిరుగుబాటు మాత్రమే కాదన్న వీరివైఖరి విశిష్టమైనది. 'ప్రగతివాద కవులు - మార్క్సియదృక్పథాన్ని ప్రధానంగా స్వీకరించి రచనలు చేయగా, వారియందు యథార్థవాదమే ప్రాధాన్యం వహించింది. దీనికి విరుద్ధంగా ప్రయోగవాదులు కవితారూపంలో అభివ్యక్తిలో విపరీతమైన నూత్నత్వాన్ని ప్రయత్నించగా, ప్రగతివాదులు కేవలం వస్తువుకే ప్రాధాన్యం ఇచ్చారు. వీళ్ళిద్దరి భావధారలోనూ, శైలిలోనూ సామ్యం మిక్కిలి తక్కువ అనే చెప్పాలి. మనోవిజ్ఞానం, వైయక్తికపరివేషములకు ప్రాముఖ్యము, భర్త్సనము, అవసాదము, కుంఠ, అతృప్తి మొదలైన లక్షణాలు ప్రయోగవాదులలో వ్యక్తమవుతవి. 1950 వరకూ ఈ రెండూ అభ్యుదయ కవిత్వం అన్న పేరనే చెల్లుబడి అయినవి. ప్రగతివాద దృక్పథంతో శ్రీ శ్రీ, పురిపండా, నయాగరా కవులు, అనిసెట్టి, సోమసుందర్, గంగినేని, రమణారెడ్డి మొదలైన కవులు రచన చేయగా, ప్రయోగవాద దృక్పథంలో శిష్ట్లా, శ్రీ శ్రీ లేకాక, నారాయణబాబు, పట్టాభి, దేశిరాజు కృష్ణశర్మ, వరదరాజేశ్వరరావు, బైరాగి, ఆరుద్ర మొదలైనవాళ్ళు రచనలు చేశారు. వీరిలో చాలమందిమీద అధివాస్తవిక ప్రభావాలు గోచరిస్తవి. బైరాగి, ఆరుద్రలపైన ఇలియట్ ప్రభావం గోచరిస్తుంది.' సుదీర్ఘమైన యీ వ్యాసం ఆధునిక కవిత్వంపట్ల అభిరుచిగలిగిన పాఠకులెల్లరూ తప్పక చదువతగినది. శ్రీ సుప్రసన్నగారి వర్గీకరణ సరియైనదని వేరే చెప్పనవుసరములేదు.

'1960 ప్రాంతంలో తెలుగు కవితలో వచన కవిత ఒక స్థిరమైన రూపాన్ని పొంది ప్రాధాన్యం వహించినట్లు గోచరిస్తుంది. ఒక కొత్తతరం కవులు అన్ని భావధారలనూ ఈ కావ్యరూపంలో అభివ్యక్తీకరించడం మొదలుపెట్టారు.'

కుందుర్తి నాయకుడుగా ప్రవర్తిల్లుతూవున్న ఈ వచన కవితా ఉద్యమం కవులలో ఈ కొత్త తరానికి ప్రాతినిధ్యం వహిస్తూవున్నది. మాదిరాజు రంగారావు, గోపాలచక్రవర్తి, దుర్గానంద్, అరిపిరాల విశ్వం, కేశవరావ్, మురళీధర్, వరవరరావు, శీలా వీర్రాజు ప్రభృతులు విరివిగా రచనలు చేస్తూవున్నారు.'

ముక్తచ్ఛంద కవిత—లేదా వచన కవిత, కవిత్వంలో ఒక కొత్త ఆవిష్కారమే. ఈ రూపం స్థిరపడటానికి దాదాపు పాతిక యేళ్ళుపట్టింది...అభ్యుదయ కవితాయుగంలో ప్రగతివాద, ప్రయోగవాద కవితల్లో ఆవేశం ప్రధానంగా ఉండేది, ఆ ఆవేశం పాలు తగ్గి ఆలోచన పెరిగింది. కవిత్వంలో 'వచనత' వచ్చింది. దానికోసం వచన కవిత అవసరమయింది. కవిత్వంలో ప్రత్యక్ష కథనం ప్రాధాన్యం వహించినప్పుడు ఇతిహాసములలో ప్రయుక్తమయ్యే శైలివలె ఇది రూపొందుతుంది. కాని దానిలోని వచనత్వాన్ని దూరం చేయటానికి కవి చాల జాగరూకుడై ఉండవలసి యున్నది.

కవి ఏమన్నా అజాగరూకుడై ఉన్నాడా అతడు అటు వచనంలోనో ఇటు గేయంలోనో పడవచ్చు. అందుకే ఇది కత్తివాదరమీద నడవటం. పై వాక్యాలన్నీ సుప్రసన్నగారివే. వాటితో ఈ సమీక్షా కర్త ఏకీభవించటమే గాదు; ప్రత్యక్షరమూ ఆధునిక కవితాభిమానులెల్లరూ చదివి యీ విమర్శను ఆకళింపుకో వాలంటాడు.

'చేతనావర్తం'లోని కవులు నలువురూ ప్రగతివాద, ప్రయోగవాద కవితలలోనుండి విడివడిన వచన కవితలో సాధనచేసిన వాళ్ళు; చేస్తున్నవారు. నలువురూ వ్యుత్పన్నులు. విద్యాధికులు కావటంచేత శబ్దసంపదపై తగిన అధికారం సంపాదించిన వాళ్ళు. దుస్సంధులూ, దుష్టసమాసాలూచేసి వైచిత్రిని సాధించే దౌర్భాగ్యం యీ కవులకు లేదు. తెలుగు ఇంగ్లీషు మాటల కలయికతో గారడీచేసే దుర్గతి వాళ్ళకు పట్టలేదు. సహజ సుందరమైన భాష వీళ్ళ సొత్తు. నిసర్గసుందరమైన శైలి వీళ్ళకు అప్రయత్నంగా వచ్చింది. ప్రపంచ సమస్యలన్నీ వీరి కావ్య సమస్యలే. ఏకీకృతమైన 'ఆధునిక చేతన' యీ సంపుటంలో వీరందరినీ కవులుగా నిల్పుతున్నది. నేటి విమర్శలో ఉన్న ప్రధానదోషాన్ని వీరు గుర్తిస్తున్నారు. 'అనుభూతికన్న శిల్పం ప్రాధాన్యం వహించటం వలన' 'అభివ్యక్తికన్న వ్యుత్పన్నతకు కీర్తి ' రావటంవలన

విమర్శ కలగాపులగమైంది. సహృదయుడే కవిత్వాను భూతికి ప్రమాణమని వీరి ఉద్దేశం.

శ్రీ సుప్రసన్నగారి కవితల్లో 'శుష్కక్షాళ నానికి పంపండి', 'వ్యాఖ్యానం' 'ఇంద్రియాలు నిద్ర పోయినవేళ;' 'అమృతపుత్రులు'; 'కల్యాణవర్ష' అనేవి మేలైన కవితా ఖండికలు. చరిత్ర పునరావృత్తిని తల పోస్తూ, చరిత్రపొక పట్టుతెరపై వ్రాసినచిత్రంతో పోలుస్తూ

'శవగంధం కొడుతున్న ఈ పట్టుతెరని
శుష్కక్షాళనానికి పంపించండి! ఛీ ఛీ'

అని చరిత్రలోని కాలుష్యాన్ని యీసడించారు. 'అనవధి' అనే గేయంలో

'గతం గాయం, వర్తమాన మపాయం
భవిష్యత్తు హేయం అనుకున్న చోట'
అంత ఎత్తయిన 'అవధి' వేసుకున్న
ఆషాఢమేఘపు పందిరికొసల

యక్కుడల్లిన మందాక్రాంత లతలు' అని మధుర మైన భావనను మధురమైన భాషలో వెల్లడించారు. 'వ్యాఖ్యానం' అనే గీతంలో సృష్టికి 'ఎవ్వని వ్యాఖ్యానమూ సంపూర్ణ సత్యంకాదు'; అని,

ఇంద్రియాలు నిద్రపోయిన వేళలో—

ఎక్కడిదో ఎప్పటిదో తెలియని
అపూర్వమైన
సౌందర్య పరిమళం వీచేచోట
స్వచ్ఛమైన భవభూతి కరుణామయ వాగ్వీథి
అక్కడ—గాలాన తగుల్కొన్న చేపలా
కాలం కదల లేదక్కడ.........

'మహాకవుల కావ్యాలలో రసంవలె
భగవంతు డెప్పుడూ వ్యంగ్యమైనవాడు
వాగర్థములవలె చైతన్యములో
కాల మావరాలు కలిపిస్తుంది' అని

వచన కవిత్వంలో కలకాలం జ్ఞాపక ముంచుకోవలసిన పంక్తులివి.

సుప్రసన్నగారి గీతా లన్నింటిలో ప్రత్యక్షరమూ పొందికగాఉన్న గేయం 'అమృత పుత్రులు'. వీళ్లెవ రంటే

'కష్టిళ్లే వీళ్ల ఆస్తి, మిన్నేటి చల్లని వీచికలసీడ
వీళ్ల ప్రభుత్వ పర్యాప్తి, చిన్నారి పాపపు చిర్నవ్వు
సర్వరోగాలకూ వాడేమందు, సర్వప్రపంచమూ ఇల్లు
ఎల్లరూ ఒకేకుటుంబం,ఆనందమే వాళ్ళఅనుబంధం'

అని చెప్పి 'అమృత పుత్రులు, ఆనందగాత్రులు, అంభోదనేత్రులు' అని ముగించారు. 'కల్యాణవర్ష' గీతం పాడుగనిపించినా ఋతువర్ణనలో కళ్లకుకట్టే దృశ్యాలను ప్రదర్శిస్తుంది. వీరు మార్పును శ్మశానం లోంచిగాక నిరంతర సౌందర్యాన్వేషణలోంచి ఆహ్వానిస్తారు.

శ్రీ పేర్వారం జగన్నాథంగారు వ్యంగ్యాత్మకమైన భావన నందించటంలో సమర్థులు. 'కార్టూను కవిత' లక్షణం వీరి కవిత్వంలో ప్రత్యేకత. వీరి కవితల్లో 'స్వయంవరం'; 'దైవాసుర సంపద్విభాగ యోగః'; 'యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత;' 'ది గ్రేట్ ఇండియన్ సర్కస్'; 'మరణ శాసనం' ఎన్న దగినవి. 'స్వయంవరం'లో 'స్వామీ!

ఈ మగడు నాకొద్దు
నీ దసలే తుమ్మమొద్దు'

అని చమత్కారంగాచెప్పినా కవిఉద్దేశించిన అర్థం పాఠకుడు అందుకో గలగడం కష్టం.

యముడు మునుపటంత
ధర్మరాజు కాడు
మగడి ప్రాణాలు మళ్లీ యివ్వడానికి
తెగించి వెంటబడితినా
యమునితో లేచిపోయిందంటుంది లోకం

అదంతా ఔట్ ఆఫ్ డేట్'— ఈ పాదాలలోని చమత్కారానికి హర్షిస్తే హర్షించవచ్చు. దైవాసుర సంపద్విభాగయోగః' అనే దానిలో కవి అందించిన వ్యంగ్యభావనకు సహృదయులు తలలూపక తప్పదు. వేషభాషలలో మనకన్నా నాజూకుగా కనిపించే అసురులే సంపద్విభాగ సమయంలో అన్యాయం చేసు వ్నట్లు వాపోయారు.

'యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత' అనే గేయం ఉత్తమమైన హేళన రచన. దిగంబర కవులను కావలసినంత తీవ్రంగా అపహాస్యం చేశారు కవి.

మా చేష్టలు వేరు
మా పేరులే వేరు
చివరికి మేం తినే తిండేవేరు' అని దిగంబర

కవులు చెప్పుకుంటున్న మాటలుగా ఉదహరించి

'మేం వస్ అయ్యకు కానేరాం వారసులం
ఆకాశగన్నుండి ఊడిపడ్డ పేవారసులం
కలంబడితిమా కానేకాం మనుషులం'

అనిగూడ అనిపించారు. ఈ విధమైన satire దిగంబర కవులకు తగినది. 'ది గ్రేట్ ఇండియన్ సర్కస్'లో ప్రజాప్రతినిధులనబడుతున్న వాళ్ళ శాసన సభా సర్కస్‌ఫీట్ల్లు, జంతుజాలపు చేష్టలు వికృతమై పౌరుల జీవితాన్ని భయావహంగా చిత్రించారు. ఇది సరియైన చిత్రణ. మరణశాసనం సుదీర్ఘమైనగీతం. చెప్పదలచుకొన్న భావాన్ని సూటిగా చెప్పారు. ఇది వీరి మిగిలిన గేయాలకంటె భిన్నమైనది.

శ్రీ సంపత్కుమార కవితల్లో 'గృహప్రవేశం'; 'రోజువారీ'; 'అపేక్షణ' 'ద్వైవిధ్యం' 'మనశ్శ్రుతం' మంచిగేయాలు. గేయాలని పేర్కొనటం సామాన్యార్థంలో నేగాని యీ కవులందరివీ వచనగీతికలే. 'గృహప్రవేశం'లో నాగరక జీవనమంతా కుళ్ళుగా భావించటం తప్పని, దాన్ని ఆనందమయం చేసుకోవచ్చు నన్న భావాన్ని వెల్లడించారు. పదములసోహళింపు శిల్పనైపుణ్యమూ యీ గేయంలో కన్పిస్తుంది. 'రోజువారీ' అనే గీతం రాజకీయ సమస్యతో ముడిపడింది. దేశం స్వయంసమృద్ధం కావాలన్న సత్సంకల్పాన్ని వెల్లడిస్తుంది. 'అపేక్షణ'లో సమాన రచన సాభిప్రాయమైనా, ఛందస్సు సమంగా సాగినా కొన్ని తేలిక పదాలు, కొన్ని సమాసాలు కావటంతో రచన సాఫీగా సాగలేదు. ద్వైవిధ్యం ఉత్తమ కవితా ఖండిక.

'ఇంద్రధనూరమణీయవిలాసం చిలికిస్తూ
చాంద్రీ ప్రసారమస్పృణత్వం విరియిస్తూ
ఊహాప్రహేళికావలోకన మొలికిస్తూ
ఊహాజలధరాంచలాల చరియిస్తూ, నీవు—
రేగిన ధూళిశకాలకు కళ్ళు నులిమి
(కమ్ముకొన్న కెంజీకట్ల నోడిలో పొదివి
పిట్టల్లో పల్లాల్లో కాళ్ళు తడబడి

గడియ గడియకూ వణుకుతూ వస్తిటిలి, 'నేను' ఇది ద్వైవిధ్యంలో ఒక భాగం. వచన కవితలు కథానకంగా ఉండటం సహజం కాబట్టి 'మనశ్శ్రుతం' పొడుగనిపించదు. కాని కావ్యాన్ని పొడిగించటంలో కొన్నిచోట్ల వచనగీతం వచన స్థాయికి దిగిపోయిందనక తప్పదు.

'బ్రతుకు భ్రమర కీటన్యాయం
వంచన దేహళీదత్తదీపం'

వంటి మాటలలోని భావవైశిత్యం ఇంపు గొలపుతుంది.

శ్రీ వే నరసింహారెడ్డిగారి కవితల్లో 'ఈ తమస్సు ఛిన్నాబడుతుంది'—'రఫ్ స్కెచ్'; 'విషాద విషాదయోగం'; 'నిద్ర నెరుగని మనస్సుతో'; అనేవి పసందుగా ఉండి పాఠకహృదయానికి తాకుతాయి. ఈ తమస్సు ఛిన్నాబడుతుంది అనటంలోనే ఆశాభావం ఉన్నది. అలాగే ఆగీతిక లోనూ ఆ సంకల్పం విన్పిస్తుంది. 'రఫ్ స్కెచ్' నేటి ఆధునికకవిగీయగలిగిన అద్భుత చిత్రం. 'నేస్తం

ఇక్కడంతా క్షామం
నాయకులు నానాగడ్డి కరుస్తున్నారు
పశువులు మేతలేక చస్తున్నవి'

అని తీవ్రంగా సాగుతుంది. 'విషాద విషాద యోగం'లో ఛందస్సు కవి చెప్పినట్లు ; అందంగా వొదిగింది. 'నిద్ర నెరుగని మనస్సుతో' అనే వచన గీతంలో గుండెలో కొండంత కుంపటిని దాచుకున్న నవీన కాలపు మానవుని విషాదజీవిత గాంభీర్యాన్ని ప్రదర్శించారు.

'నలుగురిలో ఏడ్వటం నాగరికత కాదని
యోగిలా నవ్వటం నేర్చుకున్నాను'

అని చెప్పిన మాటలు మనస్సును కదిల్చివేస్తాయి.

అభ్యుదయ కవిత్వంలో 'నయాగరా' కవుల ప్రభావం ఎంతటిదో వచన కవిత్వంలో చేతనావర్తం సృజించిన కవుల ప్రభావం అంత గాఢమైనది. 'చేతనావర్తం' వచనకవితాయుగంలో కొత్త శకాన్ని సృష్టించిందనటం అతిశయోక్తి కాదు.

—రామమోహనరాయ్.

## ఎమెస్కో పాకెట్ బుక్స్

ప్రతి పుస్తకం వెల రెండు రూపాయలతో, ప్రతి పుస్తకం దాదాపు రెండువందల పేజీలతో ఎమెస్కో పాకెట్‌బుక్స్ అనే పేరుతో యం. శేషాచలం అండ్ కో, మచిలీపట్నం, మద్రాసు, సికింద్రాబాద్ సంస్థ నెలకు నాలుగు పుస్తకాలు ప్రచురించాలని సంకల్పించి, మొదటి తడవగా, సెప్టెంబరు నెల పుస్తకాలుగా వెలువరించిన 1. దిండు క్రింది పోకచెక్క - శ్రీ విశ్వనాథ సత్యనారాయణ. 2. గ్రహణం విడిచింది—శ్రీమతి ద్వివేదుల విశాలాక్షి 3. బతికిన కాలేజీ - శ్రీ పాలగుమ్మి పద్మరాజు 4. సాక్షి—శ్రీ ముళ్లపూడి వెంకటరమణ— రచనలుచూచి ఆంధ్రపాఠక మహాజనం మంచి పుస్తకాలు చక్కని ముద్రణతో, రంగురంగుల ముఖచిత్రాలతో తక్కువ వెలకు లభ్యమయ్యాయని ఆనందించే అవకాశమూ ఉంది, ప్రచురణ సంస్థను అభినందించే స్థితీ ఉంది. ప్రతినెలా ప్రచురణ భాగ్యం పొందే అన్ని రచనలూ మహోత్తమ రచనలేనా? పోనీ ఉత్తమ రచనలేనా? అన్నది అవశ్యం ఆలోచింపదగింది.

## దిండుక్రింది పోకచెక్క

ఈ నవల పేరు ఎవరు ఎవరితో చెప్పినా ఎందుకు నవ్వుతారో, ఆ నవ్వుకు అర్థం ఏమిటో స్పష్టంగా చెప్పటం, చెప్పినా వినటం కష్టం.

అయితే రచయిత నవలా నామధేయానికి అర్థం చెప్పకపోలేదు. 'ఆ పురుషునియం (అత డేపురుషుడైనా కావచ్చు) దామె (ఆమె నీహారజాతి వనిత. ఆచారం ప్రకారం వేలావృక్ష పుష్పాలతో పెళ్లి జరిగిన స్త్రీ! ఆమె ఎందరితోనైనా సంసారం చేయవచ్చు. ఆమెకు వైధవ్యం ఉండదు) కిష్టము లేనిచో రాత్రి నిద్ర లేచిన తరువాత తెలవారుకడ వాని తలగడ దిండుక్రింద నామె యొక్క పచ్చిపోక చెక్కను పెట్టును. వాడు దానిని చూచుకొని ఇంక తనకు నామెకు సంబంధములేదని వెడలి పోవలెను.'

ఈ ఆచారంగానీ, ఆచారం ఉన్నట్టు కల్పనగానీ బాగున్నా బాగుగా లేకపోయినా చింతలేదు. ఈ పేరుమాత్రం నవలకు తగింది కాదు, అనిపిస్తుంది సరస పాఠక లోకానికి.

ఇందులో కథ వేరు. నవలపేరు వేరు. కథ కల్పన. వాస్తవంగా ఒక నాటి విషయం అనే అవకాశం చారిత్రాత్మకం కాదు. చరిత్ర తప్పుగా వ్రాయబడింది అనే వాళ్లలో మాట్లాడేందుకు ఆలోచించటంతప్ప ఏమీ ఉండదు. అయినా చరిత్ర లోపభూయిష్టం అని అంగీకరించినా, ఈ నవలలో ప్రతిపాదితమయిన విషయం హేతుబద్ధంగా కార్యకారణ సంబంధసముపేతంగాలేదు.

శాక్యముని అనబడినవాడు బుద్ధుడనీ, శాక్యసింహుడు అనబడ్డవాడు బుద్ధుడుకాడనీ, కాదు కాబట్టి మరొకడనీ, మరొకడంటే ఉత్తర దేశీయుడే కాడనీ, కాకపోతే ఆంధ్రుడనీ, జన్మవల్ల పేరు శాకయ్య అనీ, పిలవటంలో ఉండే లోపంవల్ల శాక్య అయిందనీ సింహం అంతపరాక్రమం ఉన్నవాడు గనుక శాక్యసింహుడు అనే పేరు వచ్చిందనీ, వాడు కపట యోగి అనీ, కుత్సితుడనీ, బుద్ధుడి రూపం అని ఆ యోగికి తెలియకుండానే పేరు వచ్చిందనీ, వచ్చిన దాన్ని నిలబెట్టుకో ప్రయత్నించాడనీ, పలువురు వనితల మానహరణం చేశాడనీ, ఆ పాపం అతన్ని దహించిందనీ, అతను కృష్ణ విరోధి అనీ—ఎన్నో అనరాని మాటలన్నీ రచింపబడ్డాయి శాక్యసింహుణ్ణి గూర్చి. చరిత్ర ఏ ఆధారాలవల్లనైనా ఋజువు చేయగల సత్యం కాదిది.

ఇదంతా కల్పన. కల్పన ఏ విధంగా ఉన్నా చిక్కు లేదు. చింతలేదు. కాబట్టి యథార్థ చరిత్ర దర్శనార్థం ఈ పుస్తకం ఎవరూ చదవరు. చదివినా చరిత్ర అంటే ఇదేనని నమ్మరు.

ఈ రచన కల్పనాప్రాయంగా స్వీకరించి చదువుకోవటం ప్రారంభించినప్పుడు కలిగే బాధ–ఎందుకు

ప్రసిద్ధమయిన నామధేయంగూర్చి ఇంత దారుణకల్పన చేయవలసివచ్చిందా—అని.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ వచన రచనా పద్ధతి ఆంధ్ర పాఠకలోకంలో దాదాపు అందరికీ తెలుసు. ఆ పద్ధతి విశిష్టమయింది అనలేకపోయినా విలక్షణమయింది. ఈ శైలి తెలియనివాళ్లు ఇదేం పుస్తకం పాడు పుస్తకం అనే పరిస్థితి వుంది. అల వాటు పడ్డవాళ్లు గాడిలో పడిపోతారు. ఆనందంగా చదువుతారు.

ఈ రెండో తెగవాళ్లు పుస్తకం చివరిదాకా మూయరు. ఏం విషయం వుంది, ఏం చదివాం అని ఆలోచించకుండా చదువుతారు. ఆ శైలిలో ఉన్న ప్రధాన గుణం అది. ఏవంవిధ రచనలోనే నవలా వైశిష్ట్యం నిక్షిప్తమయివుంది.

ఈ నవల చదువుతుంటే ఎదురయ్యే అనేక విషయాలలో అందరికి ఆనందం కలిగించే విషయం ఒక్కటే! పాత్రచిత్రణ! అదీ స్త్రీ పాత్ర చిత్రణ! పాత్రలను కళ్లకు కట్టినట్లు చిత్రించే నేర్పు రచయితకు వుంది. ఏ పాత్రఅయినా కళ్లలో నిలిచి పోతుంది. స్త్రీ పాత్రలలోఉన్న వైవిధ్యం మనస్సును ఆకట్టుకొంటుంది. ఎన్ని స్త్రీ పాత్రలు సృష్టించినా, ఆ పాత్రలన్నీ ప్రత్యేకవ్యక్తిత్వం కలిగివుంటాయి. ఒక స్త్రీ పాత్రలాగా మరో స్త్రీ పాత్ర ఉండదు అంతేకాదు. ఏ సంఘటన, సన్నివేశం, చిత్రించినా రచయిత ఆ సంఘటన, సన్నివేశం దర్శనీయంగా దృగ్గోచరం అయ్యేట్టుగా చిత్రించే సామర్థ్యం నవ లలో కనిపిస్తుంది. వరద వర్ణన, శాకయ్య దహించుకు పోవటం, శాకయ్య తిప్పలను నెట్టుకోబోవటం—ఇత్యాది సన్నివేశ చిత్రణ నేర్పుగా ఉంది. పఠితృ భావనా హృదయం ఆ పరిసరాలకు పరుగులు తీస్తుంది.

ఈ రచయితతో వచ్చిన చిక్కంతా కథా పథకం, కథ నడపటం, అపూర్వ సత్యాలు చెప్పాలని ప్రయత్నించటం.

ఈ నవలలో రచయిత మొదటి అధ్యాయం వ్రాసిందెందుకో, చెప్పిందేమిటో అర్థం కాదు. అయోమయం. అనవసరం.

మొదటిలో పరిచయమయిన విరాలంబ చిట్ట చివరిదాకా ఎవరో తెలియదు. అంతదూరాన్వయం అనవసరం.

శాకయ్యను బెదిరించిన - అర్ధరాత్రి బెదిరించిన వనిత—గీలా అని తెలుసుకోవటంగానీ, గీలాకి నిరా లంబ అని నామాంతరం వుంది అని గానీ 212 పేజీలోఉన్న ఒక్కవాక్యం ఆధారం లేకపోతే అర్థం గాదు.

ఇంత డొంక తిరుగుడు—ఇంత అన్వయ క్లిష్టత్వం అవసరం కావు.

ఈ నవల అయిదువేల సంవత్సరాలనాటి భారతదేశ స్థితి వర్ణించే పనికి పూనుకొంది. మంచిదే! కాని ఆ పని విజయవంతం కాదు.

ఈ నాడు పల్లెల్లో ఉండే వాతావరణం ఆనాటి పల్లెల్లో ఉందనుకోవటం వీలుకాదు. కృష్ణానదిలో వరదవస్తే ఎలా వుంటుందో, ఏ నదిలో వరదవచ్చినా ఆ విధంగానే వుండవచ్చుగానీ, అందులో కొట్టుకు వచ్చే వస్తువులు అచ్చంగా కృష్ణలో కొట్టుకువచ్చి నట్లే రావు.

రోడ్డుమీద గారడీవాడు ఒక పసిపిల్ల మెడ కోసినట్లు నటించి, గొంతుకోశాడని మనకు భ్రమ కలిగించి, డబ్బులు అడుక్కోవటం ప్రారంభించి, వెళ్ళి పొయ్యే వాళ్ళను, పోతే మీకే పాపం అంటుకొంటుం దని బెదిరించినట్లుగా వుంటుంది గోస్వామి ధోరణి. గోస్వామి నవలలోని ఉత్తమ పాత్ర!

నవంకాలం, మహాభారతకాలంతో సామీప్య సంబంధంచేత కురుక్షేత్ర విషయం కొంతలో కొంత ఈ నవలలో తీసుకురావటం - శ్రీ కృష్ణ దివ్యత్వం—ఆ ప్రయత్నం జరాసంధవధ—వీటన్నింటితో నవంకు చారిత్రకస్థాయి ప్రసాదించాలనే సంకల్పం - ఉచితజ్ఞు లయిన పాఠకుల సమక్షంలో వ్యర్థం అవుతుంది.

కపటవేషంలో సంచరించే శాకయ్య, భార్యనూ పిల్లల్నీ వదిలి ఉత్తరదేశం వెళ్లినవాడు, చాలాకాలం జీవించాలని కోరినవాడు, ఎదురైన స్త్రీలను అనుభ వించినవాడు—చివరికి అవస్థల పాలయినవాడు.

శృంగారం నరసంగాఉంటే సర్వజనామోదకరంగా

ఉంటుంది. శృంగార విషయ వర్ణన ఉన్నప్పుడు అసహ్యం కలగటం పాఠకులు ఈ నవలలో పసికిస్తారు.

గీతాను తిప్పిం అనుకొని శాకయ్య ప్రవర్తించిన తీరు జాంతవికంగా వుంది. ఆ శృంగారం సరసతకు బదులు విరసత, ఆనందం బదులు అసహ్యం కలిగిసు ంది.

ఈ నవలలో కథానాయకుడు ఎవరన్నది పెద్ద ప్రశ్నకాదు. కొందరు గోస్వామి ప్రధానపాత్ర అనుకొంటారు. అది కాదు. శాకయ్య ప్రధాన పాత్ర! దుర్మార్గానికి బలియై పోయిన పాత్ర!

రచయిత ఈ నవలలో చాలా అపూర్వ విషయాలు చెప్పాలని చేసిన ప్రయత్నం ఎక్కువగా వుంది. రాజులు – రాజ్యం – పాలనవంటి సామాన్య సంగతుల మీద రచయిత అభిప్రాయాలు పరస్పర విరుద్ధంగా, పరిహార్యాలుగా కనిపిస్తాయి.

యుగలక్షణాలు—ముఖ్యంగా కలియుగ లక్షణాలు రచయిత చెప్పటానికి చేసిన విపుల ప్రయత్నం ఆస్వాద యోగ్యంగానే వుంది. చెప్పిన విషయం పాతదే లయినా చెప్పిన తీరు క్రొత్తది. కొన్ని క్లిష్టమయిన శాస్త్రాలు ఈ రచయిత స్పష్టంగా చెప్పగల నేర్పుగల పండితుడు అని అందరూ అంగీకరించే తీరు ఈ నవలలో కనిపిస్తుంది.

అయిదువేల సంవత్సరాల పూర్వం జరిగిన ఈ నవలలో గోస్వామి అనే మంచి పాత్ర—దుష్టతను, శాకయ్యకు సంబంధించిన శృంగార దుష్టతను ఖండించిన పాత్ర, శాకయ్యతో పలికిన పలుకులు—

'అయిదువేల సంవత్సరములు కడచిన తరువాత నాంధ్రులలో నొకమహాగ్రంథకర్త యుదయించును. నీ యదార్థ స్వరూపమును నిరూపించును......వాడు కొదిలో జ్ఞానాగ్ని దగ్ధకర్ముడు...శివకేశవులకు పరమ భక్తుడు. బ్రహ్మపదార్థజ్ఞాత...ఇప్పుడు వానిపేరు గోస్వామి. అప్పుడేమో - వాడు వాక్స్వామి. వాక్పతి. ఆ వాక్కు సంస్కృత వాక్కుకాదు. అప్పటికాంధ్ర భాష యెట్లుండునో అది వాని వాక్కు. అది వాడు చేసికొనిన పురాకృత కర్మము. తనకోపమునంతయు నధర్మమునాడు తీర్చుకొనుచుండును. నీ మీదకూడ తీర్చును' అని 239, 240 పేజీలలో రచయిత వ్రాసిన తీరు తనను గూర్చి తాను కల్పితపాత్రద్వారా చెప్పుకోవటంలేదుకదా అనిపించక మానదు.

పండితుడు అయిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గ్రాంథికంగా నవలా రచనచేస్తూ వ్రాసిన భాష అంతా చిన్నయసూరి వ్యాకరణ సూత్రబద్ధంకాదు! ఎన్నో వ్యతిక్రమణలు.

మహోత్తమ రచనలు చేయగల శక్తి సామర్థ్యాలు, ప్రతిభావ్యుత్పత్తులు ఉన్న కవి, పండితుడు, నవలారచయిత, వ్యాసకర్త తనకున్న భాషాధికారం, పాత్రచిత్రణనైపుణ్యం, కథాకల్పనాచమత్కారం ఎలా అనవసరం, వ్యర్థం, పనికిమాలినవి అయిన పుస్తకాల రచనలో పాడుచేసుకొంటున్నదీ చూడాలంటే చదవవలసిన పుస్తకం 'దిండు క్రింది పోకచెక్క'.

## గ్రహణం విడిచింది

భర్త గతించిన తర్వాత, ధనవంతురాలయి, తనధనంకోసం అందరూ చుట్టుమూగుతున్నారనే సత్యాసత్యాల మధ్య అనుమానపు నీడలు సృష్టించుకొని, వెలుగును చూడటంకోసం ఎటోపారిపోయి, సర్వసంగపరిత్యాగులలోనూ ధనాశఉందని అనుకొని మళ్ళీ పారిపోతూ జ్ఞానోదయం పొందిన ఒక విశ్వస్త వృత్తాంతం ఈ నవల.

'గ్రహణం విడిచింది' అన్నపేరు నవలకు సర్వ సమర్థంగా సరిపోదు. ఈ గ్రహణం సూర్యగ్రహణం. సూర్యుడికి గ్రహణం పడితే కొంతకాలం లోకంలో చీకటి. కథానాయిక—భారతికి గ్రహణంపడితే ఏ జీవితంలోనూ చీకటి రాలేదు. సూర్యకరాలకున్నంత దయాదాక్షిణ్యాలు భారతి కరాలకు లేవు. సూర్యుడికి పట్టిన గ్రహణం విడిపోతే సర్వసృష్టి – ప్రకృతి— హసిస్తుంది. భారతికివట్టిన అనుమానగ్రహణం విడిపోతే ఆమెకే మేలు.

ఒక పీడమనస్తత్వం పాడుబుద్ధి ఉన్న విధవ మనస్సులో చెలరేగే అనుమానం క్షణక్షణం తాచ్చే రూపం చూపించాలని రచయిత్రి శ్రీమతి ద్వివేదుల విశాలాక్షి చేసిన ప్రయత్నం అపరిపక్వంగా ప్రదర్శిత మయిననవల 'గ్రహణం విడిచింది'.

ధనాశాపరులు చుట్టుముట్టిఉన్న జీవిత సంగ్రామం సంగ్రహంగా చిత్రించే ఈ నవలలో అందరూ ధనాంధులేగానీ తదన్యంగా ఏ పాత్ర కింది న్మాత్ర విశిష్టంగా భాసించే దశను అందుకోలేదు.

సన్యాసి పాత్రసృష్టి ప్రయోజనంకూడా స్పష్టంగాతేల్చి చెప్పబడలేదు. సంశయాకులచిత్తంతో సందర్శించిన ప్రతిసంగతినీ పరిశీలించే కథానాయిక గుణవిధానంవల్ల నవలరూపం అదోమాదిరిగా తయారయింది.

నవలలో విషయవిశిష్టతతోపాటు, పాత్ర చిత్రణ నేర్పుతోపాటు, అనేక ఇతరేతర గుణ సమూహంతోపాటు నవలచెప్పే పద్ధతికూడా ముఖ్యమయిందే!

నవల అంతా ఉత్తమపురుషలో చెప్పటం తెలుగు సాహిత్యంలో క్రొత్తపద్ధతి. అటువంటి విధానం ఇంతకు పూర్వం లేదు. ఈ మధ్యనే కలిగింది.

తెలుగులో ఉత్తమ పురుషలో చెప్పబడిన మొదటి నవల సౌభాగ్యవతి. ఆ పద్ధతిలో చెప్పబడిన రెండవ నవల 'గ్రహణం విడిచింది'.

ఉత్తమ పురుషలో నవలచెప్పే విధానం ఆంధ్ర అంకురార్పణమయింది. అధికతరంగా ద్ధి చెందితే బాగుంటుంది.

శ్రీ గడేపల్లి కుక్కుటేశ్వరరావు నవల 'రాలి రాలని పువ్వు'. ఆ నవలలో భార్య చనిపోతే రెండో పెళ్ళి చేసుకొని, ప్రత్యక్ష విషయంలో గతించిన భార్యను తలుచుకొంటూ బాధపడటం ఉంటుంది.

'ఈ గ్రహణం విడిచింది'లో భర్త చనిపోతే రెండోపెళ్లి చేసుకోవాలనే తలంపుతోఉన్న స్త్రీ ప్రత్యక్షవిషయంలోనూ గతించిన భర్తను గుర్తుకు తెచ్చుకొని కుమిలిపోతూ వుంటుంది.

శ్రీ సింగరాజు రామచంద్రమూర్తి రచించిన కథానిక నవజీవనం ఒక సచిత్ర వారపత్రికలో ప్రకటింపబడింది.

అందులో కుటుంబ పరిస్థితి కారణంగా కథానాయిక ధనవంతుడైన వృద్ధుణ్ణి వివాహమాడుతుంది. వృద్ధుడు గతించిన తర్వాత, ఆమె డబ్బుకోసం కుటుంబం అంతా ఆమెను ఎలా పీడించింది, బాధపెట్టింది స్పష్టంగా కన్పిస్తుంది. ఈ కుటుంబ బాధ నివారణార్థం ఆమె మళ్ళీ పెళ్లి చేసుకొంటుంది.

'గ్రహణం విడిచింది'లో భర్త మరణానంతరం ఆస్తికి వారసురాలు అయిన భారతి కుటుంబంలో ఉన్న అందరూ డబ్బుకోసం ఆమెను పీడిస్తున్న తీరు కనబడుతుంది. ఆ బాధోపశమనార్థం భారతి పెళ్ళికి సిద్ధమవుతుంది.

నవజీవనంలో కథానాయికఅన్న చెల్లిడబ్బుతో వ్యాపారం చేస్తాడు. 'గ్రహణం విడిచింది'లో భారతి అన్న ఆమెడబ్బుతో వ్యాపారం చేస్తాడు.

శ్రీమతి ద్వివేదుల విశాలాక్షి నవల 'గ్రహణం విడిచింది' చదువుతుంటే పాఠకులకు ఇంతకుపూర్వం పరిచయమున్న అనేక కథానికలు నవలలు గుర్తుకు వస్తాయి.

ఆంధ్ర సాహిత్యంలో వచ్చిన పలురచనల ప్రభావం ఈ నవలపై వుంది.

ఎందుకో ఈ నవల అంతా అతుకుల బొంత లాగా కనిపిస్తుంది. స్వతంత్రతాతేజస్సు అల్పమాత్రంగానే గోచరిస్తుంది.

ఈ నవలలో మరుపురాని సన్నివేశం లేదు. భారతి పాత్రతప్ప. పాఠకులు గుర్తుంచుకోగలిగే పాత్ర మరేదీ లేదు.

## బ్రతికిన కాలేజీ

శ్రీ పాలగుమ్మి పద్మరాజు రచించిన ఈ నవల 'ఆంధ్రప్రదేశ్'లో (ప్రభుత్వ మాసపత్రిక) చదివి పాఠకులు ఆనందించారు. రేడియోనాటికగా విని సంతోషించారు. నాటకీయతగల నవల 'బ్రతికిన కాలేజీ'.

ఈ మానవలోకం 'జూ' అని చెప్పటానికి బహుళ ప్రచారంలో ఉన్న పదమయిన 'బ్రతికిన కాలేజీ' నవలకు పేరుగా ఏరుకోవటంలో ఔచిత్యం వుంది.

ఈ నవల తీరు చూస్తే నాటకంగా ఆలోచింపబడి నవలగా రూపొందిందేమో అనిపించే అవ

కాశం వుంది. పాత్రల ప్రవర్తనకంటే మాటలు పాఠకుల్ని ఆకట్టుకొంటాయి.

హాస్యం రసస్థాయిలో ప్రత్యక్షర రమ్యంగా స్థాపించటం తేలికకాదు. ఈ రచయిత తదితర రచనలతో పోల్చిచూస్తే ఈ నవల తీరుతెన్నులు వేరుగా గోచరిస్తాయి.

ఈ నవలలో హాస్యం సంభాషణ గతంగా సమృద్ధిగా వుంది. ఏ పాత్ర పలికినా నవ్వు పుడుతుంది. సన్నివేశగతమైన హాస్యం ఉంది. సంఘర్షణగతమైన హాస్యం ఉంది.

మిష్టర్ చింతా మాటలు చేతలు చాలా గడుసుగా దురుసుగా దూకుడుగా వుంటాయి. ఆ పాత్ర హాస్యం కొద్దిలో కొద్ది అపహాస్యంగా భాసించే అవకాశం ఉంది.

ఇద్దరమ్మాయిలు అక్కచెల్లెళ్ళు! కల్యాణి పూర్వకాలం పిల్ల! రాధ గడుగ్గాయి! ఒకరు దిగులు పడుతుంటే పాఠకులకు నవ్వు! మరొకరు ఎగిరి పడుతుంటే నవ్వు!

ఇద్దరబ్బాయిలు స్నేహితులు! పట్నాయి, పట్టిన పట్టు విడవకుండా పట్టే ప్రేమ పిచ్చివాడు. మిస్టర్ చింతా చీకూ చింతలేని ఖాతరులేని జీవితం జులుం చుట్టుకుపోయే తెలుగుబిడ్డ.

ఈ నాలుగూ ప్రధాన పాత్రలు. వీటిచుట్టూ అల్లుకుపోయిన పాత్రలు ఎన్నో ఉన్నాయి! అన్నీ హాస్యం దగ్గరకు చేరుకొన్నాయి. జీవితం అంతా ఇంత హాస్యంగా ఆటకాయతనంగా ఉంటుందా అంటే ఉండదు. ఈ నవలలో జీవిత చిత్రణ చేయాలనీ ప్రయత్నించలేదు. కనిపించిన పాత్రలు ఎన్నుకొని కావలసినహాస్యం సృష్టించాలనేది రచయిత అభీష్టం! అది అడ్డమాకలు లేకుండా సాగిపోయింది.

పట్నాయి పెళ్ళికివెళుతూ చేసిన కారు ప్రయాణం చదువుతుంటే పాఠకులు పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వుతారు. చూడని పిల్లను పెళ్ళి చేసుకోవలసివచ్చి పట్నాయి పెళ్ళి పందిట్లోంచి ఎగిరిన ఎగురుడు నవ్వు తెప్పిస్తుంది. రాధ కిటికీదగ్గర చేరి పట్నాయి 'హృదయకుసుమాలు' చదవటం నవ్వు పుట్టిస్తుంది. ఇదంతా జీవితంకాదు. హాస్యం.

కల్యాణి పెళ్ళి ఆగిపోయిందే అన్న దిగులు ఏ చదువరికీ కలగదు. ఆగితే ఆగిందికానీ ఎంతహాయిగా ఆగిపోయిందీ అనిపిస్తుంది.

జాతకాల పిచ్చినాళ్ళు ఇద్దరు కొట్లాటలోకి దిగితే పెళ్ళి సంబంధం కుదరకపోతే పోతుందిగానీ తగాదా బాగుందనిపిస్తుంది.

శాంతమ్మ దొడ్డఇల్లాలు! సరిగ్గా అవసరం అయిన సందర్భంలో ఆమెకు రాగలమూర్ఛ అంతకంటే దొడ్డది.

ప్రపంచం తల్లక్రిందులయినా, కొంపకాలిపోతున్నా యోగాసనాలు మానని కామన్న మహామనిషి! అంతమనిషిని ఉన్నపళంగా చుట్టలు టీలు తాగించిన మిష్టర్ చింతా మరీ గొప్పవాడు.

పట్నాయికు దెయ్యం పట్టిందని నలుగురూ పట్టుబట్టి తలగొరగటానికి తయారయిన తీరు ఇంత హాస్య నవలలోనూ హృదయం కదిలిసుంది.

నృత్య ప్రదర్శనవాడు పట్నాయి తిన్న దెబ్బలు మరువరావు. పట్నాయిదగ్గర కామన్న నేర్చుకొన్న కుస్తీ పట్టుకు గురిఅయిన పోలీసు ఇక్కట్టు కనికట్టులాంటిది.

శ్రీ పాలగుమ్మి పద్మరాజు రచనలో స్పష్టత ముఖ్యగుణం. వాక్యాలు తలాతోకా లేకుండా సా[illegible]ం, భావాలు ఎడాపెడా పెడసరంగా లాక్కుపోవటం, సాగిపోవటంవంటివి ఈ నవలలో కనిపించవు.

కానీ నృత్యనాటిక ప్రదర్శనలో మిష్టర్ చింతా చూపిన నేర్పు మరింతస్పష్టంగా వ్రాసి వుండవలసింది.

మిష్టర్ చింతా రెండంచులు పదునుగల కత్తి! మాటపడడు. మాట అంటాడు. ఎన్నో చెబుతాడు. ఏదీ వినడు. చిరుతపులివంటి మనిషిని పిల్లిపిల్లను చేస్తాడు. గమ్మత్తయిన, విచిత్రమయిన విశిష్టమయిన పాత్ర మిష్టర్ చింతా!

'కన్యాశుల్కం'లో గిరీశం, 'మాష్టర్జీ'లో మాష్టర్జి, 'ఇన్స్పెక్టర్ జనరల్'లో ఇన్స్పెక్టర్—వీళ్లతో మిష్టర్ చింతా పాత్రకు పోలికలున్నాయి. ఈ పాత్రకు ఆత్మగతావేశం, ఆ పాత్రలనుంచి సంక్రమించి ఉండవచ్చు.

పనిలో పనిగా నాటక ప్రయోగంలో ఉండే కష్టసుఖాలు చెప్పటానికి రచయిత చేసిన ప్రయత్నం నవలలో గోచరమవుతుంది. మస్తాన్ పాత్ర ఉన్నంతలో ఉత్సాహంగా తయారయింది. అతని భార్యకూడా అంత తేలికగా మరుపురాదు.

హాస్యంకోసం సృష్టింపబడినవే అయినా పాత్రలు చాలావరకు, ఆ పరిధి నతిక్రమించి తమ వ్యక్తిత్వం నిలుపుకొన్నాయి. ముఖ్యంగా చెప్పదగిన పాత్రలు ఆ కోవలో రామలింగయ్య శర్మ.

ఒక ఉత్తమ రచయిత ఏ విధమయిన రచన చేసినా సమాజసందర్శనం చేయింపగలడనీ, కళ్లకు కట్టినట్లు పాత్రలను చిత్రించగలడనీ, ఈ నవల చదివిన తర్వాత పాఠకులు పోల్చుకొంటారు.

శ్రీ పాలగుమ్మి పద్మరాజు ధ్యేయం హాస్యరస పరిపోషకంగా రచన చేయాలని. అది నెరవేరింది. అంతేకాకుండా సమాజం, కొన్ని పాత్రలు కళ్ళఎదుట ప్రత్యక్షం అవుతాయి.

ఈ నవల పరిపూర్ణంగా జీవిత చిత్రణకాదని, కాలేదని తెలిసికొన్న రచయిత ఔచిత్య విచారానికి నిదర్శనం 'నా సంజాయిషీ'లో చివరి వాక్యాలు.

'అసాధ్యమయింది సాధించాలని పూనుకొన్నాను. నా వైఫల్యం మీ కర్పిస్తున్నాను'

రచయిత పొందిన విఫలత్వం ఈ 'బ్రతికిన కాలేజీ'. ఈ నవల చదువుతూ పాఠకులు పున్నర్కం వెలక్కూ, చదివినందుకు ఖర్చు అయిన కాలానికి సాఫల్యం పొందుతారు.

## సాక్షి

'సాక్షి' చిత్రంలోని సంభాషణలు యథాతథంగా పొందుపరచిన పూర్తి సినిమా స్క్రిప్టు'.

ఇందులో సంభాషణలు మాత్రమే లేవు; స్థలమూ, స్థలవర్ణనమూ, నటనానుకూల సూచనలు విపులంగా చెప్పబడి ఉన్నాయి. సన్నివేశ వర్ణనం కూడా ఉంది.

శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ వ్రాసిన ఈ సాక్షిలో సుమారు పాతికేళ్ళ క్రితం కోనసీమలో ఎటువంటి తెలుగు ప్రయుక్తమవుతూ వుండేది, పల్లెలలోని జనం తీరు తెన్నులు ఎలా వుండేవి, చూపటానికి ప్రయత్నం జరిగింది.

రచయిత రెండువిధాల కృతకృత్యుడు. సజీవమైన భాషను సజీవంగా వ్రాయగలగటం. పల్లె వాతావరణం కళ్లకు ప్రత్యక్షీకరించటం. పల్లెవాతావరణంలో ప్రకృతి, మానవ ప్రకృతి రెండూ అంత రస్ఫుటంగా నిలిచి వున్నాయి. పల్లె చుట్టుపట్ల ఉన్న ప్రకృతి చక్కగా చిత్రీకరింపబడింది.

పల్లె ప్రజలు కట్టుబొట్లు, మానాభిమానాలు తీరుతెన్నులు, ఆశలూ, ఆకాంక్షయూ, జీవిత విధానం, పట్టణ నాగరికతతో అప్పుడే కలుషితం కావటం ప్రారంభించిన పల్లెప్రజల మనస్తత్వాలు, ఊరి పెద్దల దౌర్జన్యాలు, కండబలమూ, గుండెబలమూ గల వ్యక్తులు, కుట్రలు, కుయుక్తులుచేసే మనుష్యులు—వివిధ పిధాలుగా పల్లె వాతావరణం గోచరమవుతుంది.

ఆత్మార్పణ చేసుకొన్నంత అధికంగా ప్రేమించగల స్త్రీలు గోచరమయ్యే ఈ సాక్షి ఆధారంగా, ఆ సమాజం ఊహించుకొంటే అక్కడేమీ విపర్యస్తం కంక్కపోతే, ఈ రచన గొప్పది.

ఫకీరు అంతటి దుర్మార్గుడు, కిష్టప్ప అంతటి అమాయకుడు ఎక్కడైనా వుంటారా అన్నది సినిమా చూచినతర్వాత చాలామంది అడుక్కొన్న ప్రశ్న! సినిమాగా కాకుండా, నాటకంగానో, నవలగానో నవలానాటకంగానో ఈ సాక్షి చదివితే అటువంటి అనుమానం రావటానికి అవకాశం అల్పం మాత్రమే!

ఫకీరు దుర్మార్గుడే! అతని దుష్టతకూ అవధి వుంది. కిష్టప్ప అమాయకుడే! అమాయకత్వానికి హద్దు వుంది. అవధినీ హద్దునూ సాక్షి

లోనే చూపించిన రచయిత జాగ్రత్త కలిగివున్నట్లే!

అయితే ఆ పాత్రల చిత్రణలో అతిశయోక్తి ఉంది. గుణలేశం గుణాధికంగా చూపించటం, కాదంటే, దోషలేశం అధికతరంగా ప్రదర్శించటం స్పష్టంగా భాపాటంగా ఈ రచనలో గోచరిస్తుంది.

కథా రచనలో రచయిత సాధించిన నిపుణత ఉదాత్తమయింది. కథను అల్లుకోవటంలో త్రిప్పిన మెలికలు చుట్టుకుపోయిన పాత్రలు విధి చేతిలో కీలుబొమ్మలులాగా సంచరించాయి.

చెల్లికి అన్నపై ఉండే ఆత్మీయత, భర్తపై ఉండే అనురాగం మధ్య సంఘర్షణవస్తే ఫలితం ఇలా వుంటుంది అని సాక్షిలో చూపిన రీతి సహజతకు సాన్నిహిత్యంలో ఉంది.

పురుషత్వం పై మమకారం పెంచుకొన్న స్త్రీ పురుషుడిలో నెలకొన్న దుష్టతను గ్రహించలేదనీ, బంధువులందరకూ దూరమయి పోవటం అయినా సహిస్తుందని చెప్పిన తీరు వాస్తవికతకు చేరువలో ఉంది.

అవసరం ఉన్నంతవరకు ఆప్యాయత నటించి, అది తీరిపోగానే అసలు రంగులో కనిపించే మనుష్యుల మధ్య అమాయకుడైన అర్భకుడు పొందిన అగచాట్లు కన్నీళ్లు తెప్పిస్తాయి.

కొన్ని చక్కనిసూక్తులు రచనలో రూపొందాయి.

శారీరకబలంకంటే దైవబలం గొప్పది అనే పౌరాణికసత్యం ప్రదర్శితమయింది.

రెచ్చగొడితే చచ్చుపిల్లి అయినా తిరగబడుతుందని తెలియజెప్పినట్లు అయింది.

రచయితగా పలువురకు పరిచయమైన శ్రీ ముళ్లపూడి వెంకటరమణ ఈ రచనలో ఏ లోపమూ రానీయలేదు.

గుండెధైర్యం ఉన్న రచయిత మాత్రమే సినిమా స్క్రిప్టును పుస్తకంగా వెలువరించటానికి ప్రయత్నిస్తాడు. ఆ ధైర్యం ఈ రచయితకు ఉంది.

## భామిని - బ్రహ్మచారి

[కథల సంపుటి. రచయిత: శ్రీ సింగరాజు రామచంద్రమూర్తి, ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ-2. వెల: సాదా: రూ 3—50. మేలు: రూ. 4-50. తొమ్మిది కథలు. 220 పేజీలు]

ఆంధ్రులకు హాస్యం అంటే అమితాసక్తి. హాస్య రచనలు కలిగించినంత ఆనందం తెలుగుదేశంలో తదితర రచనలు ప్రసాదించటం లేదేమోననిపిస్తుంది.

'భామిని—బ్రహ్మచారి' హాస్యకథ. అదే పేరు, పుస్తకానికి నామధేయం. రచయితకు హాస్యంపైగల మక్కువకు నిదర్శనం. 'ఆద్యంతాల మధ్య ఆతను'లో పాఠకుణ్ణి నవ్వించాలని రచయిత తాపత్రయం. పాఠకులు నవ్వుతారు.

ఇతర కథలలోనూ అక్కడక్కడ యువతీ యువకుల సంభాషణలోనూ క్రొత్తగా పెళ్ళయిన, పెళ్ళయి ఎంతకాలం అయినా, క్రొత్తదనం తగ్గని దంపతుల సంభాషణలలోనూ హాస్యం సుతారంగా పరామర్శ చేస్తుంది.

ఈ రచయిత తన కథలు అన్నీ హాస్య రచనలు, హాస్యరసరమ్యాలుగా రూపొందిస్తే బాగుండుండేమో ననుకొన్న వారికి మిగతా కథలు ప్రశ్నలుగా, ఎదురై వంకరలు తిరిగి, సూటిగా కళ్లలోకి చూసాయి.

కాబట్టి ఈ రచయిత విషాదరచనలు, విషాదాంత రచనలూ వ్రాసితీరవలసిందే!

కుడిఎడమల డాల్‌కత్తులు మెరియగ వీధి భాగవతంలో మహారాజు ప్రవేశిస్తాడు. ఆ చేయి ఈ చేయి అని లెక్కలేకుండా, లెక్కాజమా లేకుండా బాణప్రయోగం చేసేవాట్ట అర్జునుడు. అలాగే వీరైతే మరోలాగా, హాస్యరస పారవశ్య రచనలు, కరుణరస పారమ్య రచనలు శ్రీ సింగరాజు రామచంద్రమూర్తి రచించితేనే నలుగురూ చదివి ఆనందిసారు.

రచయిత కరుణాత్మక కథలు చిత్రించి, పాఠకుల కన్నులు చెమ్మగిల్లేట్లు చేయగల సామర్థ్యం ఈ సంపుటిలో ఉన్న 'నవజీవనం' (మంచి మలుపు ఉన్న రచన. సావిత్రి చివరలో తీసుకొన్న నిర్ణయం రెండు విధాలా శ్రేష్ఠమయింది. హార్దికదృష్టితో సావిత్రి జీవితం అలాగే సాగిపోయివుంటే, మార్పు లేకుండా, పాఠకుల గుండెలు చిత్రహింసకు గురిఅయి

వుండేవి) 'తెల్లవారింది' (మీనాక్షిలో మార్పు సాంసారికమయింది. భాస్కరంలో ఉదాత్తత ఉన్నవలసిం దానికంటే అధికమే అయినా ఆస్వాదయోగ్యం. సుందరం కథారంభంలోనూ రానురానూ చూపిన దుడుకుతనం పతాక సన్నివేశంలో నీరు గారిపోవటమే ఉచితం. ముగింపు ముచ్చటగా వుంది) మామూలు కథలు.

ఈ కథలకంటే 'పరాజితుడు', 'ఆంతర్యం', 'దూరపుకొండలు', పాఠకుల మనస్సులలో చెరిగిపోని ముద్రలు వేస్తాయి.

'పరాజితుడు' ఒక పరిశోధన. జీవితపు విలువల నిర్ణయానికి ఒక కృషి. ఆదర్శం పిరికితనంగా మారితే, కాదంటే పిరికితనం బట్టలు మార్చుకొని ఆదర్శంగా తలయెత్తితే ఎంతో ప్రమాదకరం. శంకరం. ఆదర్శవాదో, పిరికివాడో, పాఠకులు ఆలోచించాలి. విశ్వం అవకాశవాది అనుకొంటే, జీవితం యొక్క రూపం తారుమారు అవుతుంది. జీవిత దర్శనం చేయాలనుకొంటే విశ్వం విశ్వరూపంతో గోచరిస్తాడు. జానకి ప్రవర్తన యువజనోచితమయిందే! ఆమె తుది నిర్ణయాలు రెండూ అదే విధమయినవే! యువకుడే అయినా యువతకు అతీతుడయిన శంకరం గుండె మీద సమ్మెట దెబ్బలు ఆమె నిర్ణయాలు! ఎందుకు కొందరి జీవితాలు ఇలా అవుతాయి? ఈ ప్రశ్నే 'పరాజితుడు'

'ఆంతర్యం' మరుపురానికథ. కొడుకు తల్లికి దూరం కాగలడా అన్నది ప్రశ్న! సాధారణంగా కాలేడనే చెప్పాలి. కాని సంగతి సందర్భాలు కలసివస్తే కావచ్చు. అలాగే అయ్యాడు మధు. అయితే అయ్యాడు కానీ రాజేశ్వరి సంగతి ఏమిటి? ఆమె అర్థంకాని స్త్రీత్వానికి సంకేతం. బాధపడిందో, సంతోషపడిందో తెలియని, తెలియనీయని, జీవితం అనుభవించింది. ఆమె జీవితంనుంచి నిష్క్రమించిందని రచయిత అనుకోదల్చ లేదు. పాఠకులూ అనుకోవాలనుకోరు. కానీ అనుకోక తప్పదు.

'దూరపుకొండలు' నిజంగా దూరపుకొండలే! వాటి శిఖరాలు అధిరోహించటం అనుకొన్నంత తేలిక కాదు. స్వాతంత్ర్యానంతరం అమాయకమైన పల్లెల వాతావరణాలు అర్థంకాకుండాపోతున్నాయి. నలుగురు యువతీయువకుల మధ్య నాజూకుగా నడచే కథ అయినా పల్లె జీవితం చూపటంచేత ఈ కథ విశిష్టత కలిగివుంది. రాజకీయం వాసన—చెడ్డవాసనకొట్టే పల్లె వాతావరణంలో సుగుణసంపద సంతరించుకొన్న యువతీ యువకులు పొందిన అపనిందలు, మనస్తాపాలు విచిత్రంగానే వున్నా కథ వెన్నెముకలో బలం వుంది.

'భవదీయుడు — బంతిపూలు' వస్తైక్యం లేని కథ. కల్పన బాగున్నా, వాతావరణం బాగున్నా, మనస్తత్త్వ చిత్రణ ఎలావున్నా, అనవసరం అయిన సంఘటనలవల్ల పొడుగూ వెడల్పూ అడ్డుమాకలు లేకుండా పెరిగిపోయిన కథ.

'పరిష్కారం' ప్రారంభం పాఠకులను చదివిస్తుంది. సగంనుంచి అనవసరం అయిన కథ మొదలయి బాధ కలుగుతుంది. ముగింపు నీరసంగావుంది. ఆనందరావు కథానాయకుడే కావచ్చు. ఆ కథ వ్రాయవలసిన తీరు అది కాదు. ఎలాగో ప్రారంభించిన కథ ఎలానో ముగిస్తే చదువరులకు ఎలానో వుంటుంది.

శ్రీ సింగరాజు రామచంద్రమూర్తి కథా రచయితగా పలువురకు పరిచయం ఉన్నవ్యక్తి. ఈ కథలు చదివి అధిక సంఖ్య జనం ఆనందపడతారు.

ప్రకాశకులు పరాజితుడు ముద్రణలో పొరపాటు రాకుండాచూచి వుండవలసింది.

అచ్చుతప్పులు అధికంగా లేవు. వేసవి మండుటెండలాగా వెలలేదు.

హాస్య రచనకంటే కరుణాత్మకసృష్టి రచయిత బాగా చేయవచ్చునని, ఈ రచయితను భావితరం గుర్తుంచుకోగలిగేది. హృదయం కదిలించే విషాదాంత రచనల మూలంగానే అని, అభిప్రాయం.

శ్రీ సింగరాజు రామచంద్రమూర్తి రచించే రచనలకోసం ఆంధ్రపాఠకలోకం ఎదురుచూస్తుంది.

'భామిని — బ్రహ్మచారి' కథల సంపుటి ఎక్కువమంది పాఠకుల ఆదరణకు పాత్రమవుతుంది.

—రవి.

## జాతిరత్నం

[కావ్యం. కవి: డా|| సి. నారాయణరెడ్డి. ప్రచురణ- యం. శేషాచలం అండ్ కంపెనీ. మద్రాసు: మచిలీపట్టణము: సికిందరాబాదు. ప్రాప్తిస్థానము: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతి రోడ్డు: సికిందరాబాదు, వెల: పేపర్‌బేక్, రూ 4-00. హార్డ్ బౌండ్ రూ. 5-00. డీలక్స్ రూ. 7-00.]

జాతిరత్నం జవహర్‌లాల్ నెహ్రూ. ఆ మహా వ్యక్తి జీవిత చరిత్రను దిఙ్మాత్రంగా ప్రదర్శిస్తున్న కావ్యం జాతిరత్నం.

భారతీయులకు సంప్రదాయంమీద మక్కువ ఎక్కువ. అది ధర్మం. మోతీలాల్ భారతీయ చరిత్రను అలంకరించాడు. జాతిని నడిపించాడు. జవహర్‌లాల్ భారత చరిత్రలో భాగమయ్యాడు. భాగస్వామి అయ్యాడు. శ్రీమతి ఇందిరాగాంధీ తండ్రి తాతల ఆనందభవనానికి వారసత్వం పొందినట్లే, జాతి జీవితానికీ వారసత్వపు హక్కు సంపాదించుకొన్నది. రేపు ఆమె పుత్రు లిద్దరు చిరంజీవులు, తాతముత్తాత లంతటివాళ్ళు కావచ్చు. ఇదీ భారతీయ సంప్రదాయ గౌరవం, ఆచారం.

పూర్వం కావ్యరచనకు కారణాలు రెండు. భగవంతుడు—ఏ రూపంలో అయినా కావచ్చు—కవికి కలలో కనిపించి కావ్యరచనకు ప్రోత్సహించటం ఒకటి. మహారాజు నిండుసభలో కవిని ఫలానా కావ్యం రచించమని అభ్యర్థించటం, మరొకటి. అలాంటి హేతువులు ఆధునికులకు లేవు. హృదయం వుంది. హృదయగతమైన స్పందన వుంది. ఆ స్పందన ఆదేశమై కావ్యరచన జరుగుతుంది. డా. సినారె హృదయస్పందన కావ్యరచనకు హేతువు.

కావ్యం కన్నబిడ్డతో సమానం. సప్త సంతానాలలో విశిష్టమయిందిగానూ కావ్యం చెప్పబడింది. కావ్యకర్త, తత్కావ్య పితృదేవుడు. కావ్యభర్త, తత్కావ్యకన్యామణి భర్త. ఈ జాతిరత్నం శ్రీమతి ఇందిరాగాంధీకి సమర్పింపబడింది. అంకితం చేయబడలేదు.

జాతిరత్నమైన జవహర్‌లాల్ జీవిత చరిత్ర ఇతివృత్తంగా మలచబడ్డ కావ్యం జాతిరత్నం. నెహ్రూ హృదయరత్నమైన శ్రీమతి ఇందిరాగాంధీకి సమర్పింపబడటం సముచితంగా వుంది. సమాదరపాత్రంగామా వుంది.

శ్రీ పా. వెం రాజమన్నారు, శ్రీమతి ఇందిరా గాంధీని 'ఎర్రగులాబీ'గా భావించటం సరసంగా వుంది. కవితారామణీయకంగా వుంది. సరస హృదయుల హృదయోల్లాసకరంగా వుంది.

డా. సినారె ఈ కావ్యరచనలో చూపిన మెలకువ కథానికావిధానం. ఈ పద్ధతి ఎక్కువ ప్రయోజనకారిగా, ఈ కావ్యరచనలో కనిపించింది. ఈ నేర్పు విశిష్టమయింది.

అనేకస్థలాలలో ముడిపడిఉన్న నెహ్రూ చరిత్రలో స్థలైక్యం సాధించటానికీ, ఒక శతాబ్దిలో ముప్పాతికభాగం పరుచుకొన్న నెహ్రూ జీవితంలో కాలైక్యం సాధించటానికీ, అనేకులతో అల్లుకుపోయిన నెహ్రూ జీవితంలో పాత్రైక్యం సాధించటానికీ, అనవసర సంఘటనలు, సన్నివేశాలు అంటే కవితా దృష్టితో- కవితారామణీయంగా ఉండని విషయాలు రచననుంచి తొలగించుకోవటానికీ అనేకవిధాల ఉపయోగపడిన ఏకైకపాత్ర 'గులాబీ.'

గులాబీ ప్రధానపాత్ర. గులాబీ నెహ్రూ హృదయానికి సంకేతం. గులాబీ కవితో మాట్లాడుతుంది. కవికి కథలు చెబుతుంది. జవహర్‌లాల్ జీవితంలోని కవితారచనానుకూలత ఉన్న ప్రధాన ఘట్టాలు క్రమంగా చెప్పుకుపోతుంది గులాబి. గులాబి ముఖంలో మార్పులు వస్తుంటాయి, మాటల్లో, పరిణతి వస్తూవుంటుంది, రచనలో.

కథానికా లక్షణాలలో మొదటి లక్షణం కథా ప్రారంభంలోని రచన కథనంతా చదివించే నేర్పుకలిగి వుండటం. బలవత్తరమైన సంఘటనతో అందుకే కథారచన ప్రారంభిస్తారు రచయితలు. డా. సినారె ఆ లక్షణం కావ్యరచనలో, నెహ్రూ జీవితంలో అంతిమ ఘట్టం స్వీకరించి రచించటంతో, ప్రవేశపెట్టినట్లే! ఆపైన నెహ్రూ జీవితం మొదటినుంచీ రచింపబడింది. కథానికా పఠన ప్రేరితులగు పాఠకులు సరసులు చక్కని కథ చదువుతున్నంత ఉత్సాహంతో ఈ జాతిరత్నం పఠిస్తారు.

కావ్యంలో ప్రధాన పాత్రలు గులాబీ, కవి. ఆ పాత్రలమధ్య అనుసంధింపబడినఆత్మ నెహ్రూ. ఈ జాతిరత్నం శిల్పసిద్ధి పొందిన కావ్యం.

కావ్యంలో వ్యక్తంచేసిన భావాలు ఒక్కకనివే కావు. నెహ్రూవి కొన్ని, టాగూరువు కొన్ని. తది తరాలు మరికొన్ని. కవివి మ రిన్ని.

నెహ్రూ రాజకీయవేత్త కాకపోతే మంచి కవి అయివుండేవాడు. ఆ మహనీయుడు వ్యక్తంచేసే భావాలు చాలావరకు కవితాకళ్యాణఖండికలులాగా అనేక స్థలాలలో, ఇతరేతర సంఘటనలలో స్పష్టమవుతాయి.

1947, ఆగష్టు 14 వ తారీఖు రాత్రి 12 గంటలకు నెహ్రూ జాతి నుద్దేశించి పలికిన పలుకులు, ఆవేశపరవశుడయిన అభ్యుదయ కాంక్షి అయిన కవి, రాజకీయవేత్త అయితే ఎలా వుంటాయో అలా వున్నాయి. అంతే కాదు. నెహ్రూ మరణ శాసనం అత్యుత్తమ కవితాఖండిక, అటువంటివి ఎన్నో. నెహ్రూ కుమార్తెకు వ్రాసిన ఉత్తరాలు చరిత్ర చెప్పేవే అయినా కవితా స్పర్శలో కళకళ లాడినవే! 'ఇది వీరారు వెలిగించిన దీపం',అని నాగార్జున సాగర్‌చెంత వృద్ధుడైన వ్యక్తి పలికిన మాట విని నెహ్రూ పులకించిపోవటానికి ఆ మహనీయుడి కవితా హృదయం నిదర్శనం.

నెహ్రూ వస్తుతః కవి. జీవితం కవితామయం. ప్రతిఘట్టరసమయం. డా॥ నారాయణరెడ్డి కవి. సాహిత్యంలోనూ జీవితంలోనూ కవి. కవితాహృదయం పుష్కలంగావున్న కవి. ఈ కవి, ఆ కవినిగూర్చి చేసిన కవితాగానం రసరమ్యంగా వుంది. పాఠకులకు ఈ జాతిరత్నం ఆనందం కలిగిస్తుంది'. అంతకంటే అధికంగా అదనంగా రాజకీయ పాఠకులకు మరింత మక్కువ కల్గిస్తుంది కల్పిస్తుంది.

ఉక్తివైచిత్రి డా. సినారె కలం కులికే కులుకుల హిమాలయాలలో ఎవరెష్టు, ఎంత నేర్పుగా భావాలు మలుచుకోవచ్చునో చూచి, మధ్యతరం యువకవులు పాళీలకు పదును పెట్టుకొంటారు.

కవితారచన ఈ తావున శిఖరప్రాయం అనటానికి జాతిరత్నంలోని చాలా భాగాలు చూపింపవచ్చు.

'ఆనంద భవన కుడ్యము
లం దొటెగిన చిరుదివ్వియ' మాదిరిగా ఉన్న నెహ్రూ.

'తొలిరాతిరి దుర్గమ్మున
పలుకరించు శుక్లపక్ష
చంద్రరేఖ తన కొక ఆ
శా పతాకగా వెలిసెను' అని తలపోసెను.

కవితకు ఛందస్సు మణిమయహారం అని డా. సినారె ఒప్పుకోవచ్చు.

ఈ కావ్యంలో మాత్రాచ్ఛందస్సహిత కవిత ఉంది. వచనకవిత వుంది. ప్రకరణాని కొక పద్ధతి. మేలిగుణమే! కానీ ఒకే ప్రకరణంలో పై ద్వివిధ కవిత గోచరించి పాఠకుల హృదయగమనం గతుకులలో పడుతుంది.

డా॥ నారాయణరెడ్డి వ్రాసే మాత్రాఛ్ఛందస్సు గల కవితపట్ల రసికలోకం అభిమానం పెంచుకొంది. వచనకవితపట్ల పూర్వం అభిమానంలేదు. ఇప్పుడు కలుగుతుందా అన్నది ప్రశ్న! కలగవచ్చుకానీ కలిగించగలిగినంత సామర్థ్యం డా. సినారె వచన కవితలో లేదు. మాత్రాచ్ఛందస్సులో అనల్పస్ఫూర్తి కలిగించే ఈ కవి, కవిత ఆ విధంగా వ్రాస్తేనే బాగా వుంటుందేమో నన్నది ఆశ!

వచనకవితవైపు మొగ్గుతున్న కవితాలోకం తీరు చూచి,తానూ మారాలని తలంచే కవి హృదయం గొప్పది. ఈ కావ్యంలో ఆ ప్రయత్నం చాలలేదు.

ఎందుకో ఈ కావ్యంలో డా॥ నారాయణరెడ్డి పూర్వకవితాస్ఫూర్తి గోచరింపలేదు. అన్యవధి కారణం కావచ్చు. విషయగతవైపుల్యం కారణం కావచ్చు. విషయసేకరణాధిక్యవశ్యా, విషయవ్యక్తీకరణానాధిక్యం వాటిల్లివుండవచ్చు. సరసులకు ఈ జాతిరత్నం దర్శించిం తర్వాత నిరాశ కలగక పోవచ్చుగానీ, అత్యంతానందం మాత్రం కలగదు.

భాష విషయం పేర్కొనక తప్పదు. మామూలుగా ఈ కవి వ్రాసే గ్రాంథిక పద్ధతిలో రచన విశిష్టంగానే వుంది. ప్రత్యేకంగా వ్యవహారికం వ్రాయటమూ ఆహ్లాదకరంగానే వుంది.

అయితే ఇంత ఏర్పాటు చేసుకొన్నా, గ్రాంథికంలో వ్యావహారికం, వ్యావహారికంలో గ్రాంథికం తల చూపిన తావులు అధికంకాదుగానీ అసలులేకపోలేదు. ఆ పద్ధతి పరిహరింపబడుతుందని ఆశించటం అత్యాశ కాదు.

పాకిస్థానం, పాకిస్తానం—ఈ రెండు రూపాలలో ఏది సరిఅయిందో; 'చూచు' ధాతువు పైరూపాలు చూసి అనక చూచి అంటే చూసింది అనక చూచింది అంటే బాగుంటుందేమో, కవీ, వ్యాకరణజ్ఞులు ఆలోచిస్తారు గాక!

ఈ జాతిరత్నం డా॥ సి. నారాయణరెడ్డి కవితా జీవితంలో నూతనత్వం కలిగింపకపోయినా, నూతనస్థాయిని ప్రసాదింప లేకపోయినా, ఉన్న స్థాయిన్ని, సాహితీజీవితాన్ని పోషిస్తుంది.

## కారణభూతుడు

[రెండు నవలికలు. రచయిత శ్రీ మధురాంతకం రాజారాం. ప్రాప్తిస్థానం : భారతి ప్రచురణలు, చిత్తూరు. వెల రూ. 2-25. పేజీలు 120.]

ఈ పుస్తకంలో రెండు రచన లున్నాయి. 1. కారణభూతుడు. 2. మరీచిక. ఈ రెండు నవలికలని ప్రచురణకర్తల అభిప్రాయం. అవినవలికలు కావు. పెద్ద కథలు.

కథారచయితగా శ్రీ మధురాంతకం రాజారాంను గూర్చి పాఠకులకు పరిచయం చేయవలసిన అవసరం లేదు. అనేక పత్రికలలో అనేక కథలు—ఈ రచయితవి—ముద్రితాలు. ప్రస్తుతం కథలువ్రాసే పాతికమందిలో శ్రీ మధురాంతకం రాజారాం ప్రముఖస్థానంగూర్చి సందేహం లేదు.

రచయితల జీవితాలు అన్నీ ఆదర్శ ప్రేరితాలు కావు. అన్నీ ఆత్మహింసకు అంగీకరింపవు. తిన్నగా పెరిగి పోవలసిన మొక్క వంగిపోతే పిలకలు వందలు ఎలు

అయితే రచయిత జీవితం సాఫీగా సాగిపోకపోతే ఏమవుతుంది ?

సమాధానం : ఏమయినా అవుతుంది.

పాళీ పదును తెలుసుకోవాలని తలచే వ్యక్తి అవశ్యం పరిశీలించి అర్థం చేసుకోదగిన రచన 'కారణభూతుడు.'

దేశంమీద దేశం పగబూనితే ఫలితం యుద్ధం. సమర్థుడికి సమాజంమీద క్రోధం ప్రబలితే యుద్ధం. అసమర్థుడి ద్వేషం అంతర్యుద్ధం. యుద్ధం ఆత్మలో. యుద్ధం సంఘంలో.

కొన్ని యుద్ధాలలో మంటలు, సెగలు, పొగలు, రక్తపాతం ప్రాణనష్టం!

కొన్ని యుద్ధాలలో విరోధాలు, తగాదాలు, స్నేహితుల మధ్య తలెత్తుతాయి.

'కారణభూతుడు' ఒక పట్నంలో భయంకర వాతావరణం కల్పించిన కారణభూతుడు.

అతనలా కావటానికి ఎవరు కారణభూతులు? ఆ సమాజం. అటువంటి సమాజాలు!

అయినా రచయితలకు హృదయం వుందంటారు. రచయితలు హృదయవాదు లంటారు. సంఘశ్రేయస్కాము లంటారు.

అటువంటి రచయితలు ఇటువంటి పనులు చేయగలరా? చేయగలరు.

అందుకు నిదర్శనంగా—పఠింపవలసిన పెద్ద కథ—(ప్రచురణకర్తల దృష్టిలో నవలిక) 'కారణభూతుడు.'

నాగరికత అంటే ఏమిటి?

ఈ ప్రశ్న చిన్నదికాదు—

శ్రీ మధురాంతకం రాజారాం ఈ ప్రశ్న వేసుకొని సమాధానం చెప్పాలని చేసిన ప్రయత్నం 'మరీచిక'.

భారతదేశం వ్యావసాయిక దేశం. ఈ దేశంలోని నగరాలు ముఖ్యంగా పారిశ్రామిక నగరాలు. ఇప్పుడు పల్లెలు వ్యవసాయానికి, నగరాలు పరిశ్రమలకు ఆటపట్టులని స్థూలంగా చెప్పవచ్చు.

నగరంలో ఉన్నదంతా నాగరికతా? కాదు.

పల్లెల్లో ఉన్నదంతా అనాగరికతా? కాదు.

ఏది నాగరికతో తెలియక జీవితం కంటక ప్రాయంగా చేసుకొన్న స్త్రీ శోభ!

ఏది నాగరికతో కించిన్మాత్రంగా తెలిసికూడా జీవిత వాంఛాపూర్తి చేసుకోని వ్యక్తి ప్రకాశం.

ఇది సంధి సమయం. ఇటువంటి అవ్యవస్థ తప్పదు.

వ్యవసాయం పై జీవించే కుటుంబం గూర్చి చెప్పిన రచయిత, పరిశ్రమలపై జీవించే కుటుంబం గూర్చికూడా విపులంగా చెప్పివుంటే రచన ఇంకా రాణింపుకు వచ్చివుండేది.

ప్రకాశం మామకుటుంబం పరిశ్రమల ఫలితంగా చిత్రించి వుండవలసింది. పాఠకులు ప్రారంభంలో అలా ఆశించే అవకాశం, ఆ పాత్రకారులు మార్చిన సూచన ఉన్నప్పుడు ఉంది.

ఏమయినా శోభవిషాద పాఠకుల సానుభూతి సర్వం కేంద్రీకరింపబడుతుంది.

ప్రకాశం జీవితంలో రాజీపడినట్లు కనిపిస్తుందికానీ విజయం సాధించినట్లు కాదు.

శ్రీ మధురాంతకం రాజారాం ఈ రెండు పెద్ద కథలలో పల్లె వాతావరణం చిత్రించిన తీరు అభినందనార్హం. సమాజ చిత్రీకరణ సజీవంగా వుంది.

పాత్రల రూపరేఖలు తీర్చిదిద్దే ప్రయత్నం ఈ రచయిత ఇతర కథలలో ఉన్నంత ఠీవిగా ఈ రచనల లోనూ ద్యోతకం అవుతుంది.

పాత్రల బాహిర ఆంతర రూపాలు పాఠకులకు చక్కగా గోచరమవుతాయి.

కథను తిన్నగా, అడ్డమాకలు లేకుండా నడిపించటంలో రచయిత ప్రజ్ఞాశాలి.

చక్కని ఫుట్‌బాల్ ఆటగాడు, నేర్పుగా గోల్‌దగ్గరకు బంతి తీసుకుపోయి, అనాయాసంగా గోల్‌చేసినట్లు, ఈ రచయిత కథను ఉపసంహారాభిముఖంగా తీసుకుపోయి ముచ్చటగా ముగింపు సాధించటం నేర్పుకు నిదర్శనం.

బలమున్న కథలు ఎన్నుకొని, చక్కని శైలిలో రచనలు చేయగల శ్రీ మధురాంతకం రాజారాం అనవసర విషయాలు తొలగిస్తే బాగుంటుంది.

'కారణభూతుడు' ఆరంభంలో ఉపోద్ఘాతం వంటిది అనవసరం. అంతేకాదు. 'పతిగారు' చేసిన ఉపన్యాసం అనవసరం. ఆ పాత్ర అనవసరం.

ఒక్కపనికోసం ఒక పాత్ర సృష్టించుకోవటం రచయిత ప్రాథమికదశకు నిదర్శనం అవుతుంది. ఒక్క పల్లె వాతావరణం తెలియచేయటానికి ఒకపాత్రను అన్నిహంగులతో సృష్టించి, ఆ పైన ఆ పాత్రను మరచి పోవటం రచనామర్యాదకాదు.

శోభ 'బర్త్‌డే' కార్యక్రమంలో దైర్ఘ్యం తగ్గించవచ్చు. అక్కడ ఇతరేతర పాత్రల విపుల వర్ణనం కూడా అనవసరమే!

అనవసర పాత్రలు, వర్ణనలు సంఘటనలు తొలగించుకొంటే, ఇంత సజీవంగా ఉన్నరచనలు తెలుగు సాహిత్యంలో అరుదు.

—మనోరాణి.

## నన్నయ్య నుడులు

[గ్రంథకర్త: శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి. ప్రధానసంపాదకుడు: శ్రీ పురిపండా అప్పలస్వామి. ప్రకాశకులు: కవితా సమితి, విశాఖపట్టణము. మూల్యము: నాలుగు రూపాయలు.]

నన్నయ్యగారు భారత రచనలో ఉపయోగించిన క్రియాపదములయొక్క స్వప్రయోగమైన కూర్పు ఈ గ్రంథము. దీనిని సమకూర్చిన శ్రీ రామచంద్రశాస్త్రిగారు మహావిద్వాంసులు. బహుముఖప్రజ్ఞావంతులు. ఆయన పరమపదించిన పదునారు సంవత్సరముల తరువాత ఇన్నాటికి శ్రీ అప్పలస్వామిగారు, శ్రీ జయంతి సుబ్బారావుగారు, శ్రీ అన్నావఝుల కామేశ్వరరావుగారు కలిసి శ్రమించి ఈ గ్రంథమును సంపాదించి ముద్రించి ఆంధ్రభాషావాఙ్మయముల కొక నూత్నదీప్తిని కల్గించినారు. ఇందు కేతయు నా త్రిమూర్తులు అభినందనీయులు. నన్నయ్య ఏ క్రియాపదమును ఎన్నిరకములుగా ఎన్నచోట్ల ప్రయోగించినదియు చూపించుట ఈ గ్రంథము తాత్ప

ర్యము. ఆ తాత్పర్యముతోడనే గ్రంథకర్త దీనిని సమకూర్చినాడు. ఆయన జైలులోనుండి దీనిని కూర్చినాడు. ఆయన లేనప్పుడిది ప్రచురింపబడినది. అంగాకారణములవలన ఈ క్రియాపదకోశము ఉండవలసినంత బందోబస్తుగాలేదు. సంపాదకులు ఈ తీసికొన్న శ్రద్ధకంటె మరికొంత ఎక్కువ శ్రద్ధను, శ్రమను తీసికొనియుండవలసినది. ఏ భారత ప్రతి ననుసరించి ఇందలి ప్రయోగములకు సంఖ్య లీయబడినవో సంపాదకులు సూచింపవలయును. ఫలానా సంవత్సరపు ఫలానా సంస్థవారి ప్రతిఅని చెప్పనందున మనవద్ద గల ఏదో ముద్రితప్రతి తీసి చూచినచో అక్కడక్కడ ఆ ప్రయోగములు ముందువెనుకలమీద ఎక్కడోగాని కనిపించవు. పదములు అకారాదిగా కూర్చుటలో కూడ క్రిందుమీదులున్నవి. కొన్నిపదముల కొన్ని రూపములకు ప్రయోగము లియ్యబడలేదు. ఆ రూపము నన్నయ్య వాడలేదా? వాడిన ప్రయోగము గుర్తింపబడలేదా? ఈ మేరకు సమాధానము చెప్పుట సంపాదకుల బాధ్యతయేయై యున్నది. ఈ గ్రంథస్వరూప స్వభావములనుగూర్చి సంపాదకులు పీఠిక కూడ వ్రాయలేదు. వ్రాసియుండవలసినది. గ్రంథములో నుపయోగింపబడిన సంజ్ఞలు వివరింపబడినవి. అందులో ని: నిర్వచనోత్తర రామాయణము అని యున్నది. నన్నయ్య భారతములోని క్రియాపదముల కోశమున నిర్వచనోత్తర రామాయణము ప్రవేశించుట లోని సామంజస్యమును సంపాదకులెట్లు భావించిరో తెలియుట లేదు. 82వ పుటలో 'కుంగినన్: ని 4-125' అని యున్నది. ఇచట ప్రయోగము లేదు. సంపాదకులు ప్రయోగముకొరకు చూచియుండవలయును. చూడలేదు. చూచినచో నిర్వచనోత్తర రామాయణము నాల్గవ ఆశ్వాసమున మొత్తము 101 పద్యములు మాత్రమే కలవుగాని 125 లేవని తెలిసియుండెడిది. ఇంతకును ఆ 'ని' అను సంజ్ఞ అచట ఎందుకుంచబడినదో తెలియుట లేదు. అది ఈ గ్రంథమును సమకూర్చిన శ్రీ రామచంద్రశాస్త్రిగారుంచినదో? సంపాదకులు చేర్చినదో? గ్రంథమున పోను పోను ఒక్కొక్కపదస్వరూపమున కొక్కొక్క ప్రయోగముమాత్రమే కలదు. మొదటి ఒకటి రెండుపుటలలో కూడ సంపదకు లాపద్ధతినే అనుసరించి యుండవలసినది. అట్లుగాక అయిదారు ప్రయోగములు చూపబడినవి. లభించిన శ్రీరామచంద్రశాస్త్రిగారి 'బాదామీ కాగితాలమీది చీమతలకాయల్లాంటి అక్షరాల'తోనున్న ఈ గ్రంథాన్ని 'అచ్చుకోసం ఎత్తిరాయడం' లోనే సంపాదకులు భూతఅద్దాలు ఉపయోగించారుగాని గ్రంథములోని విషయమును సక్రమముగా సమరించుటలో నుపయోగించలేదు. అందువలన ఈ గ్రంథమున ప్రసక్తించుట కవకాశములేని నిర్వచనోత్తర రామాయణ ప్రయోగములు అక్కడక్కడ ప్రసక్తించుట, ఉండవలసినచోటికి ప్రయోగములు లేకుండుట, అకారాది క్రమము వరుసదప్పుట—ఉదాహరింపబడిన ప్రయోగములు మధ్యమధ్య అర్థవంతములుగా లేకుండుట, ద్రుతప్రకృతికములమీద అచ్చులను నిలువుచు ముందు అర్థానుస్వారము లుండుట — ఈ మొదలయిన అసందర్భములు చోటు చేసికొన్నవి.

ఆంధ్రభాషావాఙ్మయములకు అనన్యమైన సేవ చేసిపోయిన శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి కృషి ఇంత వెలుగులోనికి తెచ్చిన విశాఖపట్టణ కవితా సమితివారు, సంపాదించిన సంపాదకులు అభినందనీయులు. అసలు గ్రంథమున్నచో తప్పులు దిద్దబడగలవు. నన్నయగారి భాషాప్రయోగ వైలక్షణ్యమును పరిశీలించువారికి ఈ గ్రంథము పెన్నిధివంటిది. సాహిత్యాభిమానులు సమాదరించు గ్రంథ మిది.

—క్షేమేంద్ర.

### మల్లి పాటలు

రచయిత—శ్రీ చౌడూరి గోపాలరావు, పుటలు—226. వెల: రూ. 2-00. ప్రాప్తిస్థానం—సరోజినీ ప్రచురణలు, మహబూబు నగరము.

### సోవియట్‌శాస్త్ర పరిశోధనలు

సంకలనం, అనువాదం—శ్రీ కొండేపూడి లక్ష్మీనారాయణ. పుటలు: 250. సాధారణ రూ. 4-50.